సాధన గ్రంథ మండలి - 93.



# ఆత్మతత్త్వము



కృతికర్త:
శ్రీ మట్టిపాటి వేంకటనరసింహారావు

కృతిభర్త:
శ్రీ శ్రియానందనాథులు
శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మ



ప్రకాశకులు:
సాధన గ్రంథ మండలి, తెనాలి.

 [వెల రు. 2=00

శ్రీ విశ్వావసు - శ్రావణము
1965



* *
*

జానకిరాం ప్రెస్, తెనాలి.

శ్రీ భాగవతుల కుటుంబశాస్త్రి, M. A., చిలకలపూడి.
(కృష్ణా జిల్లా)

## మనసులో మాటలు

"ఆత్మతత్త్వము" అను గ్రంథమునకు పీఠికను వ్రాయవలసినదని శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు నాకు సూచించినారు. అపుడు నా మనసున కలిగిన భావములను వివరించుటయే ఈ రచనకు లక్ష్యము. వాస్తవమును తెలుపవలెనన్నచో, శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు, ఆత్మతత్త్వ రచయితలు శ్రీ నరసింహారావుగారు, వీరి గురువులు శ్రీ శ్రియానందనాథాపరనాములు శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారు - ఈ ముగ్గురియందును నాకు ఈర్ష్య, అసూయలేగాని ఆదరము లేదు.

శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారు విద్వత్కవులు, పండితులు, శరీరమలములను నాశనముచేయగల ఆయుర్వేదవైద్యులు మాత్రమేగాక, మన్త్రశాస్త్రముచే మానసికమలములనుగూడ పోగొట్టగలవారు. శ్రీవిద్యాసంప్రదాయ ప్రవర్తకులు, సిద్ధి నొందిన సాధకులు. శిష్యభక్తకోటి మనసుల నపహరించినారు. వారును నావలెనే బడిపంతులే అయియు, నాకంటె నన్నివిధముల అధికులైనారు. కీర్తి నార్జించినారు. వారి ఆధిక్యము నావంటివారికి న్యూనతను కలిగించినది. ఇతరులకు న్యూనత నాపాదించునంతటి గొప్పతనమును వారేల సంపాదింపవలయును? నన్నుగూడ నొక శిష్యునిగ గ్రహించియున్నచో నాకసూయ కలిగెడిది కాదేమో!

ఇక శ్రీ నరసింహారావుగారిని గుఱించి – ఆయన గుర్వనుగ్రహమునకు పాత్రులైనారు. నేను గుర్వాగ్రహమునకు భాజనమైనాను. గురుభక్తులలో నగ్రేసరులలో నొకరు శ్రీ నరసింహారావుగారు. కాకున్నచో అప్రస్తుతముగ కనుపడుచున్నను ఈ ఆత్మతత్త్వగ్రంథమునందు, ప్రత్యేకముగ శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మ శబ్దనిర్వచన మేల యుండవలయును ? గురుభక్తియనిన నాకు కిట్టదు. గురుభక్తిరహితులలో నగ్రేసరుడను నేను. ఇట్లాయన యొకవిధముగ గొప్ప యగుచో, నేను మఱియొక విధముగ గొప్పవాడను. ఇంకొకవిధముగఁ జూచినచో నాయన కంటె నే నధికుడనే. ఆయన గురూక్తులను, ఉపదేశములను మననము చేసికొని, అనుష్ఠానమునం దుంచుకొని, జిజ్ఞాసువుల నుద్దేశించి, వానిని గ్రంథరూపమున ప్రకటించినారు. ఆ ప్రకటనము వలన వచ్చు ధనమును వారాశింపక, ప్రకాశకులకే ఆ ధనము నిచ్చి, దానివలన తమ గురురచనములను గూడ ప్రకాశమునొందుట కవకాశము కల్పించినారు. కాని ఈ అన్నిటి వలనను గురుభక్తులని కీర్తి నార్జించినారు. ఇంకను ఏవో ఆశయము లున్నవనుకొనవచ్చును. ఏమైనను వీరు తమ కీర్తికి, సిద్ధికి తమ గురువులకు ఋణపడియున్నారు. నేనుమాత్ర మట్లు ఋణపడిలేను. 'గురో రధీతమ్ గురవే నివేదితమ్' అందుచే నేను వారిని గౌరవింపలేను.

శ్రీ సూర్యప్రకాశశాస్త్రిగారు అచ్చమైన తెనుగు పండితులు. ఆధ్యాత్మికగ్రంథ ప్రచురణ మీయన కొక వ్యసనము. కాకున్నచో లాభాలాభముల విచారణము లేకయే, 94 ఆధ్యాత్మిక గ్రంథములను ప్రచురించినవారిని మీరు చూచినారా ?



కొలది దినములలో 100 గ్రంథములను ప్రకటించినారను పేరున శతగ్రంథ ప్రకటనోత్సవమును జరుపుకొనవలయునని ఈయనకు సంకల్పము లేదందురా ? ఇది ప్రజాస్వామ్యయుగము. లోకములో అధికసంఖ్యాకులు శృంగారకథలను, నవలలను చదువుదురు. అటువంటి గ్రంథములను ప్రకటింపక ఈ ఆధ్యాత్మిక గ్రంథములను ప్రకటించువారిని, ఎదురీత యీదువారిని ఈ యుగము సహించునా ? ఈ యుగమునకు ప్రతినిధినైన నేను వీరి నెట్లభినందింపగలను ? అసలు పై ముగ్గురువ్యక్తులు "ధనమార్జయ కాకుత్స్థ ధనమూల మిదం జగత్" అను వాక్యార్థమును మనసున నుంచుకొనని అలోకజ్ఞులుగాదా? ఇట్లు చూచినచో వీరియం దనాదరమే కలుగుచున్నది. అధీతిబోధాచరణ ప్రచారణదక్షులు, లోకహితైషులనుమాటను నే నంగీకరింపను. వీరియం దా లక్షణము లుండుటచే నేను వీరి నాదరింపను.

గ్రంథము :— ఈ గ్రంథమునందలి విషయమును పరిశీలింతము. ఇందు మొదట అక్షరబ్రహ్మస్వరూపమును వర్ణించినారు. తరువాత సృష్టిక్రమమును వివరించినారు. పంచీకరణ ప్రక్రియను అతివిశదముగ నిరూపించినారు. పంచకోశ వివరణము, ప్రణవస్వరూపము, శరీరత్రయము, విశ్వతైజస ప్రాజ్ఞులు మొదలగు ననేకవిషయములను వర్ణించినారు. అవసరమగుచోట్ల ఆయా శబ్దములకు వ్యుత్పత్తిపూర్వకముగ అర్థములను స్పష్టముగ వివరించినారు. ఇటువంటి గ్రంథ మింతకుముందున్నదా ? అనిపించును. కాని ఇందలి విషయములు అపూర్వములు కావుగదా ! వేదములు ఉపనిషత్తులలో నున్నవేగదా ? మఱి ఈ గ్రంథముయొక్క విశిష్టత ఏమి ? రచయిత లోకమాట అన

వచ్చును. "1. ఇందలి విషయముల నింత సరళముగ నిదివఱకు బోధించినవారు లేరు. 2. ఈ గ్రంథమునందు ఔపనిషద మతమునేగాదు, శాక్తసంప్రదాయమునుగూడ వివరించినాను. శ్రీవిద్యా సంప్రదాయము — వేదాంతమతమునకు, అద్వైత వేదాంతమునకు వెలిపైనదిగాదని సూచించుటకు యత్నించినాను. పరా పశ్యంత్యాది వాక్స్వరూపములను వివరించినాను ఇది అపూర్వముగాదా" — సత్యమే. నేనును అంగీకరింతును.

కాని, ఒకమాట. ఇందలి విషయములు ప్రమాణము లగునా? ఈనాడు సైన్సు నాకు తెలియుననుకొనువారి మాటలు, పరాత్పర సంధానమును విద్య యని అధ్యయనము చేయువారి మాటలు - ఇవియే ప్రమాణములుకాని వేదవాక్యములు అపౌరుషేయములైనను, మహర్షులు ఆ వేదవాక్యముల ప్రమాణత్వమును అనుభవపూర్వకముగ తెలిసికొనినామని ఉద్ఘోషించినను వానిని నేను విశ్వసింపను గదా! అయినపుడు ఇందలి విషయములపై నాకేల యాదరముండవలయును? నేను కోతినుండి పుట్టినాననియే నమ్ముచున్నాను. నేను బ్రహ్మనుండి పుట్టలేదు. బ్రహ్మను కాదు.

ఇక గ్రంథస్థవిషయ ప్రయోజనమును గుఱించి విచారింతము. సృష్టిప్రక్రియను, ఆత్మతత్త్వమును తెలిసికొనినను, ఆ విషయములు ప్రమాణములే అని అంగీకరించినను, వానివలన కలుగు ప్రయోజనమేమి? పంచదార ఎట్లు తయారైనదో తెలిసినంతమాత్రమున ప్రయోజనమేమి? ఆత్మతత్త్వమును, సృష్టిప్రక్రియను తెలిసికొనినందువలన ప్రయోజనమున్నది. ఇంద్రియాదులు, పంచభూతములు, చిత్తాహంకారాదులు



"నేను" కాదు అని తెలియును. "నేతి నేతి" అను నుపనిషద్వాక్యసరణి ననుసరించి ఇవి యన్నియుకాక మిగిలినది నేనే_ పరబ్రహ్మనే — "అహం బ్రహ్మాస్మి" అను భావన కలుగును. అపుడు జీవన్ముక్తి లభించును_లేదా_"సువర్ణాజ్జాయ మానస్య సువర్ణత్వం హి నిశ్చితమ్" అను రీతిని బ్రహ్మనుండి పుట్టిన ప్రపంచము_విభిన్నరూపముగ కనుపించు ప్రపంచము_బ్రహ్మకంటె భిన్నముకాదు_"న ఇతి న" ఇది బ్రహ్మకాదు అని కాదు_ సర్వం బ్రహ్మమయం_ "నేహానా నాస్తికించన" మొదలగు వాక్యముల యర్థము అనుభవములోనికి వచ్చును. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనునపుడు "బాధాయాం సామానాధికరణ్యమా" "అభేదే సామానాధికరణ్యమా" అను వాదములను శాస్త్రజ్ఞులకు, వాదకుశలురకు వదలివేయుదము. అనుభవమువలన తెలిసికొనుటకు యత్నింతము అనుభవజ్ఞుల నడిగి తెలిసికొందము. అంతకుముందు సాధన కుపక్రమించినచో ఆ విషయము మనకే అనుభవమునకు రాగలదు. పంచదారను నోటిలో వేసికొని దాని రుచిని తెలిసికొందము. ఇట్లు విచారించినచో ఈ సృష్టిప్రక్రియను గుఱించిన విచారణము తుదకు స్వస్వరూపావగతి కుపయోగించును కదా! అని అనవచ్చును. నిజమే. కాని!

అసలు ఈ సృష్టివిషయమై అనేకాభిప్రాయము లున్నవి కదా! వేదాంతుల మతమొకటి, పూర్వమీమాంసకుల మతమొకటి. సాంఖ్యుల సిద్ధాంత మొకటి, తార్కికుల తీరొకటి. పంచీకరణమని యొకరందురు. త్రివృత్ కరణమనియు నొకపదము వినవచ్చును. నామరూపాత్మకసృష్టిని గ్రహించి పరా పశ్యం

త్త్వాది స్వరూపమును వివరించినారు వైయాకరణులు. ఈ పరా పశ్యంతీ వాక్కుల స్వరూపమును నిరూపించుటయందును వైయాకరణులకు, త్రిపురాసంప్రదాయమునకును, భాస్కరాచార్య మతమునకును కొంతకొంత భేదమున్నదనుచున్నారు పండితులు. ఇట్లు మతభేదములు కనుపడుచున్నవిగదా! ఇట్లే ఆత్మతత్త్వ విషయమునందును భిన్నాభిప్రాయము లున్నవికదా! 'ఋషయశ్చ భిన్నాః – మతయశ్చ భిన్నాః' – వీనిలో నేది ప్రమాణము? ఇవియన్నియు సాధకుల నుద్దేశించి చెప్పిన యుపాయములు మాత్రమే. అధికారిభేదమును, అనుభవభేదమును పురస్కరించుకొని వచ్చినవి. వాస్తవమున "న నిరోధో నచోత్పత్తిః" అను విషయము సాధకునకు చరమదశయందవగతమగును. అందుచే, వాదములను వదలి సాధన కుపక్రమింపవలయును. అపుడీ గ్రంథమునందలి విషయములకు ప్రయోజనమున్నది – అని అనుచున్నారా? సత్యమే.

ఈ గ్రంథమునందు, కఠోపనిషత్తునందు వర్ణితమైన "అశ్వత్థవృక్ష నిరూపణ" మున్నది. భగవద్గీతయందును ఈ వృక్షప్రశంస యున్నది. చెప్పిచెప్పి, చివరకు ఈ సంసారవృక్షమును "అసంగశస్త్రేణ దృఢేనఛిత్త్వా" అని యున్నది. అసంగశస్త్రముచే ఈ వృక్షమును ఛేదింపవలయునట. యోగవాశిష్ఠమునందు చిత్తము ఒక వృక్షముతో పోల్చబడినది. చిత్తవృత్తికి మూలము అహంకారము. దానిని ఛేదింపవలయునట – కాదు, జ్ఞానాగ్నిచే దహింపవలయునట. అపుడు చిత్తము పోవునట. "చిత్తం సర్వమితి ప్రాహుః తత్ త్యక్త్వా పుత్ర రాజసే", చిత్తమును వదలివేయుటయే సర్వత్యాగమట. సంకల్పోప



శమమే మోక్షసాధనమట. "నాన్యః కశ్చిదుపాయోఽస్తి సంకల్పో పరమాదృతే" అని యనేక వాక్యములున్నవి. వీనివలన తేలినదేమనగా, చిత్తము, మనస్సు సంకల్పము పోవలయునట. ఎట్లుపోవును? ఈ సృష్టిసిగుఱించి, ఆత్మతత్త్వమును గుఱించి విచారింపవలయును. మననము చేయవలయును. "కాతే కాన్తా కస్తే పుత్రః" మొదలగు వాక్యములను భావింపవలయును. అట్లు భావించినచో చిత్తరహితమైనస్థితి, మనసులేనిస్థితి, సచ్చిదానందస్వరూపానుసంధానము కలుగును. కావున ఆ స్థితిని పొందుట కీ విచారణము ఎంతయో యుపకరించును అనవచ్చును. కాని, ఆ మనసులేని స్థితిని, మతిలేని స్థితిని "రమతే బాలోన్మత్తవదేవ" అనునట్టిస్థితిని నా శత్రువునకుకూడ నేను కోరను.

"ఆవృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్"
"యతతామపి సిద్ధానామ్
కశ్చిన్మాం వేత్తి తత్త్వతః"

అను వాక్యములయందుపాత్తమైన ఆత్మజ్ఞానము కలుగును. సత్యమే. కాని ఇది చదివి అందఱు ఆ 'కశ్చన' లగుట నాకిష్టములేదు. అట్లగుట పెద్దప్రయోజనము కాదు. అందుచే నేనీగ్రంథమును చదువుడని ఎవరికిని సూచింపను.

అప్రస్తుతమే అయినను ఇంకొక విషయమునుగూడ నామనసున నున్నదానిని చెప్పదలచితిని. మనవారు అన్నికర్మలయందును, వ్యవహారమునందంతటను ఈ ఆత్మతత్త్వము ననుసంధానము చేసికొనుమనియే బోధించుచున్నారు. శ్రాద్ధాదుల

యందు "అన్నం బ్రహ్మ, అహం బ్రహ్మ, కర్తా బ్రహ్మ, భోక్తా బ్రహ్మ" అని అనుచున్నారు. నమకమునందు సర్వవస్తువులను ఈశ్వరరూపముగ భావనచేయవలయునను సూచనము కనుపడుచున్నది. పురుషసూక్తముగూడ భగవంతుని సర్వవ్యాపకత్వమును బోధించుచున్నది. దేవీసూక్తము 'నేనే బ్రహ్మను' అను భావననే బోధించుచున్నది. తుదకు సంధ్యావందనాది ప్రక్రియయందుగూడ ఆత్మతత్త్వానుసంధానమే కనుపడుచున్నది. "పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ ... ... ఇన్ద్రియాణీంద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్... ..." మొదలగు గీతావాక్యములుకూడ ఆత్మతత్త్వానుసంధానమును బోధించుచున్నవి. నిస్సంగముగ, ఆత్మతత్త్వానుసంధానపూర్వకముగ, చిత్తత్యాగపూర్వకముగ లోకవ్యవహారములను ఆచరించుటయే "కర్మసు కౌశల" రూపమగు యోగము అనవచ్చును. వాశిష్ఠమునందలి చూడాలోపాఖ్యానము మొదలగునవి ఈ విషయములనే బోధింపుచున్నవనవచ్చును. కాని యివి యన్నియు నెవనికి? ముముక్షు వగువానికి. మనలో నిజముగ ముముక్షువు లెందఱున్నారు? నాకు నేను ఆత్మపరిశీలనము చేసికొనినచో నాకు తీవ్రముముక్షుత లేదు. నావంటివారికీగ్రంథము నిరుపయోగము. గట్టిగా అడిగితే ముక్తి లేదు, బంధము లేదు. "నముక్తో నచ బద్ధోయమ్" లేని బంధమును కల్పించుకొని, ముముక్షుత్వమును ఆరోపించుకొని నే నెందుకు బాధపడవలయును. చూడగా చూడగా ఈ వేదాంతము బాగున్నది. నేనేమియు చేయనక్కఱలేదు. తెలిసికొన నక్కఱ లేదు. విధినిషేధములను పాటింప నక్కఱలేదు. "నిస్త్రైగుణ్యే



పథి విచరతాం కో విధిః కో నిషేధః ?" ఇది నావిషయమున ఆత్మవంచనయని మీరందురేమో! నే నంగీకరింపను. ఇపుడు వేదాంతములను చదువువారు అధికముగ నావంటివారే. వారు నాకు అండగ నుండగలరు. "నాఽవిరతో దుశ్చరితా న్నాశాంతో నా సమాహితః" "శాన్తో దాన్త ఉపరత స్తితిక్షు స్సమాహితో భూత్వా" అను వాక్యములను నే నాదరింపను. అందువలన పండిముగ్గిన నావంటివారికీయాత్మతత్త్వ ప్రయోజన మేమున్నది?

యుద్ధజ్వాలలు, పరస్పర ద్వేషములు ప్రబలిన ఈ దినములలో ఆత్మతత్త్వజ్ఞానమే శాంతిసాధనము — ఇదియే శరణ్యము. నాయకులు ఆత్మతత్త్వజ్ఞులు అయినచో దేశము శాంతి సమృద్ధమైయుండును. సుభిక్షమై యుండునని అనవచ్చును – కాని, ప్రపంచకల్యాణ మెవరికి కావలయును? నా పెద్దపొట్టకు శ్రీరామరక్ష. ఇదియేగదా మనలక్ష్యము. చూడండి. ఉపనిషత్తే యీ మాట అనినది. "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" ఇది అపార్థము కాదు. సరియైన అర్థమే. అసలు ఈ ఆత్మతత్త్వ మలవడినచో పదవులు, పార్టీలు ఉండవు. అప్పుడు చాల బాధ ఉన్నది. అందువలన ఆత్మతత్త్వము నిష్ప్రయోజనము.

ఈ గ్రంథము మనఃపూర్వకముగ చదివినచో, లోకమునకు పనికిరాని ఆధ్యాత్మికత అలవడే అవకాశమున్నది. ఇటువంటి విషయమును జీర్ణించుకొనినచో, ఇపుడు స్వేచ్ఛావిహారము చేయు రాగద్వేషాదులుపోయే అవకాశ మున్నది. అందువలన ఈ గ్రంథమును ఎవరు చదువగూడదని నా అభిప్రాయము. చదివినా, జీర్ణించుకొని అనుష్ఠానములో నుంచుకొనగూడదు. ఇతరులకు బోధించుటకే ఉపయోగించుకొనవలయును. ఈ

గ్రంథకర్తగారు శ్రీచక్రస్వరూపము, దాని నర్చించు విధము మొదలైన విషయములను వివరముగ గ్రంథరూపమున ప్రకటింప సంకల్పింతురేమో ! అదియును వలదని నా సూచన.

నే నిన్ని చెప్పినను, నా వాదములన్నియు అర్థరహితములే యనువారుండవచ్చును. ఈ గ్రంథము అవశ్య ముపాదేయము, అధ్యేయము – అనువా రుందురు. నేను ఆ వాదము నంగీకరించినను, నా కొక బాధయున్నది. ఇంత మంచిపుస్తకమును ప్రకటించినచో, ఈ విషయము లందఱకును తెలియును గదా ! నా కొక్కనికే తెలిసియుండుచో, నేనే పండితుడనని చెప్పుకొనుట కవకాశముండెడిదికదా ! ఇపు డా యవకాశము లేదుకదా ! అందుచే ఈ గ్రంథమును ఇతరులు చదువుటను నే నంగీకరింపను.

"మహ్యమేవ నమో నమః."

ఉన్మత్త ప్రలాపము సమాప్తము.

## 2

ఆత్మజ్ఞానము సహజముగ ఎందుకు కలుగదు ? అవిద్య వలన కలుగదు. అవిద్య ఎట్లువచ్చినది ? ఎట్లో వచ్చినది. ఆ విచారణ వదలి, దానిని నాశనముచేయు ఉపాయము అన్వేషింపవలయును.

"యతో జాతేయమితి తే రామ మాస్తు విచారణా,
ఇమాం కథమహం హన్మీత్యేషా తేఽస్తు విచారణా॥
— యోగవాశిష్ఠము.



పరమాత్మానబోధమునకు విచారణ అవసరము. శమదమాదు లవసరము.

మోక్షద్వారే ద్వారపాలా శ్చత్వారః పరికీర్తితాః
శమో, విచారః, సంతోషః, చతుర్థః సాధుసంగమః ॥

ఏతే సేవ్యాః ప్రయత్నేన చత్వారో ద్వౌ త్రయోథవా
ద్వారముద్ఘాటయన్త్యేతే మోక్షరాజగృహే తథా ॥

ఏకం వా సర్వయత్నేన ప్రాణాం స్త్యక్త్వా సమాశ్రయేత్
ఏకస్మిన్ వశగే యాన్తి చత్వారోపి వశం యతః –

... ... ... ...
... ... ... ...

ఎవరి బుద్ధికి తోచినట్లు వారు విచారణ సేయవచ్చునా? కూడదు. శాస్త్రవాక్యములచే పవిత్రమైన బుద్ధితో విచారణ చేయవలయును.

శాస్త్రావబోధామలయా ధియా పరమపూతయా
కర్తవ్యః కారణజ్ఞేన విచారోఽనిశమాత్మనః,
విచారాత్తీక్ష్ణతామేత్య ధీః పశ్యతి పరంపదమ్
దీర్ఘసంసారరోగస్య విచారః పరమౌషధమ్ ॥

అసలు విచారమంటే ఏమిటి? నేనెవరు? ఈ సంసారమెట్లువచ్చినది ? అను పరామర్శయే విచారణ.

కోహం కథమయం దోషః సంసారాఖ్య ఉపాగతః
న్యాయేనేతి పరామర్శః విచార ఇతి కథ్యతే॥

'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను జ్ఞానమును అందఱకు ఉపదేశింపవచ్చునా ? కూడదు. ముందు శమదమాది గుణ

ములు శిష్యునిలో కలుగవలయును. తరువాత 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను విషయమును బోధింపవలయును. అపు డతనికి మోక్షము లభించును. శమదమాది సామగ్రి లేనివానికి ఈ జ్ఞానము బోధించుట, అతనిని నరకమున త్రోయుటయే.

"ఆదౌ శమ దమ ప్రాయై ర్గుణై శ్శిష్యం విశోధయేత్
పశ్చాత్సర్వమిదం బ్రహ్మ శుద్ధ స్త్వమితి బోధయేత్
అజ్ఞస్యార్థ ప్రబుద్ధస్య సర్వం బ్రహ్మేతి యోవదేత్
మహానరకజాతేషు స తేన వినియోజితః॥

మోక్షమంటే ఏమిటి? సమ్యక్ జ్ఞానముచే విబోధితమైన స్వచ్ఛమైన బుద్ధియే.

"మోక్షోహి చేతో విమలం సమ్యక్ జ్ఞాన విబోధితమ్"

ఈ "ఆత్మతత్త్వము" విచారితమై, భావితమై, అవబుద్ధమై, వ్యవహారగమ్యమై శాంతి సమృద్ధామృతప్రదమగుగాత మని ఆశింతము.

మననము సమాప్తము.

— భాగవతుల కుటుంబశాస్త్రి

—♦—

ఓమ్

శ్రీశృంగేరిజగద్గురు మహాసంస్థానపీఠాధిపతుల ప్రియశిష్యులు
శ్రీ శ్రీ శ్రీ విమలానంద నృసింహభారతీ స్వాములవారు
అ ను గ్ర హిం చి న

# ఆ శీ స్సు లు

విశ్వావసునామ సం॥ర జ్యేష్ఠ శు॥ త్రయోదశి
గుడివాడ 11–6–1965.

శ్రీ మట్టిపాటి వెంకట నరసింహారావుగారు రచించిన 'ఆత్మతత్త్వ' మను గ్రంథము నామూలాగ్రము చూచితిని. చాల ఆనందమైనది. లౌకిక వ్యవహార వ్యాపకములో నుండియు అతిగహనంబగు నిట్టి ఆధ్యాత్మిక విషయములను సద్గురువుల చెంత దీర్ఘకాలము సశాస్త్రీయముగా గ్రహించగలుగుటయు, వానిని 'తు–చ' తప్పకుండ గ్రంథస్థము చేయుటలనిన సామాన్య విషయము కాదు. ఇది కేవలము జన్మాంతర సుకృతవిశేషమనియే చెప్పకతప్పదు. దాని బాహ్యసూచనలే ఈశ్వరి ప్రసాదము – సద్గురు కృప. ఈ గ్రంథమునందు జిజ్ఞాసువులు గుర్తించి యోచరించదగిన విశేషము లనేకములు గలవు. అందు ముఖ్యముగా గురుభక్తిప్రాశస్త్యము, సత్సంప్రదాయ పరంపరానుగత శ్రద్ధాసక్తులు, శాక్తాఽద్వైత సామరస్యవిశిష్టతలు పేర్కొనదగినవి. వీనియొక్క యథార్థస్థితి, స్వరూపములు ఏనాటికైనను సాధకులు సంపూర్ణముగా గ్రహించిననేగాని 'అద్వైతసిద్ధి' యను "నిరతిశయానందావాప్తి" లభించుట కడు దుర్లభము. కావున వీరీ ఆశ్రమమందు చేయు కృషి చాల ప్రశంసనీయము.

'అద్వైతసిద్ధికి' వ్రాయబడు వేదాంతగ్రంథముల గురించి యభిప్రాయ మొసంగ ప్రయత్నించుటనునది కేవలము సాహసము. అంతకన్న రచయితల సాధనానుష్ఠానము లవిచ్ఛిన్నముగ నిత్యాధికముగ కొనసాగుచు, వారికి సకలశ్రేయస్సు లొసగుగాక యని చిన్మాత్రయగు శ్రీదేవిని యర్థించుచు సందజేయు, నారాయణ స్మరణపూర్వకాశీస్సు లనంత ఫలప్రదంబు లగునని నా నిశ్చితాభిప్రాయము.

— ఇత్యేషా నారాయణ స్మృతిః.

—♦—

శ్రీమాత్రే నమః

## ఆశీస్సు

శ్రీయుతులు, చి॥ మట్టిపాటి వేంకటనరసింహారావుగారు పండ్రెండుసంవత్సరములకు మున్నే శ్రీమాత్రాజ్ఞగా నా వలన శ్రీవిద్యాదీక్షఁ గొనిన ప్రియతమ శిష్యులు. వీరికిఁ బ్రియతమ విశేషణమును లగించుటను జూచిన పాఠకులకు "గురులకు శిష్యప్రేమము నెడ న్యూనాధికభావ ముండునా ?" యను నాశంక పొడమవచ్చును. విద్యాదానవిషయమున నీ భావ ముండదు కాని, స్వీకృతవిద్యను శ్రద్ధాగ్రహములతోఁ బెంపొందించుకొని, తాము యథాశక్తిగా సాటి సాధకులకు నేదే నొకవిధమున జ్ఞానదానము చేయువారు, గృహీతవిద్యాధనమును వృద్ధిచేసికొనక, దానితోనే సంతుష్టి నొందినవారికంటెను, గృహీత

3) 

విద్య నుపేక్షించియుఁ బరిత్యజించియుఁ జెడినవారికంటెను ప్రియతములనుటయందు దోషమేమియు లేదు.

'యశోజనే అసాని స్వాహా' యను నాశ సద్విద్యార్థికి సహజము. దాఁచుకొనక లోకమునకు జ్ఞానదానము చేయుటచే దెసలను బూఁదావివలె నల్లుకొను పేరు యశస్సు. ఇష్టాపూర్తాదులచే నొక్కింత యల్లుకొను పేరు కీర్తి. యశోఽర్థి యశోధనుఁడు నైన ప్రియతమశిష్యుని సంకల్పము లమోఘముగా నెఱవేఱుటకై మహామాయారూపిణిని గాయత్రిని సౌభాగ్యలక్ష్మిని సద్గురుఁ డెల్లపుడును బ్రార్థించుచు నేయుండును. శిష్యనామస్మరణమాత్రమున గురునందు నప్రయత్నముగా నయ్యాశీః స్పందనములు ప్రసరించుచుండుట సహజము. అది యొక శక్తి. సర్వకారణభూతయైన శ్రీగురుని శక్తియే యది. గురు నుపాధి శ్రీగురుని పీఠమాత్రమే.

అట్టి శక్తిరూపాశీః స్పందనములు నిరంతరము మన గ్రంథకర్తయైన నరసింహారావుగారియెడఁ బ్రసరించుటవల్లనే యాత్మవిద్యాబోధకములగు ప్రామాణిక గ్రంథములు చదివి విద్యాధనమును బెంపొందించుకొని వితీర్ణము చేయు నుత్సాహ శక్తి యుజ్జ్వలించినది. గురుల కింతకంటెఁ బ్రమోదకారణము లేదు కనుకనే వారిని బ్రియతము లనవలసివచ్చినది.

వీరు మూఁడేండ్లకు మున్నే 'శ్రీతత్త్వ' మను పేర నొక గ్రంథమును వ్రాసి గురుదేవతాభిన్నబుద్ధితో గురునకే సమర్పించిరి. అనృణులైరి. మేలు. శ్రీతత్త్వమన్నను నాత్మతత్త్వమన్నను నొక్కటే. అచటి శ్రీశబ్దవాచ్యమైన యాత్మ మాతృభావా

రాధితము. అందుఁ గుండలినీశక్త్యుపాసనారహస్యములు నడుమ నడుమ నగలుగా వెలసినవి. ఈ యాత్మతత్త్వగ్రంథము వేదాన్త పరిభాషా వివృతితో నలంకృతము. తద్విద్యా పరిభాషా తత్త్వ జిజ్ఞాసువులకుఁ బెన్నిధి. ఆత్మతత్త్వబోధమునకైన విషయములకై పెక్కు లుపనిషత్తులు చూచు పని యుండదు. గ్రంథకర్త యెంతగా నుపనిషత్పరిచయము గలవాఁడో, యెట్టి శ్రద్ధాగ్రహములు గలవాడో తెలియుటేకాక, పెక్కుశీర్షికలతో వెలయు నిన్ని విషయములను హృదయంగమ మొనర్చుకొన్నపుడే సమగ్రాత్మతత్త్వమును జేరు సాధనసంపత్తి లభించినదని తనివి నొందఁగలఁడు.

ఇంతకంటె నేనేమి వ్రాసినను బొగడ్త యైపోవునను భయమున నింతతో విరమించి, నా ప్రియతమశిష్యునకు వేదోక్త పరిపూర్ణాయు రారోగ్యముల నిచ్చి, యితోఽధికోపయోగి గ్రంథరచనమున కగు ప్రాణశక్తి నొసంగుమని ప్రాణేశ్వరిని శ్రీమాతను ప్రార్థింతును.

ఇట్లు,
శాక్తబంధుఁడు
శ్రీ శ్రియానందనాథుఁడు.

శ్రీకాకుళము
17—7—1965

—♦—

శ్రీ డా॥ దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ. (ఆ.ర్స.) పిహెచ్ డి.

శ్రీ

# అభిప్రాయము

శ్రీ మట్టిపాటి వెంకట నరసింహారావుగారు రచించిన 'ఆత్మతత్త్వము' అను గ్రంథమును శ్రద్ధాభక్తులతోఁ జదివి యానందించితిని. ఆధ్యాత్మికజ్ఞానము క్రమముగా సన్నగిల్లుచున్న యీ కాలమున నిట్టి గ్రంథముల ప్రకటనమున కెంతైన నావశ్యకమున్నది. "విస్తృతమైన స్వరూపజ్ఞానమును దెలిసికొనుటకుఁ జేయు ప్రయత్నమే యీ గ్రంథము రచించుటయందలి యుద్దేశమని గ్రంథకర్తగారు మొదటనే వ్యక్తము చేసియున్నారు. వారిందు ఆధ్యాత్మ, ముండక, ఛాందోగ్య, తైత్తిరీయ, నిరాలంబ, పైంగల, యాజ్ఞవల్క్య, శారీరకాద్యుపనిషత్తులు; భగవద్గీత, సౌందర్యలహరి, పురుషసూక్తము మున్నగువాని నుండియు; శ్రీ శ్రియానందనాథ గురుజీవారు రచించిన గ్రంథముల నుండియుఁ గొన్ని ముఖ్యములైన వాక్యములను శ్లోకములను పద్యములను ఉద్ధరించి వానికి సంపూర్ణము, సర్వసుబోధము నైన వివరణము గావించుటద్వారా ఆత్మతత్త్వమును వ్యక్తము చేసియున్నారు. సృష్టిక్రమము, స్థూల సూక్ష్మ శరీరములు, జీవత్రయ లక్షణము, ప్రణవ స్వరూపము మున్నగు విషయము లిందుఁ బ్రామాణికముగా వివరింపఁబడినవి. తత్త్వగ్రంథములను, వేదాంతగ్రంథములను జదువునప్పుడు తఱచుగా వచ్చుచుండు పారిభాషికశబ్దము లిందుఁ జక్కఁగా నిర్వచింపఁబడి, సామాన్యులకుఁగూడ బోధపడునట్లు విశదీకరింపఁబడినవి.

ఈ గ్రంథమును జదివినవారు నశ్వరము, హేయము నైన యైహికప్రవృత్తిని విడిచి అక్షరము అవలంబనీయము నైన తాత్త్వికప్రవృత్తి నలవఱుచుకొనఁజాలుదు రనుటలో సందేహము లేదు. ఇందలి భాష సైతము సరళము, నిర్దోషము, సుందరమునై సర్వసుబోధముగా నున్నది. ఈ యుత్తమగ్రంథమును గ్రంథకర్తగారు తమ గురువర్యులైన శ్రీశ్రీశ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారి కంకితముచేయుట మిక్కిలి యౌచిత్య శోభితమై, వారి యపారమైన గురుభక్తిని వ్యక్తమొనరించుచున్నది. 97 వ పుటలో ఈశ్వర సత్యనారాయణ యనఁగా నెవ్వరు అను విషయమును వారు వివరించిన తెఱంగు చూడ వారికిఁ గల గురుబ్రహ్మైక్యభావన వెల్లడియగుచున్నది. శ్రీ నరసింహారావుగా రింకను ఇట్టి యాధ్యాత్మికగ్రంథములు సులభశైలిలో ప్రామాణికముగా రచించి దేశమునం దాధ్యాత్మిక భావ ప్రచారమునకుఁ దోడ్పడుదురుగాక యని ప్రార్థించుచున్నాను.

ఉస్మానియా విశ్వవిద్యాలయము<br>హైదరాబాదు – 6-6-65 } — దివాకర్ల వేంకటావధాని

—♦—

శ్రీ పరాశక్తిర్విజయతే

"మూకోఽపి, జటిలదుర్గతి –<br>శోకోఽపి స్మరతి యః క్షణం భవతీం ।<br>ఏకో భవతి స జంతుః<br>లోకోత్తర కీర్తిరేవ కామాక్షి !

— మూకకవి. (ఆర్యాశతకము)

శ్రీయుతులు, యం. వి. నరసింహారావుగారికి —

సప్రణయ ప్రణామములు.

ఆర్యా !

మీ పంపిన "ఆత్మతత్త్వము" అను గ్రంథ మందినది. తుదిముట్ట జదివితిని. తృప్తి నందితిని. మీ గ్రంథము చూచిన మీదట నా దృష్టికి మీరు చాలవరకు నంతర్ముఖులగు సాధకులుగా దోచుచున్నారు. మరియు 'అంతర్ముఖ సమారాధ్య' యగు నంబా కృపకు పాత్రులయినారు కూడ.

నిగమాగమాదుల పఠన శ్రవణములు చేసి, బహుకాల మవిచ్ఛిన్నముగా మీ రాచరించిన మననముయొక్క ఫల మీ గ్రంథము.

బయట నణ్వస్త్రాల కంపుతో, లోపల నంతఃకలహాల రంపుతో గ్రుళ్ళి కుములుచున్న నేటి జగత్తునకు, ఏకైకతారకమగు ప్రత్యగాత్మయొక్క ఆనందస్వరూపమును దర్శింపజేయు మీ సశ్రమప్రయత్నము శ్లాఘనీయతమముగా నున్నది.

మీ గ్రంథమున విశేషించి నన్నాకర్షించినది మీ సంప్రదాయ శుద్ధి. ఉపదేష్టయగు గురువును, ఉపాస్య దేవతను, ఉపాసకుడగు తనను ఐక్యభావనతో దలచినపుడే పరమఫలప్రాప్తి యని సంప్రదాయము. ఇయ్యది మీ గ్రంథమం దనుస్యూత ముగా గనబడుచున్నది.

"స ఏవ పరమోధర్మః యద్యోగీ నాత్మదర్శనం" అను ఋషివాక్యమునకు మీ గ్రంథము వ్యాఖ్యానప్రాయము.

మీ ప్రత్యఙ్ముఖీదృష్టి మిమ్ము స్వాత్మానందానుభవ మత్తులను జేయుగాత.

ఇట్లు,

బెంగుళూరు
20—7—65

మీ వాడు
యమ్మనూరు నాగేశశర్మ
న్యాయశిరోమణి.

—♦—

ఓం
శ్రీ శ్రియానందనాథగురవే నమః

# పంచాక్షరీ వివరణ

## ప్రార్థన

శ్రు॥ స్తుహి శ్రుతం గర్తసదం యువానం మృగన్న భీమ మువహాత్ను ముగ్రం॥ — కృష్ణయజుర్వేదము.

అతడు —

విశ్వజీవకోటి హృదయాధినాథుడు. జరాభార మెరుగని నిత్యయావనుడు. మత్తమత్తేభ కుంభికుంభ విదళన తత్పరమైన మృగరాజసదృశ భయద భీకర భీషణాకారుడు. స్వీయనిర్మిత భువనజాలమునంతయు నొక్కత్రుటిలో నుపసంహరింపగల సమర్థుడగు ప్రళయకాలరుద్రుడు. భీషణ భీషణుడు. మృత్యువునకు మృత్యువు. అనుల్లంఘనీయ మాతని శాసనము. సహస్రానేక కోటిసూర్యప్రభాభాసమాన దుర్నిరీక్ష్య తేజోవిరాజితుడు. శ్రుతి స్మృతి పురాణేతిహాసముల బహుధా శ్లాఘింపబడిన మహా మహిమాన్వితుడు. ప్రణవాది సమస్తమంత్రరాజ ప్రవర్తకుడు. ఈశ్వర – సత్యనారాయణాది వివిధరూపములతో – వివిధప్రకాశ ప్రక్రియలతో నభివ్యక్తమై 'సాధక'సోదరుల స్వస్వరూప సాక్షాత్కృతికి – మార్గదర్శియగు శ్రీ శ్రియానంద గురుదేవుడు.

అతడే పరమాత్మ – పరమశివుడు.

హే మదీయాంతరాత్మన్ !

ఆ మహనీయుని కల్యాణగుణముల స్తుతించుము. నిన్నావరించిన ఆవరణముల తొలగించుకొని 'శివ'త్వము నొందుము.

"ఓం నమశ్శివాయ" (శివపంచాక్షరీ మహామంత్రము)

హే నిత్యనిరతిశయ శ్రియానందస్వరూపా !

అహంకార బుద్ధి మనః ప్రాణేంద్రియ సంఘాతమునకు విలక్షణమై, తదధిష్ఠానమై, తత్సాక్షియై ప్రకాశించు చైతన్య పరిపూర్ణమగు సద్వస్తువే 'ఆత్మ'.

ఆత్మయే —

జగదుత్పత్తి స్థితి లయములకు మూలకందము. భూత గణములకు ఆధారభూతము. అఖండజ్ఞానస్వరూపము. ఆత్మనిష్ఠా గరిష్ఠులకు సర్వకాల సర్వావస్థలయందును ధ్యేయము.

'మా' అనగా అవ్యక్తము. అవ్యక్తమునకు పరమైనది 'ఆత్మ' కనుక 'నమ'శ్శబ్దవాచ్యము 'ఆత్మ'.

ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము అను షడ్గుణైశ్వర్యసంపన్నము 'ఆత్మ'. జీవనకమలపరిమళము 'ఆత్మ'. అంగుష్ఠమాత్ర పరిమాణముగల నిర్మల దివ్యజ్యోతి 'ఆత్మ'. అజరామరమైనది 'ఆత్మ'.

'రసోవై సః' అఖండాద్వైతైక రసానంద శివస్వరూపమే "ఆత్మతత్త్వము".

తత్స్వరూపమే నీవు. సర్వజ్ఞుడవు. నిర్వికారుడవు. నిర్మలుడవు. నిరవద్యుడవు. అద్వితీయుడవు. నీకివే నమోవాకములు.

హే పరమాత్మన్ !

తొల్లి నాయదియు 'శివ'స్వరూపమే. కాని, దౌర్భాగ్య వశమున నా యందలి అఖండజ్ఞానము – శబ్ద స్పర్శ రూపాదిగా ఖండ ఖండ విషయాకారమున వెలసినది. అవిద్యకు చిక్కితిని.



తొల్లిటి స్వస్వరూపస్మృతి (జ్ఞప్తి) మరగిపోయినది. జీవత్వదశ నొందితిని. దృక్పథము మారినది. ద్వైతభావము ప్రబలినది. నాకు (ఆత్మకు) భిన్నముగా – విశ్వజగత్తు – వివిధరూపములతో అనేకములుగా గోచరించి 'మిథ్యాత్వ' భ్రమ గొల్పుచున్నది.

ఇదియు నీ (ఆత్మ)శక్తివిశేషమే. లీలావిలసనమే. వినోద క్రీడయే. కాని అహంకారవిశిష్టుడనై, ఎరి తెన్ను గానక, పడుచు లేచుచు నేను పడు యమబాధ నీకు తెలియనిది గాదు.

పిపీలికాది బ్రహ్మ పర్యంతము – అణ్వాది మహాకాశ పర్యంతము – ఎల్లెడల నీవే నిండియుంటివను సత్యమును విస్మరించి, 'నీ' నుండి విడివడి, 'నేను' ఇట ఒంటరినై నిలచి, నీ యనుగ్రహమునకై – నీ శుభాశీస్సులకై – వినమ్రభావమున అర్థించుచున్నాను.

పరమశివా !

నా యందలి ద్వైతబుద్ధిని రూపుమాపుము. మనో మాలిన్యతను కడిగివేయుము. నా యందలి మాయను (అజ్ఞానమును) తొలగించుము. 'నీవే' (నీ స్వరూపమే) నేను అను పూర్వస్మృతిని (జ్ఞప్తిని) – మేధను – ( 'బ్రహ్మోఽహ మస్మీతి స్మృతిరేవ మేధా' ) కలుగజేయుము.

అపుడే గదా !

మూలప్రకృతి ఆదిగాగల వర్గమునకు వేత్తనై 'సూత్రే మణిగణా ఇవ' మణిగణములయందు జొచ్చియున్న సూత్రము చందమున నేను (ఆత్మ) చరాచరములయం దంతటను చొచ్చి వ్యాపించి దీపించుచుండినటుల వ్యక్తమగును. స్వస్వరూప

సాక్షాత్కృతి నొందగలను. "ఆత్మతత్త్వము" నవగతము చేసికొనగలను.

'ఆత్మతత్త్వము' అవగతమై, ఏకాత్మభావన దృఢతరమైనపుడే 'జగత్తు సత్యము' అని ఢంకాపై దెబ్బకొట్టి చెప్పగలను.

అట్టి శుభసమయమున —

'న-మా' నాకు (ఆత్మకు) అవిద్య లేదు. సర్వదోషములు క్షాళితములై అఖండజ్ఞానస్వరూపమున తాదాత్మ్యతను జెంది 'శివ' స్వరూపుడనైన 'నేను' - సర్వత్ర, సర్వవిధముల, సర్వరూపములతో సర్వగతుడనై, ఆదిమధ్యాంతరహితుడనై, అనంతుడనై, సర్వాతీతుడనై, సర్వమునకును మూలమునై, శ్రీయానందుడనై ప్రకాశింతును.

ఔను. నా కెవ్వరును లేరు. నాకు మూలము నేనే. ఇది సత్యము.

శివోఽహం॥ బ్రహ్మైవాఽహ మస్మి॥

ఇట్లు,
మట్టిపాటి వేంకటనరసింహారావు



శ్రీమాత్రే నమః
శ్రీ శ్రీయానందనాథగురవే నమః

# ఉపోద్ఘాతము

సహృదయులైన పాఠకమహాశయులకు —
వినయపూర్వక నమస్కృతులు.

"గుణినామపి నిజరూప ప్రతిపత్తిః పరత ఏవ సంభవతి।
స్వమహిమ దర్శన మక్ష్ణో ర్ముకురతలే జాయతే యస్మాత్॥"

అద్దమునందు నేత్రముల రామణీయకత విశదమగుచున్నది. గుణగ్రహణపారీణులు, విజ్ఞులు నగు పాఠకమహాశయులు గ్రంథస్థవిషయముల నవగాహనచేసికొని ఆనందించగలరు. కనుక "ఆత్మతత్త్వ" మను పేర బరగు ఈ గ్రంథమునకు ప్రత్యేకించి పీఠిక అపేక్షణీయముగాదు. ఇది సాంప్రత సాంప్రదాయ విరుద్ధమగుచో పాఠకులు క్షమింతురుగాక!

గ్రంథ రచనోద్దేశ్యము మాత్రము ఇందు ఒకింత ప్రస్తావింతును.

అది విళంబినామ సంవత్సర కార్తిక బహుళైకాదశికి సరియగు 6-12-1958. నాడు నా జీవితమునందు ఒక ముఖ్యఘట్టము. ఒక మలుపుబాట. నా ప్రేమనిధానము, నా యాధ్యాత్మిక యాత్రా సహచరి 'కమల' శ్రీమాత్రంకమున నొకచో శాశ్వతస్థానమును గడించుకొన్నది నాడే.

"నా కెవ్వరును లేరు. నాకు మూలము నేనే." ఇది ఆమె నాకిచ్చిన చరమసందేశము.

ఈ 'కమల' ఎవరు ?

ఘనాఘన చంచలాలతికలవోలె నస్థిరము లీ జీవితములు. గిరినదీ వేగోప మీ జవ్వనము. పుట్టుసావుల ఘాత ప్రతిఘాతములు లేని సాధనమును – శ్రీ శ్రియానంద గురు పదకమలముల నాశ్రయించి, పడయుమని యుద్బోధించిన విజ్ఞానఖని 'కమల'.

"ఘోర మాయాజాలసంకీర్ణ మీదృశ్యము క్షణస్థాయి. నదీప్రవాహయాత్రయందు సంయోగవియోగవశమైపోవు కాష్ఠ ఖండచయ మీ బాంధవశ్రేణి. భవబంధన విచ్ఛేదనదక్ష శీల సంపత్తి నిన్నుత్తుకొనియుండుగాక" యని ప్రబోధించి యాధ్యాత్మిక జీవితరంగ పదన్యాసమునకుం ద్వారపెట్టిన దివ్యమూర్తి – 'కమల'.

అది 1941 సం॥ మే నెల 31 వ తేది. కారు మొయిళ్లు నిండి నిబిడీకృతమై హృదయాకాశమును దుస్తమోబంధుర మొనర్చినవి. తుచ్ఛవిషయసుఖ లంపటుడనై స్వేచ్ఛాభంగకము, స్వార్థప్రపూర్ణము, దుర్గంధభూయిష్ఠము, కటుకు నిజుకునైన సంసారకారానుసంబద్ధుడనై వెలుగు గానక, తట్టుమట్టాడించిన విషఘటిక లవి.

మోహమదిరాపానమున, కలుషితమైన స్వభావ కుటిల హృదయమున పైశాచికనృత్యము సాగిన భయానక కాల ఘట్ట మది.



కాలపురుషుని తీవ్రకుఠారధారల కెరయై నా కుటుంబోద్యానలతలు భిన్నభిన్నములై చెల్లాచెదరైన ప్రళయసంఘట్టన వేళ యది.

కింకర్తవ్యతావిమూఢుడనై ఆశానిరాశాందోళితుడనై శాంతిలేక మతిభ్రమణమై 'అమ్మా !' 'అమ్మా !' యని యాక్రోశించు విపద్విషమపరిస్థితియందు స్వీయప్రశాంత, వినిర్మల ధీర మందహాసరోచిస్సుల బఱపి, అజ్ఞానాంధకారమును తొలచి భవిష్యజ్జీవితము నుజ్జ్వలతరముగా తీర్చిదిద్దిన శ్రీ దేవీ ప్రవిమల ప్రతిమూర్తి – 'కమల'.

మణిద్వీపవాసిని మకుటాగ్రసీమనుండి భువికి అవతరించి హృదయతాపమును శమింపజేసిన సుధామయూఖరేఖ – నా 'కమల'.

పదునేడేండ్ల యాత్రాసములు జీవితనౌక నొడిదుడుకులు తలక్రిందుసేయకుండ చతురకర్ణధారిణియై నడిపించి – ఇక నీ నౌకకు కర్ణధారిణి సర్వకారణభూత శ్రీమాత యని యొప్పగించి సం॥ 1958 డిశంబరు ఆరవ తేదీకి సరియగు విళంబినామసంవత్సర కార్తిక కృష్ణైకాదశీ స్థిరవాసరమున అనాయాసయాత్ర సాగించి చివరి మజిలీ గడిచి, సూర్యా హిరణ్మయీ శ్రీమాత్రంకమున స్థిరనివాస మేర్పరచుకొనినది నా 'కమల'.

దైన్యమునకు చోటీయక, పరిసర ప్రకృతివికారములకు పతిని లోనుగానీక యేలుకొన్న ఆదర్శగృహిణి – 'కమల',

అపాయమునాటి కామె ప్రాయము ముప్పదిమూడు హాయనములు. ఆమె సాహచర్యభాగ్యమున నాకు గలిగిన పవిత్రానుభూతి అనిర్వాచ్యము.

"ప్రాణబంధుడా! హితుడా! కలతనందకుము ధైర్యము చిక్కబట్టుము. నిర్వికారుడవై 'నీవు' "నీవు"గానే యుండుము. త్యాగమూర్తి వగుము. నీ యాదర్శజీవితపథవిన్యాసము విశ్వజనశ్లాఘ్యమై అస్ఖలితమై నిరంతరాయముగ సాగుగాక.

"నాకెవ్వరును లేరు. నాకు మూలము నేనే." అను నీ యద్వైతవాక్యార్థసారమును శ్రీ శ్రియానందగురుదేవుల కృపావిశేషమున గ్రహించి అనుభవించి జీవితశేషమును ప్రశాంతముగా గడపుము."

నాటి ఆ యపూర్వతేజోవిలసితమైన ఆమె సులలితముఖకమలమునుండి జాఱిన కమనీయ మధుబిందువులివి. అంతర్గర్భిత ఆత్మతేజో కిరణములివి.

నిజమే. పాఠకమహాశయా! మీకు ఇదియంతయు స్తోత్రపాఠముగా దోచవచ్చును. అప్రస్తుత ప్రసంగముగా దోచవచ్చును. ఈ రచయిత ఇంతటి బేలయగు ప్రేమోపాసియా యని ఆశ్చర్యపడవచ్చును. ఒక వ్యక్తికి ఇంతటి అపూర్వగౌరవమా? యని ఈసడింపవచ్చును. అపరిచితులగు పఠితలకు ఇట్టి భావోద్రేకము కలుగుట సహజమే. కాదనను.



ఇది నాజీవితమునకు సంబంధించిన ఘట్టము. ఒక మలుపుబాట. ఆమె చూపిన వెలుగులో ఆ మలుపుబాటలో పయనించి ఆధ్యాత్మిక ఆనందవిహాయసమున ఉన్నతపథముల యథేచ్ఛగా విహరించితిని. నా స్వధర్మమును నేను విస్మరింపవచ్చునా? నా కృతజ్ఞతను నేను తెలుపవలదా?

కాలచక్రనిశితదంష్ట్రాంకురముల నిఱుకుకొని, ఆత్మనాశనమునకు గురికాకుండ కాపాడిన ప్రేమమూర్తికి, కరుణాస్వరూపిణికి, నిగూఢసుజ్ఞానసారకు ఇది ప్రత్యుపకృతియగునా? కానేరదేమో? సాధనాంతర మెద్దియేని కలదా? లేదేమో? నాకు గోచరించుటలేదు.

కాని, నేను కమలను 'కమలనుగా' ప్రేమించితిని. 'కమలనుగా' పూజించితిని. 'కమలను'గానే నేడును స్మరించుచుంటిని.

ఆ దేవీమూర్తి ఇచ్చిన చరమసందేశ వివరణమే, స్వస్వరూపజ్ఞానమును తెలిసికొన చేయు ప్రయత్నమే ఈ గ్రంథరచనోద్దేశ్యము.

ఇందు ప్రత్యేకించి నేను రచించిన క్రొంగ్రొత్తవిషయమేమియును లేదు. అనూచానముగా పారంపర్యముగా ఉపదేశింపబడిన మహనీయుల మహావాక్యములే వివరింపబడినవి.

నేను పెద్దచదువులు చదువలేదు. పట్టములు పొందలేను. ఇట్టి ననుబోటి సామాన్యుడు రచింపదగిన గ్రంథమా ఈ "ఆత్మతత్త్వము?" కాదు. కాని నేను సాహసమే చేసితిని.

నా ఈ సాహసచర్యకు శ్రీ శ్రీయానందనాథగురుదేవుల ఆశీర్బలము లభించినది. నా 'కమల' దివ్యప్రేరణ అండయైనది. పూజ్యులగు బ్రహ్మశ్రీ విద్వాన్ బులుసు సూర్యప్రకాశశాస్త్రి గారి సహాయసంపత్తి లభించినది. శ్రీ గురుదేవులనుండి నేను గ్రహించిన విద్యకు జ్ఞప్తియున్నంతవరకు నాకు గల స్వల్పపరిజ్ఞానముతో గ్రంథరూపమును కల్పించితిని. ప్రాథమిక దశయందలి సాధకసోదరుల కిది యుపకరింపకపోవునా? అందు ఏయొక్కరైనను ఈగ్రంథమూలమున ఉపకృతి నొందకపోదురా? అప్పుడీ గ్రంథరచన సార్థకత నొందకపోవునా? యను ఆత్మవిశ్వాసము రచనను ప్రోత్సహించినది.

"కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః,
సుకృతే దుష్కృతే చైవ చత్వారః సమభాగినః."

మైసూరు రాష్ట్రాంతర్గత షిమోగా మండలమందలి శరావతీ ప్రాజక్టులోని లింగనమక్కిలో M/s గ్యానన్ డంకర్లే అండ్ కో; అను ఇంజనీరింగు కంట్రాక్టర్సు సంస్థలో నేను ఉద్యోగధర్మమును నిర్వర్తించుచు గత జూలై 1964 మాసములో ఈ గ్రంథమును రచించితిని. అప్పటి నా పైయధికారియగు శ్రీ K. కృష్ణమూర్తిగారు నా యీ ప్రయత్నమును గమనించి, అయాచితముగనే నాఉద్యోగధర్మముల నొకింత సడలించి రచన నిరాటంకముగా సాగునటుల నవకాశమును కల్పించిరి. ఆ ఉదారహృదయునకు నాహృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొనుచున్నాను.



తమ నిస్స్వార్థత్యాగశీలముచే ఆంధ్ర పాఠకలోకమునకు అనుపమానమైన సేవ చేయుచున్న సాధన గ్రంథమండలి వ్యవస్థాపకులు వేదమూర్తులు బ్రహ్మశ్రీ విద్వాన్, బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు గ్రంథముద్రణభారమును వహించుటయేగాక యెన్నియోవిధముల తోడ్పడినారు. వారికి శ్రీమాత నిరంతరము చేదోడువాదోడుగా నుండి, ఆంధ్రపాఠకలోకమునకు ఇతోధిక కృషి చేయుటకు తోడ్పడుగాక!

గ్రంథమును సర్వాంగసుందరముగా, సకాలములో వెలువడ తోడ్పడిన శ్రీ 'జానకిరాంప్రెస్' తెనాలివారికి, నా కృతజ్ఞతాభివందనములు.

కోరినదే తడవుగా ఆశీర్వదించి తమ అమూల్యాభిప్రాయముల నొసంగిన జగద్గురువులు, పరమహంస పరివ్రాజకాచార్యవర్యులు శ్రీశ్రీశ్రీ విమలానంద నృసింహభారతీ మహాస్వామివారికి (గుడివాడ) – నా సవినయ సహస్రానేక వందనములు సభక్తికముగా సమర్పించుకొనుచున్నాను.

ఈ గ్రంథమునకు 'మనసులో మాటలు' రచించి ఇచ్చిన బ్రహ్మశ్రీ భాగవతుల కుటుంబశాస్త్రి M A. (చిలకలపూడి – కృష్ణాజిల్లా) గారికిని; అభిప్రాయములు (Review) వ్రాసిపంపిన బ్రహ్మశ్రీ డాక్టరు. దివాకర్ల వెంకటావధాని M. A. (ఉస్మానియా విశ్వవిద్యాలయము – హైదరాబాదు) గారికిని, బ్రహ్మశ్రీ వై. నాగేశశర్మ (బెంగుళూరు) గారికిని – నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొనుచున్నాను.

గ్రంథముద్రణకు తమకు తోఁచిన ధనసహాయము చేసి తోడ్పడిన మహారాజశ్రీ పాలెపు కృష్ణమూర్తి పంతులు (పొందూరు – శ్రీకాకుళం జిల్లా) గారికి – శ్రీ రాజరాజేశ్వరీ పరాభట్టారిక ఆయురారోగ్యైశ్వర్యోత్సాహముల ప్రసాదించుగాక యని ప్రార్థించుచున్నాను.

శీలేరు ప్రాజక్టు.
(విశాఖజిల్లా – ఆంధ్రప్రదేశ్)
విశ్వావసు – ఆషాఢ కృష్ణ పాడ్యమి.
14—7—1965

మట్టిపాటి
వేంకట నరసింహారావు

—♦—

## నా మాటలు

మాణిక్యవీణా ముపలాలయంతీం
మదాలసాం మంజుల వాగ్విలాసామ్,
మాహేంద్ర నీలద్యుతి కోమలాంగీం
మాతంగకన్యాం మనసా స్మరామి॥

మానవునకు తెలియనిదెల్ల తన్నుగూర్చియే. ఇది యొక ఆశ్చర్యకరమైన విషయము. ప్రతియొక్కనికీ నీ లోకమందలి వస్తుతతినిగూర్చి అంతో ఇంతో తెలియును. కాని ఎవరో కొందఱు మహాత్ములు దక్క యితరులెల్లరు తామెవరో తెలిసికొనుటయం దజ్ఞులు, మూఢులు నైయున్నారు.

మానవుని మనస్సు బహిర్ముఖమైనంత, అంతర్ముఖము గాదు. ఈ లోకమువైపు పఱువెత్తుటలో నది వేగవంతము. స్వస్వరూపసంధాన విషయమున వెనుకకు బఱువెత్తుట కాదు గదా, అడుగిడుటకైన నది యంగీకరింపదు. మొరాయించును. పెంకెతనము చూపును. ఒకవేళ బలవంతముగా రెండడుగులు వైచినను, వీలుచూచుకొని దౌర్బల్యమును గమనించి పది యడుగులు లోకమువంకకు బఱువెత్తును. స్వస్వరూపానుసంధాన మార్గము సర్వథా అపరిచితమగుటయే దీనికి హేతువు. తన్నుఁదా తెలియఁగల్గినపుడే మానవునకు నిజమైన ఆనందానుభూతి.

స్వస్వరూపానుసంధానమార్గమును దేటతెల్లముకావించి సత్యమైన యానందమును కరతలామలకము గావించుటయందు మిత్రులు శ్రీ మట్టిపాటి వెంకటనరసింహారావుగారు రచించిన యీ గ్రంథము సాధకలోకమునకు మిక్కిలి యుపకరించును. వీరు గుర్వనుగ్రహము పొందిన ఉత్తమసాధకులు.

గంభీరార్థమగు నిట్టి సద్గ్రంథమును సముచితమగు నర్థ సహాయము చేసి మా మండలిలో ప్రకటించుట కనుమతించిన శ్రీ వెంకటనరసింహారావుగారికి - మా మండలి తరఫున ధన్యవాదములు సమర్పించుచు, సాధకుల కుపయుక్తములగు నిట్టి యాధ్యాత్మికగ్రంథములు రచించు శక్తి శ్రీ జగదీశ్వరి యనుగ్రహించుగాక యని కోరుచున్నాను.

| | |
|---|---|
| తెనాలి<br>విశ్వావసు-శ్రావణము | బులుసు సూర్యప్రకాశ శాస్త్రి<br>వ్యవస్థాపకుడు : సాధన గ్రంథమండలి. |

—♦—



కృతికర్త : శ్రీ వెంకట నరసింహారావు

కృతిభర్త : శ్రీ శ్రియానందనాథుడు
శ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మ

శ్రీమాత్రే నమః

# గురుదేవతా ప్రార్థన.

"ఆబ్రహ్మలోకా దాశేషా దాలోకాలోకపర్వతాత్,
యే సంతి బ్రాహ్మణా దేవా స్తేభ్యో నిత్యం నమోనమః॥"

ఓం॥ నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో వంశ ఋషిభ్యో నమో గురుభ్యో నమో మహద్భ్యః॥

సర్వోపప్లవరహిత ప్రజ్ఞానఘన ప్రత్యగర్థో బ్రహ్మాఽహమస్మి, సోఽహమస్మి, బ్రహ్మాఽహమస్మి॥

"శ్రీనాథాది గురుత్రయం గణపతిం పీఠత్రయం భైరవం
సిద్ధౌఘం వటుకత్రయం పదయుగం దూతీక్రమం మండలం,
వీరాన్ ద్వ్యష్ట చతుష్కషష్టినవకం వీరావళీ పంచకం
శ్రీమన్మాలిని మంత్రరాజసహితం వందే గురోర్మండలమ్॥"

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః,
గురు స్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై 'శ్రీ' గురవే నమః॥"

"వందే గురుపదద్వంద్వ మవాఙ్మానస గోచరం,
రక్త శుక్ల ప్రభా మిశ్ర మతర్క్యం త్రైపురం మహః"

—♦—

# కుసుమాంజలి - కృతి సమర్పణ

అస్మత్ —

పరాపరగురువులు - శ్రీ పరిపూర్ణ ప్రకాశానందనాథులకును,

పరమేష్ఠిగురువులు - శ్రీ మహావిద్యానందనాథులకును,

పరమగురువులు - శ్రీ విద్యానందనాథులకును

త్రికరణశుద్ధిగా, త్రికాలములయందును

సాష్టాంగదండప్రణామము లర్పించుచూ,

సర్వమంగళయగు జగన్మాతృ స్వరూపులు, 'శ్రీ' గురువులు, స్వగురువులు శ్రీ శ్రీ శ్రీ శ్రియానందనాథ తద్వతీ పరాంబా దివ్యమణి పాదుకాద్వయాఖండ సర్వస్వరూపమునకు — తాదాత్మ్య భావమున ప్రణమిల్లి, ఉపనిషన్మధువు లొలుకు "ఆత్మ తత్త్వ" మను ఈ గ్రంథసుమమును భక్తిపురస్సరముగా సమర్పించుకొనుచున్నాను.

బ్రహ్మ తేజోనిధీ ! హే శ్రియానంద భగవన్ ! ప్రసన్న చిత్తమున పరిగ్రహించి, ఆశీర్వదింపుడు.

ఓం తత్ సత్.

— మట్టిపాటి వేంకటనరసింహారావు.

***

# విషయ సూచిక


| | | |
|---|---|---|
| 1. సృష్టిక్రమము — అవరోహణక్రమము, అక్షరబ్రహ్మము | | 1 |
| 2. ఆత్మ (బ్రహ్మము) అక్షరము | ... | 8 |
| 3. పురుషోత్తముడు — పరశివుడు | ... | 12 |
| 4. ప్రకృతి — పరాశక్తి | ... | 19 |
| 5. శాక్తదృక్పథము — ప్రకృతిపురుషులు | ... | 27 |
| 6. ప్రపంచోత్పత్తిక్రమము | ... | 36 |
| 7. సాంఖ్యసూత్రములు — భూతపంచీకరణము | | 42 |
| 8. సూక్ష్మశరీరము | ... | 47 |
| 9. స్థూలశరీరము | ... | 51 |
| 10. పంచప్రాణములు — స్థూలశరీరము | ... | 52 |
| 11. ప్రాణము అనగా నేమి ? | ... | 53 |
| 12. స్థూలశరీరము — కర్మేంద్రియములు | ... | 53 |
| 13. స్థూలశరీరము — జ్ఞానేంద్రియములు | ... | 55 |
| 14. స్థూలశరీరము — పంచతన్మాత్రలు | ... | 56 |
| 15. స్థూలశరీరము — అంతఃకరణ చతుష్టయము | | 57 |
| 16. పంచభూత తత్త్వకదంబము | ... | 61 |
| 17. జీవుడు (జీవాత్మ) అనగా నెవ్వడు ? | ... | 64 |
| 18. స్థూలశరీర నిర్మాణము | ... | 65 |
| 19. పంచకోశములు | ... | 68 |
| 20. సూక్ష్మశరీరము — ప్రాణమయకోశము | ... | 71 |
| 21. కారణమయకోశము — ఆనందమయకోశము | | 73 |
| 22. జీవత్రయలక్షణము : స్థూలశరీరాభిమాని — విశ్వుడు | | 77 |
| 23. 'జాగ్రదవస్థ' యనగా నేమి ? | ... | 79 |

24. తైజసుడు - సూక్ష్మశరీరాభిమాని ... 80
25. స్వప్నము అనగా నేమి ? ... 81
26. ప్రాజ్ఞుడు – కారణశరీరాభిమాని ... 83
27. తురీయావస్థ – సాక్షిచైతన్యము ... 84
28. శరీరత్రయ సమిష్టిరూపము – ఈశ్వరుడు ... 85
29. విరాట్ పురుషుడు – స్థూలశరీరము ... 86
30. హిరణ్యగర్భుడు – సూక్ష్మశరీరము ... 87
31. ప్రాజ్ఞుడు – కారణశరీరము ... 88
32. స్థూల, సూక్ష్మ శరీరములకు గల అంతరమేమి ? 91
33. ఈశ్వర సత్యనారాయణ యనగా నెవ్వరు ? 97
34. విశ్వాత్మ – స్థూలశరీరాభిమాని ... 119
35. తైజసాత్మ – సూక్ష్మశరీరాభిమాని ... 120
36. ప్రాజ్ఞాత్మ – కారణశరీరాభిమాని ... 123
37. లోకత్రయము ... 127
38. గురు డెట్టివాడై యుండవలయును ? ... 138
39. సన్యాసయోగము అనగా నేమి ? ... 139
40. పరాంతకాల మనగా నేమి ? ... 139
41. అమృతు డనగా నెవరు ? ... 141
42. బ్రహ్మవిద్యకు మూలపురుషు డెవ్వడు ? ... 145
43. ప్రణవస్వరూపము ... 155
44. త్రిస్థానములు ... 168
45. చతుష్పాదములు ... 168
46. పంచదైవతములు ... 168

—♦—

# ఆత్మ తత్త్వము

## సృష్టిక్రమము

## (అవరోహణ క్రమము)

## అక్షర బ్రహ్మము.

శ్రుతి॥ ఊర్ధ్వమూలో అవాక్ శాఖ ఏషోఽశ్వత్థ స్సనాతనః ।
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృత ముచ్యతే ।
తస్మిన్ లోకా స్థితా స్సర్వే తదునాత్యేతి కశ్చన ।
ఏతద్వైతత్॥

— కఠోపనిషత్తు.

సంసారము అశ్వత్థవృక్షముతో సరిపోల్చబడినది. "నశ్వః అపి స్థాస్యతి ఇతి అశ్వత్థః" రేపు నిలుచుట అనునది లేదు. కనుక 'అశ్వత్థము' అనబడినది. సంసారము, వృక్షము ఇవి రెండును సమానధర్మములు కలిగియున్నవి.

"అవ్యక్త"మగు బీజమునుండి ఉద్భవించినది వృక్షము. జ్ఞానక్రియాశక్తితో కూడుకొనిన అవ్యక్తమునుండియే ప్రపంచమును ఉత్పత్తియైనది. జలసమృద్ధిచేత వృక్షము పెరుగుచున్నది. 'తృష్ణ' యను జలసమృద్ధిచేత సంసారమును ఎదుగుచున్నది. స్కంధము వృక్షభారమును వహించుచున్నది. లింగశరీరము సంసారమునకు స్కంధమువంటిది. చిగురుటాకులు, పత్రములు, పుష్పములు, రసవత్తరములైన ఫలములు వృక్షమునకు శోభను

గూర్చుచున్నవి. సంసారవృక్షమునకు ఇంద్రియములే చిగురుటాకులు. శ్రుతిస్మృత్యాదులు – ఆకులు. యజ్ఞ, దాన, తపాది సత్క్రియలే – పుష్పములు. సుఖదుఃఖాదులు – ఫలములు. చతుర్దశభువనములు, పిపీలికాది బ్రహ్మాండమైన విశ్వజీవకోటి – సంసారవృక్షమును ఆశ్రయించిన పక్షిగణములు. హర్షశోకాదులచే చేయబడు నృత్యగీతాది వివిధ శబ్దములే – పక్షుల కిలకిలారావములు. దినదినప్రవర్థమానమగుచు అనుక్షణమును మారు స్వభావముగలది వృక్షము. జన్మ జరామరణాది దుఃఖపరంపరలకు లోనై సంసారమును క్షణక్షణమును మార్పు జెందుచున్నది. ఐంద్రజాలకుని మాయవలె తోచి భ్రమకొల్పి ప్రత్యక్షముగా కనబడి మరుక్షణమున నశించు స్వభావముగలది సంసారము. మందపవనాహతులచే ప్రకంపితమై చలనస్వభావము కలిగినది వృక్షము. యజ్ఞయాగాది కామ్యకర్మలచే సంసారమును ప్రచలిత ధర్మమును కలిగియున్నది. కాలాంతరమున జీర్ణమై, ఎండి మోడై వంటకట్టెయలకో గృహనిర్మాణసామగ్రికో ఖండింపబడుచున్నది. వృక్షము, సంసారమును ప్రళయావసరమున నశించుచున్నది. బ్రహ్మవిదులచే ఉపనిషత్ప్రతిపాదితమగు ఆత్మదర్శనాకాంక్ష, జ్ఞానము అను ఖడ్గములచే తెగనఱుకబడుచున్నది సంసారవృక్షము.

వృక్షము ఖండింపబడుచున్నది. తదుద్భవకారణమైన బీజముమాత్రము స్పృశింపబడక అటులనే యుండును. అది నశించుటలేదు. సంసారము అనగా ప్రపంచము నశించుచున్నది. నామరూప రహితమగుచున్నది. తత్కారణభూతమైన చైతన్యము జ్ఞానక్రియాశక్తులు నశించుటలేదు.



చైతన్యము సర్వోత్కృష్టమైనది. మహత్తరమైనది. అక్షరమైనది. సనాతనమైనది. అదియే "ఆత్మ"యని "బ్రహ్మము" అని పిలువబడినది. ఈ ఆత్మయే స్వప్రకాశాత్మకమైన జ్యోతి, అక్షరము. "అమృతము" అని పిలువబడునది అదియే.

అవ్యక్తాది స్థావరాంతమగు సంసారము అను వృక్షమునకు ఈ ఆత్మయే మూలము. వృక్షమునకు మూలము అధోభాగమున నుండును. ఆరోహణ క్రమమున వృక్షము పరిణతి నొందును. సంసారవృక్షమునకు వేళ్లు (మూలము) ఊర్ధ్వముగ నుండును. అవరోహణ క్రమమున సంసారవృక్షము పరిణతి నొందును. కనకనే "ఆత్మ" ఇచ్చట ఊర్ధ్వమూలము అని వర్ణింపబడినది.

"ఏతత్ వై" ఈ ఊర్ధ్వమూలమే "తత్" పదవాచ్యమైన ఆత్మ, బ్రహ్మము. ఈ వృక్షమునకు "నామము" "రూపము" అను శాఖలు రెండు. ఈ శాఖాద్వయముచే స్వరూపజ్ఞానము విస్తృతమైనది. ఈ స్వరూపజ్ఞానమును తెలిసికొన చేయు ప్రయత్నమే ఈ గ్రంథరచనోద్దేశ్యము. ఆత్మ; బ్రహ్మము ఇవి రెండును పర్యాయపదములే ఐనను "బ్రహ్మము"నకు మారుగా "ఆత్మ" "పరమాత్మ" యని ఈ రచనయందు వ్యవహరింపబడును.

నామము శబ్దబ్రహ్మస్వరూపము. ఆ శబ్దము మాతృకా స్వరూపము. ఆ మాతృక పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ అని నాలుగు రూపములు గలది. అందు "పరా" స్వరూపము ఊర్ధ్వమూలము, కనుక ఆత్మ పరమాత్మయని పిలువబడినది. పశ్యంతీ

మధ్యమా వైఖరీలు తదాశ్రయములు. నామము శక్తియొక్క అంశము (శక్త్యంశము).

రూపమును చరాచరజగత్తు బ్రహ్మాండము. శివునియొక్క అంశము (శివాంశము). శబ్దమునకును అర్థమునకును వలెనే అవినాభావసంబంధము గలిగి ఒకేఒక వస్తువుయొక్క అనగా మూలముయొక్క సంకేతములుగా నున్నవి. కనుక నామరూప జగత్తునకు బీజము 'పరా'; 'పరా' శబ్దము నామరూపాత్మక జగత్తును అతిక్రమించి సర్వోత్కృష్టమై యున్నది. కనుక ఆత్మ పరమాత్మయనియు బ్రహ్మము పరబ్రహ్మము అనియు పిలువబడినవి.

శ్రు॥ "బ్రహ్మ విదాప్నోతి పరమ్'' బ్రహ్మవేత్త పరం అనగా మోక్షమును ఉత్కృష్టపదమును అగు బ్రహ్మమును పొందుచున్నాడు.

అంతర్గత ఇచ్ఛాశక్తి సృష్టికి మూలము అగు ''పరా'' శబ్దవాచ్యము. అది అవాఙ్మానసగోచరము, అపరిచ్ఛేద్యము, సకల జగదుత్పత్తి స్థితి హేతువు; అగుట ''పరశివునకును'' "పరాశక్తి"కిని సంకేతములుగా నున్నవి.

శబ్దబ్రహ్మస్వరూపమైన మాతృకోత్పత్తి క్రమములో ప్రథమవస్తువు 'పర'. ఇది యొక బిందువుగా పరిగణింపబడినది. ఈ బిందు వికసనమున విసర్గలు (నాదములు) కలుగుచున్నవి. ఆ నాదమువలన "కలలు" అనగా స్వరవ్యంజనములు కలుగుచున్నవి.



ఛందోబద్ధములైన అకారాది క్షకారాంత మాతృకలు మహామహిమాన్వితములు; అత్యంత శక్తివంతములును; అగు "మంత్రములు" అగును. ఆ మంత్రములు శబ్దబ్రహ్మాత్మకములు.

చక్షుర్గోచరమగు చరాచరజగత్తు రూపముతో గూడినది. ఇది "అర్థబ్రహ్మము". నిరవయవమును, నిర్గుణమును, నిరంశమును అగు బ్రహ్మమునకు అవయవకల్పన చేసి, రూపమును ఏర్పరచి, సగుణబ్రహ్మము నుపాసించి, భవసాగరమును తరించుట సులభమార్గము.

ఈ వ్యాకృత (విస్తార) మైన ప్రపంచము ప్రళయాంతమున సృష్టికిపూర్వము అవ్యాకృత (సూక్ష్మ) మై యుండినది. ఈ సంసారము (ప్రపంచము) బీజమునుండి అంకురమువలె 'అవిద్య'చే గలిగినది. అవిద్య ఆత్మయందు క్రియాకారక ఫలలక్షణముగా ఆరోపింపబడియున్నది.

సంసారము అనాది, అనంతము. తన్నివృత్తి కోరువారికి అజ్ఞానము అవిద్య నశించవలయును. అప్పుడే ఆత్మస్వరూపము అవగతమగును. "బ్రహ్మవిదుడు" 'ఆత్మవేత్త' యగును.

శ్రు॥ అసద్వా ఇదమగ్ర ఆసీత్ । తతో వై సదజాయత । తదాత్మానగ్ం స్వయ మకురుత । తస్మా త్తత్సుకృత ముచ్యత ఇతి॥

— తైత్తిరీయోపనిషత్తు.

నామరూపవిశేషాత్మకమగు ఈజగత్తు సృష్టికిపూర్వము అవ్యాకృతనామరూపవిశేషాత్మకమగు ఆత్మగా నుండెను. అనగా 'ఆత్మ' అసద్రూపముగా నిర్వికారముగా నుండెను. అందుండి నామరూప ప్రవిభక్తమగు జగత్తు కలిగెను. అనగా ఆ అసత్తు

తన్ను సత్తుగా రూపొందించుకొనెను. తత్కారణమున బ్రహ్మము, ఆత్మ స్వయంకర్తృకమని 'సుకృతము' అని చెప్పబడుచున్నది.

శ్రు॥ "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్" సృష్టికిపూర్వము సద్రూపమే యున్నది అనియు శ్రుతి చెప్పుచున్నది. సృష్టి విషయమై భిన్నాభిప్రాయములను శ్రుతులు కలిగియున్నవి. వానిని చర్చించి గ్రంథభారమును పెంచుట నా అభిమతము గాదు.

ప్రళయసమయమున చరాచరజీవకోటి నశించినది. సర్వమును శూన్యమైనది. నిర్వికారమును, నిష్కళంకమును, నిరంశమును అగు స్వప్రకాశాత్మకజ్యోతి ఒకటియే ఉండెను. 'ఆత్మ' 'బ్రహ్మము' అని దానిని పిలచినారు, బాగుగనే యున్నది. నిర్విశేషముగా సర్వనాశనమై, సర్వనాశనమైనపుడు "ఈ 'ఆత్మ' మాత్రము నశింపలేదు" అని మీరు ఎటుల చెప్పగలరు? దీనికి ఆధారమేమి?

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని ఆత్మను శ్రుతులు ప్రశంసించినవి, నిర్వచించినవి. ఆకాశాదిపంచభూతములు 'ఆత్మ' నుండియే సృజింపబడినవి; అని శ్రుతి బోధించుచున్నది. ఏ సద్రూపమునుండి మరియొకటి ఉద్భవించుచున్నదో ఆ సద్రూపము మనకు చక్షుర్గోచరము కానంతమాత్రమున 'అదిలేదు' 'ఉన్నది' అని ఎటులచెప్పగలరు? అని సంశయించుట యుక్తము గాదు. స్వరూపమునుచూచి తత్కారణమగు 'ఆత్మ' ఉన్నది యని గ్రహించుట ధర్మము, న్యాయము. శూన్యమునుండి ఏ వస్తువును ఏర్పడదు. నామరూపాదికార్యమునకు కారణము శూన్యమగునెడల మనకు ఏమియు గోచరముగాదు. నామరూప



ప్రపంచమును మనము ప్రత్యక్షముగా జూచుచున్నాము. కనుక తత్కారణము 'ఆత్మ' యగుచున్నది.

ఒక మహావృక్షముకాదగిన దానిసారమును ఒక విత్తనము (బీజము) ఇమిడ్చికొనియున్నది. 'సృష్టి' నిర్మాణహేతువులైన 'సద సత్తులు' ఒకదానియందు మరియొకటి అంతర్లీనమై యున్నవి. సంసారవృక్షమునకు సారము ఈ సద సద్రూపమే.

ఒక మహావృక్షమున్నది. దానికి అనేక శాఖోపశాఖలు, వానికి కొమ్మలు, రెమ్మలు, పుష్పములు, పిందెలు, పండ్లు అన్నియు ఉన్నవి. వీనినన్నింటిని ప్రత్యక్షముగా మనము చూచుచున్నాము. కాని ఆ వృక్షమునకు ఉద్భవకారణమగు విత్తనమును మనము చూచుటలేదు.

ప్రత్యక్షముగా మనము చూడకపోయినను ఆ మహావృక్షమునకు ఉత్పత్తికారణమగు బీజమొకటియున్నదని మాత్రమంగీకరించుచున్నాము గదా! అంకురమునుచూచి బీజమును గుర్తించుచున్నాము. బీజము వృక్షమునకు ఉత్పత్తిహేతువు. 'ఆత్మ' చరాచరజగత్తునకు బీజము.

శుక్లపక్షమున చంద్రుని కళలు దినదినాభివృద్ధి చెందుచున్నవి. పౌర్ణమినాడు ప్రఫుల్లమైన షోడశకళలతో హృదయాహ్లాదమును కల్గించుచున్నాడు చంద్రుడు. కృష్ణపక్షమున ప్రతిపదాది చంద్రునికళలు అనుదినమును క్షీణించుచువచ్చి అంతమున అమావాస్యనాడు అసలే కన్పింపక కళాశూన్యమైన నిబిడాంధకారము వ్యాపించుచున్నది. అనాదిగా మనము దీనిని గమనించుచున్నాము. దీనిపై ఆధారపడియే జ్యోతిశ్శాస్త్రము ఏర్పడినది.

చంద్రునికి సర్వనాశనము గాకుండ బీజరూపమైనది, మూలాధారమైనది "షోడశీ"కళ. అది చర్మచక్షుస్సునకు గోచరముగాదు. మహాజ్ఞానులు, పరమహంసలు, తపస్సంపన్నులు మాత్రమే "ప్రతిపత్కల"ను "షోడశి"ని చూడగలుగుచున్నారు.

ఈ నిత్యసత్యమును మనము అంగీకరించుచున్నాము గదా! అటులనే ఆత్మకూడ అక్షరమై నిత్యమై సత్యమై శ్రియానంద స్వరూపమై అద్వితీయమై ప్రళయాంతమున సృష్టికి పూర్వము ఉండినది.

శ్రు॥ ఆత్మావై ఇదమగ్ర ఆసీత్॥ —బృహదారణ్యకము.
ఇది సత్యము.

"ఆత్మ" (బ్రహ్మము) - అక్షరము.

శ్రు॥ యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుశ్శ్రోత్రం।
యదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం।
తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః॥
— ముండకోపనిషత్తు.

ఆత్మ :-

1. అద్రేశ్యము:- బుద్ధీంద్రియములచేత చూచుటకు అగమ్యమైనది.
2. అగ్రాహ్యము:- కర్మేంద్రియములచేత స్పృశింప శక్యముగానిది.
3. అగోత్రము:- వశిష్ఠ, భారద్వాజ, కౌండిన్య, కశ్యపాది మహర్షుల వంశమునకు చెందినదిగాదు.



4. అవర్ణము:- స్థూల కృశత్వాది ద్రవ్యధర్మములు లేనిది. శుక్ల, కృష్ణ, లోహిత వర్ణరహితము.
5. అచక్షుశ్శ్రోత్రము:- జ్ఞానేంద్రియములవలన మనము విషయ గ్రహణము చేయుచున్నాము. ఆత్మకు అట్టి విషయ పరిగ్రహణము లేదు.
6. అపాణిపాదము:- కర్మేంద్రియములు ఆత్మకు లేవు.
7. నిత్యము:- ప్రళయావసరమునగూడ నశింపనిది అక్షరము.
8. విభువు:- బ్రహ్మాది స్థావరాంత భేదములచేత భిన్నభిన్న రూపముల దాల్చును.
9. సర్వగతము:- ఆకాశమువలె సర్వత్ర వ్యాపించియున్నది. విశ్వవ్యాప్తమై బహిరంతరముల నిండియున్నది.
10. సుసూక్ష్మము:- "అణోరణీయాన్" అణువులలో అణువు. శబ్ద స్పర్శాది స్థూలపదార్థకారణ భూతములు లేనిది.
11. అవ్యయము:- తఱిగిపోనిది, నిత్యపరిపూర్ణము, సర్వాత్మకము. 'అస్తి జాయతే వర్ధతే పరిణమతే వినశ్యతి' ఇత్యాది పరిణామధర్మములు గలది శరీరము. ఆత్మకు క్షీణ ధర్మము లేదు.
12. భూతయోని:- పృథివ్యాది స్థావరజంగమ పదార్థములకు మూలకందము.

బండిచక్రములకు ఇరుసువలె రథమునకు నేమివలె పిపీలికాది బ్రహ్మ పర్యంతము సమస్త చరాచర జగత్తునకును 'ఆత్మ' ఆధారము.

శ్రు॥ ప్రజాపతి శ్చరతి గర్భే అంతః
అజాయమానో బహుధా విజాయతే,
తస్య ధీరాః పరిపశ్యంతి యోనిం,
మరీచీనాం పదమిచ్ఛంతి వేధసః॥ —పురుషసూక్తము.

అతడు బ్రహ్మాండ గోళముయొక్క బహిరంతరముల వ్యాపించియున్నాడు. జన్మరహితుడు; ఐనను పలుతెఱగుల స్వసామర్థ్యమును ప్రకటించుచు వివిధ రూపముల నొందుచున్నాడు. అతని జగత్కారణస్వరూపమును జ్ఞానాగ్ని దగ్ధకర్ములు మాత్రమే తెలిసికొనుచున్నారు. కనుకనే అట్టి తేజఃపుంజముల స్థానమును అసూయాగ్రస్తులైన బ్రహ్మాది దేవగణములు పొందగోరుచున్నారు. అనగా బ్రహ్మాదులు అధిష్ఠించిన ఉన్నత పదవులకంటెను ఉత్కృష్టస్థానమును 'పరోరజసి' పదమును "తమసః పరస్తాత్" అని నిర్దేశింపబడిన మహోన్నత భూమికను, 'ఆత్మ' దర్శనము గాంచిన తేజోమూర్తులు మరీచ్యాది మహర్షులు పొందుచున్నారు అని భావము.

శ్రు॥ యస్మాత్పరం నా పరమస్తి కించి ద్యస్మాన్నాణీయో
న జ్యాయోఽస్తి కశ్చిత్ వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠ
త్యేకస్తే నేదం "పురుషేణ సర్వం".
— తైత్తిరీయోపనిషత్తు - నారాయణము.

"ఇదం పురుషేణ సర్వం". 'ఆత్మ' ఇచట 'పురుషుడు' అని వ్యవహరింపబడినాడు. వాస్తవముగా ఆత్మకు స్త్రీ పుం నపుంసక లింగభేదములేదు. 'పురుషుడు' అనగా పూర్ణం అనేన సర్వం ఇతిపురుషః. 'పాదోఽస్య విశ్వాభూతాని' అను శ్రుత్యను



సారము సర్వభూతములను ఏకాంశచేత ఆవరించి జడపదార్థములను సచేతనములుగా జేసిన చిన్మాత్రఘనుడు పురుషుడు. "విష్టభ్యాహ మిదం కృత్స్నం ఏకాంశేన స్థితో జగత్" అని భగవద్వాక్యము.

అతడు సామాన్యపురుషుడు గాడు. పురుషులలో ఉత్తముడు, శ్రేష్ఠుడు, పురుషోత్తముడు.

1. "పురి శయనా త్పురుషః - స చాసా ఉత్తమశ్చేతివా"
అనంతకోటి హృదయాంతరవాసియైన ఉత్తమపురుషుడు.

2. "పురశ్శరీర భూరీణి భువనాని ఫలాని చ
పురుశబ్దేన చోచ్యంతే తత్కర్తా పురుషస్మృతః॥"
"ఉద్గచ్ఛతి తమోయస్మాత్ తస్మాదుత్తమ ఉచ్యతే॥"
"పురుషు భూరిషు సత్వేషు సీదతివా॥"

అసంఖ్యాక శరీరములందుండిన చిద్ఘనానందమయుడు, అజ్ఞానాంధకారమును పటాపంచలుచేయువాడు పురుషుడు.

3. "పురూణి ఫలాని సనోతి దదాతివా"
భక్తులను అనుగ్రహించి వారుకోరిన కామ్యఫలములను ఒసంగు కరుణామయుడు పురుషోత్తముడు.

4. "పురూణి భువనాని సంహారసమయే స్యతి అంతం కరోతివా"
చతుర్దశ భువనములను ప్రళయావసరమున అంతము చేయువాడు పురుషోత్తముడు.

ఆత్మయే పురుషోత్తముడు అని పిలువబడినది. పురుషోత్తమునికన్న అన్యమైనదిలేదు. స్థూలపదార్థములేదు. సూక్ష్మ

పదార్థములేదు. అతడు అద్వితీయుడు. సర్వసముడు. వృక్షము వలె నిశ్చలుడు. "పరమే వ్యోమన్" అని జ్ఞానులచే శ్రుతులచే నిర్దేశింపబడిన పరమాకాశమునందుండి ప్రశాంత సుస్నిగ్ధ సుశీతల దివ్యజ్యోతుల ప్రసరింపజేయుచు ప్రపంచమును బహిరంతరముల ఉజ్జీవింపజేయుచున్న షోడశీకలా స్వరూపుడు. సత్యసంకల్పము, సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము, సర్వనియంతృత్వము, నిత్యమలుప్తశక్తిత్వము, అనాదిబోధశక్తిత్వము, అనంతాస్త్రశక్తి సమన్వితత్వము ఆదిగాగల అనంతకల్యాణగుణగణ సముపేతుడు పురుషోత్తముడు. అతడే పశుపతియైన పరశివుడు.

## పురుషోత్తముడు - పరశివుడు.

శ్రు॥ సహస్రశీర్షా పురుషః । సహస్రాక్షస్సహస్రపాత్ ।
స భూమిం విశ్వతోవృత్వా । అత్యతిష్ఠ ద్దశాంగులమ్॥ 1
పురుష ఏవేదగ్ం సర్వం । యద్భూతం యచ్చ భవ్యం।
ఉతామృతత్వ స్యేశానః । యదన్నేనాతి రోహతి॥ 2
ఏతావానస్య మహిమా । అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః ।
పాదోఽస్య విశ్వాభూతాని । త్రిపాదస్యామృతం దివి॥ 3
త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోఽస్యేహా భవాత్పునః ।
తతో విష్వఙ్ వ్యక్రామత్ సాశనానశనే అభి॥ 4

— పురుషసూక్తము.

పిపీలికాది బ్రహ్మపర్యంతము పురుషోత్తముడు ఏకాంశచేత సర్వజీవకోటియందును వ్యాపించియున్నాడు.



శ్రుతి॥ "పురుష ఏవేదగ్ం సర్వం" "పురుష ఏవేదగ్ం విశ్వం" అని శ్రుతులచే కొనియాడబడిన పురుషుడే, ఈ పరిదృశ్యమానమైన విశ్వము. అతడు విశ్వరూపుడు. అనంతమైన శిరస్సులు, అసంఖ్యాకమైన నేత్రములు, అగణ్యమైన పాదములు కలిగియున్నాడు. "అత్యతిష్ఠ ద్దశాంగులమ్॥" నాభికి పదియంగుళముల మేరలో ఉన్న హృదయగుహాయందు మాయావృతమైన తురీయాంశచేత "జీవ"రూపమును పొందియున్నాడు.

ప్రాణులుచేసిన ఆయా పుణ్యాకర్మలను అనుభవింపజేయుటకు ఆయా కర్మలకు అనుగుణమైన శరీరములను కల్పించి, స్వకీయమైన కారణావస్థను అతిక్రమించి "అన్నేన" అనగా తురీయమైన మాయాంశచేత జగదవస్థను పొందుచున్నాడు. ఈ పరిదృశ్యమాన విశ్వము, అతని సత్యస్వరూపము గాదు. కనుక కాలాంతరమున పంచభూతములలో విలీనమగుచున్నది. క్షరమగుచున్నది. "ఏతావానస్య మహిమా" ఇది అతని స్వకీయమైన సామర్థ్యవిశేషము మాత్రమే.

అవశిష్టమైన అతని త్రిపాదస్వరూపము అమృతము, అక్షరము. అది స్వప్రకాశాత్మకము. జ్ఞానజ్యోతి స్వరూపము. సనాతనము. ప్రళయావసరమునగూడ నశించనిది. సదసద్రూపమై నిరవయవమై నిష్కళంకమై నిరంశమై నిశ్చలమై యుండునది.

శ్రు॥ 'యదన్నేనాతి రోహతి' అన్నము అనగా ప్రకృతి, మహామాయ. అప్రవిభక్త దేశకాలాత్మకమైన నామరూపజగత్తు పురుషునియందు ఆత్మభూతమైయుండినది. పునస్సృష్టిలో ఆత్మస్వరూపపరిత్యాగము చేయక తననుండి వెలువడిన నామ

రూపాత్మక (వ్యాకృత) జగత్తునకు ఎట్టి సంబంధము లేక నిర్వికారుడై యుండువాడు పురుషోత్తముడు. అతడు మాయాతీతుడు. జగదతిరిక్తుడు. వాచామగోచర మతని దివ్యమహిమ.

శ్రు॥ యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ॥

— తైత్తిరీయోపనిషత్తు॥

యతః = ఏ యానందస్వరూపుని నుండి, వాచః = వాక్కులు, మనసా సహ = మనస్సుతో గూడ, అప్రాప్య = పొందక, నివర్తంతే = మరలుచున్నవో.

ఇచట 'వాక్కులు' అనగా 'వేదములు', 'మనస్సు' అనగా 'విజ్ఞానము' అని గ్రహింపవలయును.

అపౌరుషేయములు వేదములు. కర్మకాండను, జ్ఞానకాండను ప్రతిపాదించిన విజ్ఞానఖనులు. స్వతః ప్రమాణములు. కావ్యములవలె విప్రలంభాది దోషసంభావనా గంధరహితములు చేతనులు. తత్త్వజ్ఞానోదయమును గాంచుటకు ముఖ్యసాధనములు వేదములు.

శ్రు॥ ప్రత్యక్షేణానుమిత్యేవా యస్తూపాయో న బుధ్యతే,
ఏతం విందంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా॥

ప్రత్యక్షప్రమాణములచేతను, అనుమాన ప్రమాణముల చేతను బోధింపబడని ఉపాయము దేనిచే తెలియబడుచున్నదో దానికి "వేదము" అని పేరు. అట్టి వేదములు తమయందు నిక్షిప్తమైన సర్వవిజ్ఞానముచేతనుకూడ తెలియ నలవిగానిది అతని మహిమ.



శ్రు॥ "పాదోఽస్యేహా భవా త్పునః తతో విష్వఙ్ వ్యక్రామత్ సాశనాఽనశనే అభి॥"

ఇహ = ఈ జగద్విషయమై, పాదః = నాలుగవ అంశము, సాశనాఽనశనే = "సాశనా" అనగా భోజనాది వ్యవహారోపేతమగు చేతనజగత్తు; "అనశనా" అనగా భోజనాది వ్యవహారము లేని, గిరి నద్యాదికములు, అనగా ఆహారముగల ప్రాణిస్వరూపముగాను ఆహారము లేని పర్వతాదులుగాను; విష్వఙ్ = దేవ తిర్యగాది రూపములుగాను, అభివ్యక్రామత్ = అంతటను వ్యాపించియుండినవాడయ్యెను. పరమాత్మ మాయను తనకు లోబరచుకున్నవాడైనను మాయకు స్వాధీనమైనవాడు వలెనే తన స్వరూపములో నాల్గవయంశముచే ఈ కనబడునట్టి సమస్తప్రపంచ స్వరూపుడై పూర్ణుడై వ్యాపించియుండెను.

"సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" యని పురుషోత్తముని వర్ణించినవి శ్రుతులు. అట్టి పురుషోత్తమునకు పరమాత్మకు అంశచతుష్టయమును ఆపాదించి న్యూనాధిక్యతలు ఆపాదించుచున్నారు. పాదాంశచేత ఆవృతుడైన జీవునకును పరమాత్మకును ఆధార ఆధేయ భావనవలన భిన్నత్వమును అపూర్ణత్వమును ద్యోతకమగుచున్నది. మీ యీ ప్రతిపాదన సవ్యముగా లేదు. ఏమందురు దీనికి ?

"పాదాంశ" ప్రతిపాదనచేత జీవుడు పరమాత్మ స్వరూపములో చతుర్థాంశయని ధృవపడుచున్నది. నిజమే. కాని ఇది ఊహామాత్రమే.

పరమాత్మ పూర్ణుడు. పాదాంశగా నిర్దేశింపబడిన జీవాత్మయు పూర్ణుడే. ఈ చరాచరజగత్తును పూర్ణమే. సర్వకలా పరిపూర్ణమైన పరమాత్మనుండి విభిన్నాంశలతో, విభిన్న రూపములతో ప్రకటితమగుచున్న పిపీలికాది బ్రహ్మపర్యంతమైన సమస్తజగత్తును పూర్ణమే.

శ్రు॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే,
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥
— శుక్లయజుర్వేద శాంతిపాఠము.

1. పూర్ణమదః పూర్ణమిదం॥

అదః = సర్వనామ తత్పరమైన బ్రహ్మము 'ఆత్మ'.

పూర్ణం = ఆకాశమువలె సర్వత్ర వ్యాపించి పూర్ణమై (నిండి) యున్నది.

ఇదం = 'జగత్తు' 'జీవాత్మ' (వ్యాకృతము) నామరూపాత్మకమైన ఉపాధులతో గూడినది. వ్యవహారాపన్నము. కార్యాత్మకము.

పూర్ణం = "ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్" అను శ్రుత్యనుసారము పరమాత్మ స్వరూపముచే బహిరంతరముల నిండియున్నది. కనుక ఇదియు పూర్ణమే.

2. పూర్ణాత్ పూర్ణం ఉదచ్యతే॥

పూర్ణం = కార్యాత్మకమైన (జగత్తు) జీవాత్మ.

పూర్ణాత్ = కారణాత్మకమైనపరమాత్మనుండి పూర్ణమునుండి.



ఉదచ్యతే = పరమాత్మభావమును వదలిపెట్టదు త్యజించదు.

3. పూర్ణస్య పూర్ణం ఆదాయ॥

పూర్ణస్య = కార్యాత్ముడైన జీవబ్రహ్మయొక్క.

పూర్ణం ఆదాయ = కారణసత్తను అవగతము జేసికొనినందున అవిద్యోపాధివలన గలిగిన మాయావరణము తొలగిపోయినందున జ్ఞానపూర్ణత్వము నొందగా, ఆత్మజ్ఞానమువలన తానుకూడా అవిచ్ఛిన్నమైన పూర్ణమైన 'బ్రహ్మము'నే యని గ్రహించి తాదాత్మ్యమును జెందగా, ఏకత్వము నొందగా.

4. పూర్ణం ఏవ అవశిష్యతే॥

పూర్ణం ఏవ = ప్రజ్ఞానఘనైక రసస్వరూపమగు శ్రియానంద నిలయమగు బ్రహ్మనే, పూర్ణమైన పరమాత్మయే.

అవశిష్యతే = మిగులుచున్నది

సారాంశము:— అవిద్యోపాధి సంసర్గజన్యాఽభాసములైన పంచదశకళలు దినక్రమమున క్షీణించుచు తాదాత్మ్యతను చెంది ఏకత్వమునొందగా (పంచదశి) "విద్య"చే ఆత్మవికసనమొందిన జీవాత్మ ప్రఫుల్లమై షోడశకళాపరిపూర్ణమగు నిరతిశయానంద రసస్వరూపమగు "షోడశీ" నామాంకిత పరమాత్మయందు అంతర్లీనమై తద్దైక్యతను సాధించి పరిపూర్ణత్వము నొందును.

సర్వోపనిషత్ప్రతిపాదితమైన 'బ్రహ్మము', 'పరమాత్మ' కారణాత్మకము. జీవాత్మ కార్యాత్మకము.

ఉత్పత్తి స్థితి లయములు అను త్రివిధపరిణామములందును, భూత భవిష్యత్ వర్తమానములు అను త్రికాలము లందును కార్య కారణాత్మకములైన జీవాత్మపరమాత్మలు పరిపూర్ణములై, అవచ్ఛిన్నములై, అద్వితీయములై, ఏకస్వరూపములై యున్నవి అని జీవబ్రహ్మైక్యతను ఈ శాంతిమంత్రము ప్రతిపాదించుచున్నది.

ఏవంగుణ విశేషణ విశిష్టుడైన పురుషోత్తముని మనము అనూచాన సాంప్రదాయముల ననుసరించి విభిన్నరూపముల కల్పించుకొని ఆయా రూపములకు అనుగుణమైన రామ కృష్ణాది నామముల నేర్పరచికొని, పూజించి, ధ్యానించి, తత్సాలోక్యమును, సామీప్యమును, సారూప్యమును, సాయుజ్యమును పొందుచున్నాము. ముక్కోటిదేవతలలో శివకేశవులు ప్రధానులు. తక్కుదైవములు వారి శక్తులకు, మహిమలకు లోబడిన వారని భావించుచున్నాము. నిజమరయుచో సావధానముగా పరిశీలించుచో శివకేశవులకు భేదము లేదు. ఇరువురును ఒకే దివ్యతత్త్వమునకు సత్త్వమునకు చెందినవారు. భేదము మన దృక్పథములలోనే యున్నది, మన సాంప్రదాయములలోనే యున్నది. మన భావములలోనే అట్టి మాలిన్యము, సంకుచితతత్త్వము నిండి నిబిడీకృతమై యున్నది. భావము ఎట్టిదైనను అంత్యమున చేరు గమ్యస్థానము ఒక్కటియే.

విష్ణుశబ్దార్థమును గమనింపుడు :—

1. యస్మాద్విష్ట మిదం సర్వం తస్యశక్త్యా మహాత్మనః,
తస్మా ద్విష్ణు రితి ఖ్యాతో విశేర్ధాతోః ప్రవేశనాత్॥
విశ్వం వేష్టి వ్యాప్నోతీతి విష్ణుః.



ప్రపంచమంతయును స్వశక్తిచేత, స్వసామర్థ్యముచేత వ్యాపించియుండువాడు విష్ణువు.

2. "విష్ణు ర్విక్రమణాత్" అని యాస్కుడు. 'విశప్రవేశనే' ఇతి ధాతువు. సర్వమును విక్రమించి ప్రభువై యుండువాడు విష్ణువు.
3. "ఆదిత్యానా మహం విష్ణుః" — భగవద్గీత.
ద్వాదశాదిత్యులలో 'విష్ణువు' అని ఒక నామము గలవాడు విష్ణువు.
4. "యజ్ఞో వై విష్ణుః ఇతి శ్రుతేః యజ్ఞస్వరూపోవా"
కర్మకాండములో వేదప్రతిపాదితుడైన యజ్ఞస్వరూపుడు విష్ణువు.

ఇట్టి విశేషణ విశేషార్థములు సమతుల్యముగా పరశివునకును అన్వయించును. కనుక పురుషోత్తముడు 'పరశివుడు' అని గ్రహించి రచన సాగింతును. పాఠకులు అనుమతింతురుగాక !

## ప్రకృతి - పరాశక్తి.

శ్రు॥ సోఽకామయత । బహుస్యాం ప్రజాయే యేతి॥
— తైత్తిరీయోపనిషత్తు.

సః = ఆ పరమాత్మ అనగా ఆకాశాది పంచభూతములకు ఉత్పత్తిహేతువు ఐన ఆ పరమాత్మ, అకామయత = కోరెను. ఏమని ? బహు = అనేకప్రకారములుగా, స్యాం = అగుదును. బహువిధములుగా విస్తరింపవలయును; వ్యాపింపవలయును అని కోరెను, సంకల్పించెను.

ప్రళయావసరమున జీవకోటియొక్క శరీరోపాధులు నశించినవి. అక్షరమైన జీవాత్మలుమాత్రము సూక్ష్మమైన అణురూపము నొంది పరమాత్మ నాశ్రయించినవి. అతని విశ్వకారణ రూపములో విలీనమైపోయినవి.

కాని అవి కర్మశేషమును ఇంకను అనుభవింపవలసియున్నది. అందులకుగాను తత్కర్మానుగుణమైన (ఉపాధులు) శరీరములు ధరింపవలసియున్నది. పునస్సృష్టి ఆవశ్యకమైనది.

"తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" — తైత్తిరీయోపనిషత్తు

పరమాత్మ శరీరములను ప్రవేశించనియెడల తనయందు దాగియున్న విలీనమైయున్న తాదాత్మ్యమును జెందియున్న ఆత్మభూతములైయున్న నామరూపజగత్తును ఎటుల విస్తరింపజేయగలడు? అసంభవముగదా! ఇట్టి పరిస్థితిలో పరమాత్మ "బహూస్యాం" "అనేక మగుదునుగాక" వివిధరూపములతో "ప్రజాయేయ" "ప్రకాశింతునుగాక" అని సంకల్పించెను.

శ్రు॥ "తస్మాద్విరాడజాయత"

— పురుషసూక్తము.

అటుల సంకల్పించిన వెంటనే తస్మాత్ = ఆ పరమాత్మ నుండి, విరాట్ = బ్రహ్మాండమనెడి దేహముగల సమస్త జీవకోటిని గర్భమునందు ఇముడ్చుకొనిన ప్రకృతి కలిగెను.

అగణితమైన సమిష్టి స్థూల సూక్ష్మ శరీరములను ధరించి మాయావశమున అవి 'నేను' అని అభిమానించి జాగ్రదవస్థను పొంది దేవ మానుష పశు పక్ష్యాది వివిధ శరీరములతో



వివిధ రూపములుగా ప్రకాశించుచున్నది కనుక ప్రకృతికి "విరాట్" అను నామము అన్వయించుచున్నది.

శ్రు॥ ఏకమేవాద్వితీయం బ్రహ్మ। తస్మిన్ మరు శుక్తికా స్థాణు స్ఫటికాదే జల రౌప్య పురుష రేఖాదివ లోహిత శుక్ల కృష్ణ గుణమయీ గుణసామ్యా నిర్వాచ్యా మూలప్రకృతిరాసీత్॥

— పైంగలోపనిషత్తు॥

పునస్సృష్టిసంకల్పము కలిగిన వెంటనే ఆపరమాత్మనుండి మూలప్రకృతి యనుపేర బరగు ఇట్టిదని నిర్ణయింప శక్యముగాని "మహామాయ" గలిగెను.

(1) అవిద్య (2) తమస్సు (3) సుషుప్తి (4) మహాప్రళయము (5) అవ్యాకృతము (6) అవ్యక్తము (7) మహామాయ అని ప్రకృతికి నామాంతరములు. ఆయా నామముల అర్థవివరణము ఈ దిగువ నుదహరింపబడుచున్నది.

1. అవిద్య:- "యా తదభిమానం కారయతి సాఽహ్యవిద్యా, సోఽభిమానో యయా నివర్తతే సా విద్యా"

— సర్వసారోపనిషత్తు.

"ఈ దేహము, ఈ ఇంద్రియములు నేనే. నాకు అన్యమైనది వేఱొండులేదు." అను భ్రాంతి, అభిమానము దేని వలన కలుగుచున్నదో అదియే 'అజ్ఞానము' – 'అవిద్య' అనబడును. తద్వ్యతిరిక్తమైనది అనగా అట్టి అభిమానము దేని వలన నివర్తింపబడుచున్నదో అదియే 'జ్ఞానము' – 'విద్య'.

2. తమస్సు:- సత్యము, జ్ఞానము, ఆనందము అను త్రయా ధర్మాత్మకము 'పరమాత్మ'. ఇదియే 'సత్'పద వాచ్యము.

సృష్టికి పూర్వముండిన దిదియే. జగత్సృజనేచ్ఛ పరమాత్మకు కలిగిన వెంటనే వినిర్మలాకాశమునందు వినీలమేఘోదయమువలె దివాకరుని ఛాయవోలె ఆ సచ్చిదానంద పరమాత్మను తమస్సు ఆవరించినది. ఆ తమస్సుయొక్క స్వరూపము ఇట్టిదని నిర్ణయింపజాలము. పరమాత్మయొక్క సంకల్పాత్మకము, కనుక తద్రూపమైన 'సత్తు' గాదు. తద్భిన్నమునుగాదు. సంకేతార్థము దీనిని తమోరూప మని నారు. జడస్వభావముగలది మోహాత్మకము, మోహము. అనగా వస్తువుయొక్క యథార్థ స్వరూపము తెలియక పోవుట. ఒకవస్తువును మరియొకవస్తువుగా తెలిసికొనుట. అనగా రజ్జువునుచూచి సర్పముగా భావించుట మోహమనబడును. ఇదియే తమస్సు.

3. సుషుప్తి:- శ్రు॥ చిత్తైకకరణా సుషుప్త్యవస్థా భవతి॥

— పైంగలోపనిషత్తు.

అంకురము (మొలక) బీజము (వి_త్తనము) నందు లీనమై అంతర్గర్భితమై అవ్యక్తమైయున్నది. అటులనే అవిద్య యను బీజమునందు మనస్సు మొదలుగాగల చతుర్దశేంద్రియములు అంకురములవలె లీనమగునపుడు ఇంద్రియములకు శబ్ద స్పర్శ రూపాది విషయగ్రహణ వైముఖ్య మేర్పడును. అట్టి సమయమున ఇంద్రియములు జడీభూతములై నిర్వీర్యములై చలనరహితములై ఎట్టి విషయమును గ్రహింపనేరక అనుభవింపనేరక జగద్వ్యాపారమును గాంచనేరని స్థితిలో నుండును. అట్టిస్థితికే 'నిద్రావస్థ' 'సుషుప్తి' యని పేరు.



4. మహాప్రళయము:- అనంతకోటి జీవసంఘాతమును ప్రళయ సమయమున గ్రసించి అణురూపమున తన కుక్షియందు నిక్షిప్తమొనర్చుకొనిన విరాట్స్వరూపము; ఆదిశక్తి.

5. మూలప్రకృతి:- ప్రపంచ వాసనామయము.

వాసన యనగా నేమి?

శ్రు॥ దృఢభావనయా త్యక్త పూర్వాపర విచారణమ్ ।
యదా దానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా॥

— ముక్తికోపనిషత్తు.

అనాదికాలమునుండి ప్రాపంచిక సుఖదుఃఖములకు దృఢముగా అలవాటుపడియుండుటవలన యుక్తాఽయుక్త విచక్షణ జ్ఞానములేక పూర్వాఽపరములు అనెడి వివేకములేక మరల అట్టి అనిత్యమైన సంసారానుభవమునే స్థిరముగా నమ్మి దానియందు మనస్సు లగ్నముచేసి నిరంతరము దానిని స్మరించుచు అదియే జ్ఞప్తియం దుంచుకొని వ్యవహరించుట "వాసన" యనబడును.

పూర్వజన్మసంస్కారములే వాసనలు. ఇది రెండు తెఱగులు 'శుద్ధము' 'మలినము' అని. జననమరణములు కలిగించునది 'మలినవాసన'. అవి లేకుండజేయునది 'శుద్ధవాసన'.

అజ్ఞానస్వరూపమే, అహంకారస్వభావమే మలినవాసన.

(1) లోకవాసన, (2) శాస్త్రవాసన, (3) దేహవాసన అని మలినవాసన మూడు విధములు. వీనియం దాసక్తిగల వ్యక్తి 'ఆత్మ' జ్ఞానమును బడయజాలడు.

తాను చేయు ప్రతియొక కార్యమును ఎల్లరును శ్లాఘింప వలయునను తలంపు "లోకవాసన" యనబడును.

తామే సకలవేదవేదాంగ పారంగతులమని గర్వముతో నిక్కుచు, శివకేశవాది భేదములు కల్పించి, ఆవేశముతో వ్యర్థమైన శుష్కమైన తర్కవాదములతో పోరాడుచుండుటయే "శాస్త్రవాసన" యనబడును.

"దేహపటుత్వము సడలకూడదు, నల్లని వెండ్రుకలు తెల్లనవకూడదు, జరామరణములు ఆధివ్యాధులు దరిచేరరాదు, మూలికలు సిద్ధౌషధములు మొదలగునవి సేవించి కాయసిద్ధి పొందవలయును" ఇత్యాది దేహాభిమాన తలంపులే "దేహవాసన" యనబడును.

ఇట్టి విషయవాసనావ్యామోహమే ఆత్మజ్ఞానదూరగుని చేయును. నిరంతరము ఆత్మధ్యానము, ఆత్మానుభవనిష్ఠయనెడు నిర్వికల్పసమాధినిష్ఠను అభ్యసించు మహనీయులు మాత్రమే ఈ వాసనాత్రయమునుండి ముక్తులగుదురు. తదితరులు ఈ శృంఖలములను వదలించుకొనలేరు.

శ్రు॥ ప్రకర్షేణ క్రియతే జగదారంభ మనయేతి ప్రకృతిః॥

సృష్టి దేనిచే ప్రారంభింపబడుచున్నదో, సృష్టికి యేది మూలమో అదియే "మూలప్రకృతి" యనబడును.

శ్రు॥ బ్రహ్మణస్సకాశాన్నానా విచిత్ర జగన్నిర్మాణ
సామర్థ్యైక బుద్ధిరూప బ్రహ్మశక్తిరేవ ప్రకృతిః॥

— నిరాలంబోపనిషత్తు.



మంచి ముత్యమునందు వెండి యను భ్రాంతి గలుగుచున్నది. ఎండమావులయందు క్షుత్పిపాసానివారకమైన జలభ్రాంతి గలుగుచున్నది. స్థాణువు పురుషభ్రాంతిని, రజ్జువు సర్పభ్రాంతిని కల్గించుచున్నవి. అన్యవస్తు సంపర్కముచే సన్నిహితత్వముచే స్ఫటికము అసత్యభ్రాంతి గల్గించుచున్నది. వినిర్మలాకాశమును మేఘములు ఆవరించి నీలిమభ్రాంతిని కల్గించుచున్నవి. బుద్ధిరూపమైన మహామాయ అఖండ సచ్చిదానంద పరబ్రహ్మమును తనకు తానే ఆవరించి "ప్రకృతి" యనబడుచున్నది.

అచేతనమైనది ప్రకృతి. పురుషసాన్నిధ్య సన్నిహిత సంపర్కములచేత తద్గుణసంపదల నొంది సచేతనమై జ్ఞానస్వరూపిణియు జగత్ప్రసవిత్రియు నగుచున్నది.

6. అవ్యాకృతము:- నామరూపరహితము "అసత్తు".

7. అవ్యక్తము:- న + వ్యక్తం = అవ్యక్తము = చక్షుర్గోచరము గానిది. బీజమునందు వటవృక్షశక్తి అవ్యక్తము. మాంత్రికునియందు మాయలచేయు నేర్పు అవ్యక్తము. పాషాణమునందు కఠినత్వశక్తి అవ్యక్తము. జలమునందు ద్రవశక్తి అవ్యక్తము. వాయువునందు చలనశక్తి అవ్యక్తము. బీజమునందు అంకురము అవ్యక్తము. మృత్తికయందు ఘటరూపము అవ్యక్తము. శుక్లశోణితములయందు దేహరూప పరిణామశక్తి అవ్యక్తము. శరీరమునందు చైతన్యశక్తి అవ్యక్తము. ప్రకృతియందు సత్త్వ రజ స్తమోగుణాత్మిక శక్తి అవ్యక్తము. ప్రకాశశక్తియందు విమర్శశక్తి అవ్యక్తము. 'సత్తు'నందు 'అసత్తు' అవ్యక్తము.

శ్లో॥ జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హి సా ।
బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి॥
— సప్తశతి.

మహాజ్ఞానులు, తపస్సంపన్నులు సహితము అవ్యక్త స్వరూపమును తెలిసికొనజాలక మాయావశులై ప్రకృతి బంధముల చిక్కువడుచున్నారు. అవ్యక్తము చక్షుర్గోచరముగాదు. ఐనను విభిన్నభావములుగల ప్రధానవస్తువులకు మూలమై ఆ యా వస్తుతత్త్వములకు భిన్నముగానిదై యుండును. అటులనే పరమపురుషులయందు భావముచే నాశ్రయించి ఓతప్రోతమై యుండును.

మహామాయ:– వాస్తవికస్థితిలేని జగత్తును యథార్థముగా ఉన్నటులనే కల్పింపజేయు శక్తియే మహామాయ. అది త్రిగుణాత్మకము. ప్రకృతి సత్వగుణప్రధాన యగునపుడు 'మాయ'; రజోగుణప్రధాన యగునపుడు 'అవిద్య'; తమోగుణప్రధాన యగునపుడు 'అవరణ' 'విక్షేపశక్తులు' అనియు పిలువబడును.

ఆవరణకు 'ఆవృతి' యను నామాంతరమును గలదు. ఆవరణ అనగా = వేదమార్గములను విడచి త్రోసిపుచ్చి భిన్న దృక్పథముగలిగి ప్రచలితమగు ఇచ్ఛకు తోచినటుల నిర్ణయించి (బ్రహ్మము) 'ఆత్మ' యనునవి లేనేలేదు; అది అగుపడునది లేదు. కనుక మిథ్య కేవలము భ్రాంతిమాత్రమే అను విపరీత (వ్యవహారము) జ్ఞానము కలుగుట 'ఆవరణ' అనబడును.

వేదోక్తమైన సత్కర్మానుష్ఠానముచే ఆవరణము నశించును.



'అహమహం' అని వ్యవహరించుచున్న తాను స్థూలము సూక్ష్మము అను రెండు శరీరములు నాకు గలవు, చిదాభాసుడగు జీవుడను నేనే, 'నాకు అన్యమైనది ఎద్దియు లేదు' అను అజ్ఞానమే 'విక్షేపము'.

సత్పురుషసాంగత్య సన్నిహితత్వసపర్యలచేత సద్గురూపదిష్ట మంత్రోపాసన ఫలించుటచేత 'విక్షేపము' విడివడును.

'పాదోఽస్య విశ్వాభూతాని' అను శ్రుత్యనుసారము పరమాత్మయొక్క చతుర్థాంశము "మాయ". ఆవరణము, విక్షేపము, తమస్సు అనగా అజ్ఞానము. ఇవి మూడును మహామాయయొక్క అంతరంగిక కార్యనిర్వాహకవర్గము. ఇవి జీవుని శృంఖలాబద్ధుని చేయును. జీవరాశి దేవతిర్యగాది వివిధరూపములతో కర్మఫలమును అనుభవించుచు కాలచక్రమున పరిభ్రమించుచుండుట అవాఙ్మానసగోచరమైన మహామాయా ప్రభావమునకు లోనగుటచేతనే.

శాక్తదృక్పథము - ప్రకృతి పురుషులు.

ప్రకృతి – పరాశక్తి. పురుషుడు – పరశివుడు.

శ్రు॥ "ఆత్మానం ద్వేధా విభజ్య స్త్రీ పుం భావ మాపన్నః"
— బృహదారణ్యకము.

స్వసామర్థ్యముచే ద్విధావిభక్తమై స్త్రీ పుం భావమును పొంది పరమాత్మ సృష్టికార్యనిర్వహణ మొనర్చెనని బృహదారణ్యకోపనిష ద్వాక్యము.

పురుషుడు – 'ఆత్మ'. ప్రకృతి – 'శరీరము'.

శ్లో॥ ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదే ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధిప్రకృతి సంభవాన్.

— భగవద్గీత.

పరాశక్తి; పరశివుడు ఆదిమిథునము. ఆ యాదిదంపతుల లాస్య తాండవ నృత్యాభినయ పరిణామమే విరాడ్విశ్వము.

శ్లో॥ అనాది నిధనాచ్ఛాంతా చ్ఛివాత్పరమకారణాత్।
ఇచ్ఛాశక్తి ర్వినిష్క్రాంతా తతోజ్ఞానం తతఃక్రియా।
తత్రోత్పన్నాని భూతాని భువనాని చతుర్దశ॥

— శివాగమము.

సృష్టికి పూర్వము బిందురూపముననుండిన స్వప్రకాశాత్మకజ్యోతియే 'ప్రకాశశక్తి' యనబరగు శివుడు. 'బహుస్యాం' నేను అనేక రూపములను ధరింతునుగాక !, 'ప్రజాయేయ' వివిధరూపముల కనుగుణమగు జన్మల నెత్తుదునుగాక!, యను సంకల్పమే "ఇచ్ఛాశక్తి". ఇచ్ఛాశక్తియే జ్ఞానశక్తిగాను అదియే క్రియాశక్తిగాను పరిణతి నంది సృజనకార్యము రూపము దాల్చినది.

పరమేశ్వరునియందు అవ్యక్తమై అంతర్లీనమై తాదాత్మ్యమును జెందిన విమర్శ శక్తియొక్క స్ఫురణయే స్పందనమే 'బహుస్యాం' అనెడి సంకల్పరూపమైన 'ఇచ్ఛాశక్తి'. తద్వికసనమే 'ప్రజాయేయ' అనెడి జ్ఞానశక్తి. ఇచ్ఛా, జ్ఞానముల సమిష్టిచైతన్య వికసనమే క్రియారూప సృష్టిపరిణామము.

జ్ఞానవికసనము – శివతత్త్వము. క్రియాపరిణతి – శక్తితత్త్వము. జ్ఞాన క్రియా తత్త్వములకు పరమార్థభేదము లేదు.



శ్లో॥ శివః శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం।
నచే దేవం దేవో నఖలు కుశలః స్పందితు మపి॥

— సౌందర్యలహరి.

పదయోజనా – "హేభగవతీ ! శివో దేవః శక్త్యా యుక్తో భవతి యది తథా ప్రభవితుం శక్తః। ఏవం నచేత్ స్పందితు మపి కుశలో నఖలు"

"శివుడున్ శక్తిని నిన్నుగూడినపుడే చెల్లు న్విభుత్వంబు
శక్తి వియుక్తిన్ కదలంగనైన గలడే దేవుండెగానిమ్మ"

— శ్రీ శ్రియానందనాథగురుజీ.

ఇచ్ఛ, జ్ఞానము, క్రియ అను యీ త్రయీశక్తియుతుడైనపుడే శివునకు స్వప్రకాశత్వము. తద్వారా విశ్వసృజనశక్తి కలుగుచున్నది. ఏతత్త్రయీశక్తి వియుక్తుడగుచో నిర్వీర్యుడై నిశ్చేతనుడై ఆవంతయైనను కదలజాలని జడత్వము నొందుచున్నాడు.

1. మూలాధారము. 2. స్వాధిష్ఠానము. 3. మణిపూరము. 4. అనాహతము. 5. విశుద్ధము. 6. ఆజ్ఞ అనునవి షట్చక్రములు.

సనాతనులగు ప్రకృతి పురుషుల దాంపత్యధర్మనిర్వహణ తత్పరత్వమే ప్రపంచరూప సంతానరూప పరిణామము.

శ్రు॥ యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతేచ
తథాఽక్షరాత్సంభవతేహ విశ్వం. —ముండకోపనిషత్తు.

ఊర్ణనాభి యనగా సాలెపురుగు. తాను నిర్మించు తంతువునకు నిమిత్తమును, ఉపాదానమును రెండును తానే యగుచున్నది. అటులనే పరశివుడును ప్రపంచనిర్మాణమునకు నిమిత్తమును ఉపాదానమును అగుచున్నాడు.

ప్రకృతి పురుషుల అన్యోన్యసామరస్యమే, శేషి శేష భావమే, అవినాభావసంబంధమే, సమానబాధ్యతయే ప్రపంచ నిర్మాణహేతువు – అని శ్రీ శంకరభగవత్పాదులవారు నిరూపించుచున్నారు

శ్లో॥ తవాధారే మూలే సహసమయయా లాస్యపరయా
నవాత్మానం మన్యే నవరస మహాతాండవనటం,
ఉభాభ్యా మేతాభ్యా ముదయవిధి ముద్దిశ్య దయయా
సనాథాభ్యాం జజ్ఞే జనకజననీ మజ్జగదిదమ్॥

— సౌందర్యలహరి.

చ॥ నవరసయుక్తిమీర నటనప్రియయా సమయాంబతోడ దాం
డవపరుడేచు మూలనలినమ్మున నాడు నటేశు నెంచెదన్
నవతనుగాగ ఈ మిథున నవ్యకృపాళుత సృష్టి చాయనే
తవులగ నీజగంబు తలిదండ్రులు గల్గినదై చెలంగెడిన్॥

— శ్రీ శ్రీయానందనాథ గురుజీ.

స్త్రీ పురుష నృత్యములు లాస్య తాండవము లనబడును. ప్రకృతి సమయాంబ. పురుషుడు నటేశ్వరుడు. లాస్య తాండవ పరవశులైన ప్రకృతి పురుషుల దర్శనమే జగదుత్పత్తి. నృత్తావసానమే జగత్సంహృతి. ఇది కాలసిద్ధాంతము. ఇందు ప్రతిపాదింపబడిన దిదియే.



జగదుత్పత్తికి ఉభయులును సమానబాధ్యత వహించుచున్నారు. ప్రత్యేకించి ఏ ఒక్కరును స్వతంత్రించి ఈ నిర్మాణ కార్యమును జేయజాలరు – అని భావము.

సమయాంబ – పరాశక్తి. నటేశ్వరుడు – పరశివుడు. (శంభునా సామ్యం పంచవిధం యాతీతి “సమయా”)

(1) అధిష్ఠానము (2) అనుష్ఠానము (3) అవస్థానము (4) రూపము (5) నామము అని ఐదువిధముల సామ్యమును – పరాశక్తి శివునితో గలిగియున్నది. కనుక “సమయాంబ” యని పిలువబడినది.

(1) మూలాధారము (2) స్వాధిష్ఠానము (3) మణిపూరము (4) అనాహతము (5) విశుద్ధము (6) ఆజ్ఞ అనునవి షట్చక్రములు. ఇవియే షట్పద్మములనియు పిలువబడును. అందు మూలాధారము – పృథివ్యాత్మకము.

పిండాండమున – మూలాధారము నాట్యరంగము.

బ్రహ్మాండమున – విశ్వజగత్తే నాట్యవేదిక.

(1) ఒకే వేదికయందు సమగతులలో స్వర తాళ లయ విన్యాసములతో లాస్య తాండవములు చేయుట అధిష్ఠాన సామ్యము.

(2) శేషి శేషభావము ఉభయసాధారణము. సృష్టినిర్మాణ క్రియానిమగ్నత్వము అనుష్ఠానసామ్యము.

(3) లాస్య తాండవ సంజనిత శబ్దములయందు ప్రతిపాదించబడిన నృత్యము ఏకత్వమును సూచించుచున్నది. ఇది అవస్థాన సామ్యము.

( 4, 5. ) నవాత్మకత్వము – రూపసామ్యము, నామ సామ్యము రెండును అగుచున్నది.

శివుడు నవాత్ముడు. పరాశక్తి నవాత్మిక. ఉభయులకు అధిష్ఠానమైన శ్రీచక్రముకూడ నవాత్మకమే.

శివుని నవవ్యూహములు:– కాల, కుల, నామ, జ్ఞాన, చిత్త, నాద, బిందు, కలా, జీవ అనునవి.

శక్తివ్యూహములు:– వామా, జ్యేష్ఠా, రౌద్రీ, అంబికా, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, శాంతి, పరా అనునవి.

శివుని నవవ్యూహములు:—

1. కాలవ్యూహము:– నిమేషాది కల్పాంత పరిచ్ఛేదము గలది. సూర్యచంద్రులకును కాలావచ్ఛేదకత్వ ముండుటచే కాల వ్యూహమునం దంతర్భూతము.
2. కులవ్యూహము:– నీలశ్వేతాది వర్ణవ్యూహము.
3. నామవ్యూహము:– ఘటపటాది సంజ్ఞాస్కంధము.
4. జ్ఞానవ్యూహము:– విజ్ఞానస్కంధము. దీనికే భాగవ్యూహ మందురు. ఇది రెండువిధములు. సభాగము, విభాగము అని. సభాగము వికల్పము. విభాగము నిర్వికల్పము.
5. చిత్తవ్యూహము:– అహంకార, చిత్త బుద్ధి మహన్మనస్సులు.
6. నాదవ్యూహము:– పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపములు.
7. బిందువ్యూహము:– మూలాధారాది షట్చక్రసముదాయము.



8. కలావ్యూహము:– అకారాది క్షకారాంతమైన పంచాశద్వర్ణ సంఘరూపము.
9. జీవవ్యూహము:– జీవాత్మసముదాయము. ఇదియే భోక్తృస్కంధము అనియు పిలువబడుచున్నది.

పరాశక్తియొక్క ‘నవాత్మ’కత్వము:—

1. వామాశక్తి:– ప్రళయసమయమున సమస్తజీవకోటిని అణురూపమున తనయందు ఇముడ్చుకొని పునస్సృష్టియందు వమనముచేయు (అనగా వెడలుగ్రక్కు సామర్థ్యము) శక్తియుత విశ్వజనయిత్రి.
2. జ్యేష్ఠాశక్తి:– సర్వశుభప్రదాయిని. కల్యాణశైలనిలయ.
3. రౌద్రీశక్తి:– సర్వరోగవిద్రావణి. భక్తాభీష్టఫలప్రదాయిని.
4. అంబికాశక్తి:– సర్వకళా ప్రపూర్ణమైన కరుణాస్వరూపిణి. శివుని కరుణావతారము. అరుణ.
5. ఇచ్ఛాశక్తి
6. జ్ఞానశక్తి
7. క్రియాశక్తి

(5–7) శబ్దబ్రహ్మాత్మక జగత్తులో పశ్యంతీ మధ్యమా వైఖరీ అభిధేయలు. శివునియందు జగత్సర్జన కాముకత్వమును వికసింపజేయు కామేశ్వరి విమర్శశక్తి.

8. శాంతిశక్తి:– నిరంశమైన చిద్రూపము.
9. పరాశక్తి:– సర్వోత్కృష్ట. సర్వేశ్వరి. మూలప్రకృతి.

శివ, శక్తి వ్యూహములకు అధిష్ఠాతృదైవతము శివుడు; అగుటవలన “నవాత్ముడు” అనబడుచున్నాడు. నవరస యుక్త తాండవమును “మహాతాండవ” మందురు. అందాసక్తికలవాడు

శివుడు; నవరసములకు అధిష్ఠాతృదైవతము శివుడు; కనుక "నవాత్ముడు" అనబడుచున్నాడు.

శ్రీచక్రము గూడ రూపసామ్యమునే ప్రతిపాదించుచున్నది. అందలి అధోముఖశీర్షికలు నాలుగు శివాత్మకములు. ఊర్ధ్వముఖ పంచశీర్షికలు శక్త్యాత్మకములు. వెరశి నవశీర్షికలు నవవ్యూహములు అనబడును. ఇదె ప్రపంచనిర్మాణ కారణాత్మకము లగుట "యోనులు" అని పిలువబడినవి.

శ్రీచక్రమందలి శివ శక్త్యాత్మక నవవ్యూహములకును అధిష్ఠాతృదైవతము శివుడే. కనుక నవాత్ముడు అని పిలువబడుచున్నాడు.

కాలమతానుసారము శివునిశక్తి పరాశక్తియందు అంతర్లీనమైనందున శక్తికి ప్రాధాన్యత ఎక్కువ.

శ్రీమచ్ఛంకర భగవత్పాదులవారు ఈ విషయమును ఇటుల వర్ణించినారు.

శ్లో॥ త్వయా హృత్వా వామం వపుర పరితృప్తేన మనసా
శరీరార్థం శంభో రపరమపి శంకే హృత మభూత్।
యదేత త్త్వద్రూపం సకల మరుణాభం త్రిణయనం
కుచాభ్యా మానమ్రం కుటిల శశిచూడాలమకుటమ్॥

— సౌందర్యలహరి.

"అరుణిమయొప్పి ముక్కనులదై చనుబర్వున వంగినట్టిదై
యర నెలతోడి మౌళిగలదై యలరారెడి నీదురూప మే



నరసి, తలంతు డాపలిహారార్థము లోగొని తన్వితీఱ కా
యెరవు సగంబుసైతము హరించితివో, యని శంభుకామినీ"

— శ్రీ శ్రీయానందనాథగురుజీ.

ఎఱ్ఱని రంగు, ముక్కనులు, నెలవంకతోడి కిరీటము, చనుబ్రేగునన్నైన వంగుగలదై యొప్పు నీ రూపము చూడగా – శివుని యెడమభాగమును హరించియు తనివితీఱక తక్కు సగమును లోగొంటివను శంక కలుగుచున్నది.

ఇందు, శివతత్త్వము – శాక్తతత్త్వమునందు లీనమైపోవును గాన శక్తితత్త్వముకంటె వేఱుగా శివతత్త్వము లేదనియు, అదే ఉపాస్యమనియు నిరూపితమగుచున్నది.

కనుక నవవ్యూహములకు అధిష్ఠాతృదైవతము పరాశక్తి కనుక "నవాత్మిక". పరస్పరసహప్రాధాన్యతవలన సమయత్వము కూడ ఉభయసాధారణమే.

ప్రకృతి పురుషులు ఉభయులు సమాన ధర్మములు, బాధ్యతలు గలిగియున్నారు. విడదీయరానిది వారి బాంధవ్యము. ఒకరిని విడిచిన వేఱొకరికి జడత్వమే కలుగును. చైతన్యము అడగిపోవును. నిర్వీర్యత ఏర్పడును. అస్తిత్వప్రయోజనమే శూన్యమగును.

ఆ పురాణదంపతుల లీలావిభూతి సృష్టి. చక్షుర్గోచరమగునదంతయు శక్తిస్వరూపము. తదభిన్నమగు అవ్యక్తము శివస్వరూపము. వ్యక్తావ్యక్త జగత్తునకు అధిష్ఠాతృదైవతము పరశివుడు. అతడే అక్షరబ్రహ్మము. అతడే 'ఊర్ధ్వమూల' పద వాచ్యుడు, నవాత్ముడు.

నవాత్మల నిరంతర లాస్య తాండవప్రవృత్తియే సృష్టి స్థితి హేతువు. తద్విరామమే అనగా లాస్యనృత్తావసానమే జగత్సంహృతి. మహాప్రళయము. విశ్వవివర్తన హేతువు. (వివర్తనము అనగా ఒకవస్తువు మరియొకవస్తువుగా ఉండుట.)

## ప్రపంచోత్పత్తి క్రమము.

శ్రు॥ తస్మాద్విరాడజాయత విరాజో అధిపూరుషః ।
సజాతో అత్యరిచ్యత పశ్చాద్భూమి మధో పురః॥
— పురుషసూక్తము

తస్మాత్ అనగా ఆకాశాది పంచభూతములకు ఉత్పత్తి హేతువు అయిన పరమాత్మనుండి "విరాడజాయత" ప్రకృతి కలిగెను. "విరాజో అధిపూరుషః" పరమాత్మయొక్క చైతన్యము ప్రకృతియందు ప్రతిబింబించగా తత్ప్రతిబింబమే జీవత్వము నొంది "విరాట్ పురుషుడు" అనబడెను. ఇతడే ప్రథమజీవుడు. బ్రహ్మ, పితామహుడు, ధాత ఇత్యాది నామములచేత పిలువబడుచున్నాడు. "సజాతో అత్యరిచ్యత" దేవ మనుష్య తిర్యగాది విభిన్నరూప సమన్వితమైన స్థూలప్రపంచోత్పత్తి బ్రహ్మవలన గలిగినది. "పశ్చాద్భూమిః" తదుపరి జీవకోటి నివసించుటకు ఆధారమగు భూమి సృజింపబడెను. అటుపిమ్మట "అధో" ప్రళయావసరమున భౌతికోపాధులు నశించి సూక్ష్మరూపమున నుండిన జీవకోటికి తత్తత్కర్మ ఫలభోగానుభవార్థము "పురః" స్థూలశరీరములను కల్పించెను. ప్రపంచోత్పత్తిక్రమ మిట్టిది.

బ్రహ్మజ్ఞానవరిష్ఠుడు శ్రీయాజ్ఞవల్క్యమహర్షి. సూర్యభగవానుని ఆరాధించి ఉపాసించి మరుగుపడిన శుక్లయజుర్వేదమును భూమి కవతరింపజేసిన తపోనిష్ఠాగరిష్ఠుడు. పరమశివాంశసంభూతుడు. శాపానుగ్రహసమర్థుడు.



ద్వాదశవర్షములు శుశ్రూషచేసి తనను అర్థించిన 'పైంగలుడు' అను శిష్యునకు ఉపదేశించిన ప్రపంచోత్పత్తి క్రమము "పైంగలోపనిషత్తు" అను పేర బరగుచున్నది. ఇది శుక్లయజుర్వేదాంతర్గతము. అందలి ఒకభాగము ఇట గ్రహింపబడుచున్నది.

శ్రు॥ తత్ప్రతిబింబితం యత్ తత్ సాక్షిచైతన్య మాసీత్ । సా పునర్వికృతిం ప్రాప్య సత్వోద్రిక్తే వ్యఖ్యాఽఖ్యా ఆవరణ శక్తిః ఆసీత్॥ తత్ప్రతిబింబితం యత్ తత్ ఈశ్వర చైతన్యం ఆసీత్ । సః స్వాధీనమాయః సర్వజ్ఞ స్థితి లయానాం ఆదికర్తా॥
— పైంగలోపనిషత్తు.

ముఖము అద్దమునందువలె, సత్యజ్ఞానానందమయుడైన పరమాత్మనుండి ప్రతిబింబితమైన శుద్ధచైతన్యము "సాక్షి" (ప్రకృతి) యనబడినది.

ఆ సాక్షిచైతన్యమే వికృతినొంది 'వ్యఖ్య' అను పేర బరగు ఆవరణశక్తి అయ్యెను. ఈ ఆవరణశక్తియందు ప్రతిబింబించిన చైతన్యము 'ఈశ్వరుడు' అని పురుషనామమున పిలువబడినాడు. ఈశ్వరుడు మాయాఽతీతుడు. అనగా మాయను లోబరచుకొనినవాడు. రజస్సు తమస్సు అను ద్విగుణములకు అతీతుడు. జగదతిరిక్తుడు. సర్వజ్ఞుడు. భూత భవిష్య ద్వర్తమానములను తెలిసినవాడు. సృష్టి స్థితి లయము

లకు మూలపురుషుడు. ఇంతియే గాదతని సామర్థ్యము (మహిమ) —

శ్రు॥ జగదంకుర రూపో భవతి। తస్మిన్ విలీనం సకలం జగదావిర్భవతి ప్రాణికర్మవశాదేషపటో యద్వత్ ప్రసారితః ప్రాణి కర్మక్షయాత్ పునః స్థిరోభావయాతి తస్మిన్ ఏవ అఖిలం విశ్వం సంకోచిత వటవత్ వర్తతే॥ — పైంగలోపనిషత్తు.

అతనియందు ప్రళయావసరమున విలీనమైన సూక్ష్మ శరీరప్రపంచము అంకురరూపమున వెలువడుచున్నది. వానివాని కర్మానుగుణమైనఫలమును అనుభవించినవెంటనే, సంచితకర్మ క్షయమైనంతనే – తిరుగ అందే – అతనియందే విలీనమగుచున్నది. అతడు జగన్నాటకసూత్రధారి. ప్రవేశ నిష్క్రమణములు అతని లీలావిభూతి.

(1) ముఖము వేఱు; అద్దము వేఱు; కనుక అద్దమునందు ముఖమువలె ప్రతిబింబము తోచును. "అసద్వా ఇదమగ్ర ఆసీత్। తతోవై సదజాయత" అను శ్రుత్యనుసారము 'సదసత్తులు' అనగా పరమాత్మ, మాయ అభిన్నములు. కనుక మాయయందు ఆత్మ ప్రతిబింబించుట అసంభవము. ఈశ్వరుడు 'మాయ' (ప్రకృతి) యందలి ప్రతిబింబము అని ఎటుల చెప్పనగును?

ఆకాశము సర్వవ్యాపకము. పాత్రలోని జలము పాత్రకును, జలమునకును ఏకత్వమును ఏర్పరచుచున్నది. సర్వవ్యాపకముగా నుండు ఆకాశము – జలమునందు ఆకాశమువలె తన ప్రతిబింబమును తోచునటుల జేయుచున్నది. అటులనే



అభిన్నముగానుండు 'మాయ' (ప్రకృతి) యందు 'ఆత్మ' తన ఇచ్ఛాశక్తిచే ఒక ప్రతిబింబమువలె తోచినది. అదియే ఆ ప్రతిబింబమే "ఈశ్వరుడు" అనబడినది.

(2) చంద్రునకు, అద్దమునకు ప్రత్యేకమైన విశిష్టమైన రూపములు ఉన్నవి. కనుక అద్దమునందు చంద్రునిరూపమును చూడగలుగుచున్నాము. ఆత్మకు రూపము లేదు, నామము లేదు. 'ఆత్మ' 'బ్రహ్మము' అనునవి కేవలము సంకేతములే. కనుక రూపమేలేని పరమాత్మ ప్రతిబింబించుట అసంభవము గాదా?

ఆకాశమునకు రూపములేదు. కాని జలమునందు ఆకాశముయొక్క ప్రతిబింబమును చూచుచున్నాము. అటులనే మాయయందు పరమాత్మ ప్రతిబింబించుట సంభవమే.

(3) పృథివికి (మృత్తిక) రూపము గలదు. సువర్ణమునకు రూపము గలదు. అవి ఉపాధివశమున ఘటాకారమును, మకుటాకారమును ఆదిగాగల పలువిధరూపములు, నామములు పొందుచున్నవి. పరమాత్మకు నామరూపములు లేవు గదా? మరి యీ నామరూపాత్మక జగత్తు పరమాత్మవలన ఎటుల ఏర్పడినది?

మృత్తిక లేనిదే ఘటము ఇతరపాత్రలు ఏర్పడుటలేదు. సువర్ణము లేనిదే, కటక మకుటాది ఆభరణములు ఏర్పడుట లేదు. సత్తామాత్రమగు ఆత్మలేనిదే నామరూపాత్మకమగు జగత్తు లేదు. రూపమేలేని ఆకాశమునందు మేఘములు ఆవృతమై విభిన్నరూపములుగా కన్పింపజేయుచున్నవి. అటులనే

రూపరహితమైన (బ్రహ్మము) పరమాత్మ త్రిగుణాత్మికయగు మాయచేత ఆవరింపబడి పలువిధములైన నామరూపాత్మక ప్రపంచముగా కనబడుచున్నది.

శ్రు॥ ఈశాధిష్ఠితావరణ శక్తిః రజోద్రిక్తా మహదాఖ్యా విక్షేపశక్తి రాసీత్॥ తత్ ప్రతిబింబితం యత్ తత్ హిరణ్యగర్భ చైతన్యమాసీత్ । సః మహత్తత్త్వాభిమానీ స్పష్టాऽస్పష్టవపు ర్భవతి॥

— పైంగలోపనిషత్తు.

అవ్యక్తమగు పరమాత్మ చైతన్యము. సత్వోద్రిక్తయై "వ్యఖ్య" వ్యక్తము అను ఆవరణశక్తియైనది; రజోద్రిక్తయై "మహత్తు" అను విక్షేపశక్తియైనది, మహదాఖ్య విక్షేపశక్తి యందు ప్రతిబింబించిన 'ఈశ్వర' చైతన్యము "హిరణ్యగర్భుడు" అని పిలువబడినది. ఇతడు దృశ్యాదృశ్యరూపముగలిగియున్నాడు.

శ్రు॥ హిరణ్యగర్భాధిష్ఠిత విక్షేపశక్తిః తమోద్రిక్తా అహంకారాభిధా స్థూలశక్తి రాసీత్॥ తత్ప్రతిబింబితం యత్ తత్ విరాట్చైతన్య మాసీత్ । స తదభిమానీ స్పష్టవపు స్సర్వ స్థూల పాలకో విష్ణుః ప్రధానపురుషః అభవత్॥ — పైంగలోపనిషత్తు.

తమోద్రిక్తమగు పరమాత్మచైతన్యము 'అహంకారము' అను పేరుగల "స్థూలశక్తి" అయ్యెను. అహంకారాఖ్య స్థూల శక్తియందు హిరణ్యగర్భచైతన్యము ప్రతిబింబితమై "విరాట్ చైతన్యము" కలిగెను.

"తస్మాద్విరాడజాయత" — పురుషసూక్తము.

ఆ విరాట్ చైతన్యమే "విష్ణువు" అనబడుచున్నాడు. ఇతడే స్థూలజగత్పాలకుడు. ప్రధానపురుషుడు.



సారాంశము:— అక్షరపురుషుడు సనాతనుడు. "బహుస్యాం" "ప్రజాయేయ" అను అతని ఇచ్ఛాశక్తినుండి క్రియారూపిణి – త్రిగుణాత్మిక – మూలప్రకృతి గలిగినది. ఈ మూల ప్రకృతియే అవ్యక్తము అనియు పిలువబడుచున్నది.

త్రిగుణాత్మకము అవ్యక్తము. అది యొక దర్పణము వంటిది. అవ్యక్తము సత్వోద్రిక్తము కాగా అందు ప్రతిబింబించిన ఆత్మచైతన్యము "ఈశ్వరుడు" అనబడినాడు. రజస్తమోద్రిక్తతలయందు ప్రతిబింబించిన చైతన్యము హిరణ్యగర్భుడు, విష్ణువు అని వరుసక్రమమున పిలువబడినారు. త్రిగుణాత్మికప్రకృతి సంపర్కమున వీరు ముగ్వురును అనగా ఈశ్వర, హిరణ్యగర్భ, విష్ణువులు ప్రాకృతులు అనబడుచున్నారు.

ప్రకృతి మాత. అనగా శ్రీదేవి. వీరికి సృష్టి – పాలన – సంహార శక్తులను ప్రసాదించినది. ఈ శక్తుల ప్రాబల్యమునకు గుణత్రయమే మూలము. ఆధారము.

ఈ విషయమే శ్రీమచ్ఛంకర భగవత్పాదులు తమ సౌందర్య లహరిలో నిటుల వర్ణించిరి.

శ్లో॥ తనీయాంసం పాంసుం తవచరణ పంకేరుహభవం
విరించిః సంచిన్వన్ విరచయతి లోకానవికలం,
వహత్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసాం
హరః సంక్షుద్యైనం భజతి భసితోద్ధూళనవిధిమ్॥

— సౌందర్యలహరి.

మ. భవదీయాంఘ్రిసరోజధూళిలవమే భాండమ్ముగా బ్రహ్మ యీ
భువనమ్ముల్ కొఱలేక చేయు నదియే మోచున్ రమానాథుడున్

విపులం గష్టముతోడ వేయితలలన్ మేదించి రుద్రుండు భ
స్మవిలేపక్రియ దానవే చలుపునమ్మా సర్వశక్తిప్రదా !
— శ్రీ శ్రియానందనాథగురుజీ.

అమ్మా ! నీ పాదధూళియందలి యణువునే సాధనముగా గొని బ్రహ్మ సచరాచర సకలలోకసృష్టి చేయును. దానినే సహస్రశీర్షుడైన హరి యనంతరూపమున అతికష్టముతో మోచును. ఆ దానినే హరుడు చక్కగా మేదించి దానితోనే భస్మస్నానము చేయును.

అట్లగా ప్రకృతిమాత శ్రీదేవియే అజ హరులకు సృష్టి పాలన సంహారశక్తులను ప్రసాదించుచున్నది. మహామాయాత్మకములైన సత్త్వ రజ స్తమములే ఈ శక్తులకు ఆధారములు.

## సాంఖ్యసూత్రములు - భూతపంచీకరణము

శ్రు॥ సాంఖ్యం దేహ విచారం చ॥

దేహము ఎటుల ఏర్పడినది ? దేహియొక్క తత్త్వము ఎట్టిది ? వీని వివరములను తెలుపునదియే "సాంఖ్యము" అనబడును.

(1) దీనిని తెలిసికొనవలసిన ఆవశ్యకత ఏమి ?

సృష్టి నిర్మాణము ఎటులజరిగినది ? తత్త్వములు అనగా నేమి ? అవి ఎన్ని ? స్థూల-సూక్ష్మ కారణములు అను శరీర త్రయముయొక్క ఉత్పత్తిక్రమమెట్టిది? జీవాత్మ పరమాత్మలకు గల భేదము ఏమి? త్రిగుణముల ప్రభావము ఆత్మయందు ఎట్టి పరివర్తనము కలుగజేయుచున్నది? జీవునకు పాశములు ఎటుల



ఏర్పడినవి? వానినుండి బంధవిముక్తినొందు మార్గము ఎట్టిది? అను విషయములు సాంఖ్యవిచారణవలననే విశదములు అగుచున్నవి. ఇట్టి వివరములు తెలిసికొనుటయే "ఆత్మజ్ఞానము" అనబడును. "ఆత్మజ్ఞానము" కలుగనిచో ముక్తి లభింపదు. కనుక సాంఖ్యసూత్రములు తెలిసికొనుట ముముక్షువులకు అత్యంతావశ్యకము.

(2) భూతపంచీకరణము అనగా నేమి ?

పృథి వ్యప్తేజో వాయురాకాశములు పంచభూతములు. ఇవి సూక్ష్మములు, స్థూలములు అని ద్వేధా విభక్తమై సమష్టి వ్యష్టి నామములతో వ్యవహరింపబడుచున్నవి. ఇందు ఒక్కొక్క భూతమును ఐదుభాగములుగా నగుచు ఐదు తత్త్వములుగా నేర్పడుట "భూతపంచీకరణము" అనబడును. ఆత్మజ్ఞానము బడయగోరు సాధకునకు భూతపంచీకరణ వివరములు తెలిసికొనుటయు అత్యంతావశ్యకమే యగుచున్నది.

శ్రు॥ ఓం. తస్మా దాత్మన ఆకాశ స్సంభూతః । ఆకాశా ద్వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ తాని పంచతన్మాత్రాణి గుణాభవంతి॥ —పైంగలోపనిషత్తు.

ఆకాశాది కర్మజ్ఞానాధికారియగు పురుషాంతమగు సృష్టిక్రమము అవరోహణక్రమములో ఇందు ఈ మంత్రమునందు ప్రతిపాదింపబడుచున్నది.

తస్మాత్ = అనగా స్థూల జగత్పరిపాలకుడు, ప్రధాన పురుషుడు. హిరణ్యగర్భాధిష్ఠిత విక్షేపశక్తియొక్క ప్రతిరూపమైన విరాట్చైతన్యమునుండి విష్ణు నామాంకితమైన 'ఆత్మ'

వలన ఆకాశము; శబ్దగుణాత్మకమును మూర్తద్రవ్యములకు అవకాశము నొసంగునదియు నగు ఆకాశము జనించెను. ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నివలన జలము, జలమునుండి పృథివియు గలిగెను. బ్రహ్మస్వరూపాత్మకములు ఐన ఈ ఐదు భూతములును సూక్ష్మములు.

శ్రు॥ యత్కఠినం - సా పృథ్వీ, యత్ ద్రవం - తదాపో, యదుష్ణం - తత్తేజో, యత్ సంచరతి - తద్వాయుః, యత్ సుషిరం - తదాకాశమ్॥ ఇవి తత్త్వపంచక మనబడును.

శ్రు॥ శబ్ద స్పర్శ రూప రస గంధాః - పృథివీగుణాః ।
శబ్ద స్పర్శ రూపాణి - అగ్నిగుణాః ।
శబ్ద స్పర్శ రూప రసాః - జలగుణాః ।
శబ్ద స్పర్శాన్ - ఇతి వాయుగుణాః ।
శబ్ద ఏక - ఆకాశస్య ॥ — శారీరకోపనిషత్తు.

1. పృథివి:— కఠినముగా నుండును. శబ్ద స్పర్శ రూప రస గంధములు తద్గుణములు.
2. జలము:— ద్రవముగా నుండును. శబ్ద స్పర్శ రూప రసములు జలగుణములు.
3. అగ్ని:— ఉష్ణముగా నుండును. శబ్ద స్పర్శ రూపములు అగ్నిగుణములు.
4. వాయువు:— చలించుచుండును. శబ్ద స్పర్శములు వాయుగుణములు.



5. ఆకాశము:— రంధ్రముగా నుండును. అనగా ఎక్కడెక్కడ రంధ్రములు ( సుషిరములు ) ఉండునో, ఆ రంధ్రము లన్నియు ఆకాశ మనబడును. శబ్దము ఒక్కటియే ఆకాశగుణము.

(1) ఆకాశమునందలి ప్రత్యేకత ఏమి? తక్కిన నాలుగు భూతములు దానినుండియే ఉత్పత్తియైనటుల ఎందుకు చెప్పవలయును? మిగిలిన యేయొక్క భూతమునుండియైన ఉత్పత్తియై ఉండగూడదా ?

వేపవిత్తనము చేదుగానుండును. ఆ విత్తనము యొక్క సారము వృక్షముయొక్క ప్రత్యంగమునందును వ్యాపించి రెమ్మనుండి కొమ్మవరకు అంతయు చేదుగానే చేయుచున్నది. శబ్దము ఆకాశముయొక్క తన్మాత్ర. ఈ శబ్దము వేపచెట్టునందలి చేదువలె తక్కిన (మిగిలిన) నాలుగు భూతములయందును, అంతర్భూతమై వ్యాపించియున్నది. కనుక పృథివ్యప్తేజో వాయువులు ఆకాశమునుండియే ఉత్పన్నమైనవి.

'ఖం' బ్రహ్మేతి వ్యజానాత్॥ అను శ్రుత్యనుసారము ఆకాశము బ్రహ్మముయొక్క (పరమాత్మయొక్క) నామాంతరము. తదంశములైన భూతములు ఐదును "బ్రహ్మాత్మకములు" అని చెప్పబడినవి.

శ్రు॥ స్రష్టుకామో జగద్యోనిః తమోగుణ మధిష్ఠాయ సూక్ష్మ తన్మాత్రాణి భూతాని, స్థూలీకర్తుం సోఽకామయత॥ సృష్టేః పరిమితాని భూతాని ఏకమేకం, ద్విధా విధాయ, తయోః

ఏకం పునః చతుర్ధాకృత్వా స్వస్వేతర ద్వితీయాంశైః పంచ పంచధా సంయోజ్య, పంచీకృతభూతైః అనంతకోటి బ్రహ్మాండాని తత్తత్ అండోచిత చతుర్దశభువనాని, తత్తత్ భువనోచిత గోళక స్థూలశరీరాణి అసృజత్॥ — పైంగలోపనిషత్తు.

సృష్టినిర్మాణముచేయ సంకల్పించిన పరమాత్మ సూక్ష్మ పంచభూతములను స్థూలముగా జేయగోరెను. వానిని ఈ దిగువ నుదహరించిన విధముగా విభజించెను.

ఆదియందు పంచభూతములు త్రిగుణాత్మకములై సూక్ష్మములై యుండెను. కనుక అవి (1) సత్త్వ సూక్ష్మములు (2) రజస్సూక్ష్మములు (3) తమోసూక్ష్మములు అని మూడు వర్గములుగా విభజింపబడినవి. మరల నవి సమష్టి వ్యష్టి యని రెండుభాగములుగా జేయబడినవి.

సమష్టి యనగా అఖండమైనది, విభజింపబడనిది. వ్యష్టి యనగా ఖండఖండములుగా నాలుగుభాగములుగా జేయబడినది. ఇటుల సమష్టి వ్యష్టి భాగములుగా విభజింపబడిన పంచభూతములయందు ఒకభూతమునందు వేఱొకదాని యంశము జేరుటవలన పంచవింశతితత్త్వములు గలిగెను. ఇటుల సంస్కరింపబడిన పంచీకృతభూతములచేత అనంతకోటి బ్రహ్మాండములును, చతుర్దశభువనములును, ఆయా భువనములకు ఉచితమైన యోగ్యమైన స్థూలశరీరములును కల్పింపబడినవి.

ఇటుల చెప్పిన అర్థమగుటలేదు. సూక్ష్మశరీరము ఎటుల ఏర్పడినది ? దాని తత్త్వములు ఎన్ని? స్థూలశరీరమునకును,



సూక్ష్మశరీరమునకును గల సంబంధము ఎట్టిది ? అంతరము ఏమి ? చతుర్దశభువనములు, అందలి జీవకోటియొక్క విభిన్న రూపములు, వీని ఆంతర్యము ఎట్టిది ? సవివరముగా తెలిసికొనగోరుచున్నాను.

## సూక్ష్మశరీరము

సూక్ష్మశరీరమునకే లింగశరీరము అని నామాంతరము గలదు. దీని వివరములు ఈ దిగువ నుదహరింపబడుచున్నవి.

సత్త్వగుణప్రధానములైన సూక్ష్మపంచభూతములు – సమష్టి వ్యష్టి యని ద్విధా విభజింపబడినవి. ఇందు సత్త్వ సమష్టి భూతపంచకము (1) మనస్సు, (2) బుద్ధి అను రెండు తత్త్వములు ఐనది. మనస్సు, బుద్ధి ఇవి రెండునుచేరి సమష్టిగా 'జ్ఞాత' లేక 'జ్ఞానము' అని పిలువబడినవి. అంతరింద్రియములు అనబడునవి మనస్సు, బుద్ధి యనబడు నీ రెండు తత్త్వములే. అంతఃకరణము అనియు ఇయ్యదియే పిలువబడుచున్నది.

అంతఃకరణము బాహ్యసంచారము చేయుటవలన అనగా స్థూలప్రపంచ విషయములను గ్రహించుచు వానివిషయమై తలంచుచు చంచలమై స్థిరత్వము లేక యుండుటచేత "మనస్సు" అనబడుచున్నది. అంతస్సంచారము చేయుటవలన ''బుద్ధి'' యనబడినది.

సత్వవ్యష్టి సూక్ష్మపంచకమువలన ఐదు జ్ఞానేంద్రియములు గలిగినవి. ఇంద్రియములు సత్త్వగుణప్రధానములగుట జ్ఞానేంద్రియములు అనబడినవి.

వివరములు:—

సత్వవ్యష్టి సూక్ష్మ ఆకాశమువలన – చెవి ఏర్పడినది.
,, వాయువువలన – చర్మము కలిగినది.
,, అగ్నివలన – కన్ను ఏర్పడినది.
,, జలమువలన – నాలుక ఏర్పడినది.
,, పృథివివలన – ముక్కు కలిగినది.

ఇవియే త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములు అనబడినవి. అంతరింద్రియములు రెండును ఈ ఐదింటిలో చేర్చబడి మొత్తము జ్ఞానేంద్రియసప్తకము అనబడి సూక్ష్మశరీరమునందు ప్రాధాన్యత వహించుచున్నవి.

సూక్ష్మ కర్మేంద్రియములు:— రజోగుణ ప్రధానములైన సూక్ష్మపంచకము (1) సమష్టి (2) వ్యష్టి యను రెండు భాగము లయ్యెను. అందు 'రజస్సూక్ష్మ సమష్టి' 'ప్రాణము' అనబడినది.

(1) అపానము (2) వ్యానము (3) ఉదానము (4) సమానము అను నాలుగును తదంగములు.

'రజోవ్యష్టి సూక్ష్మములు' వాగాది కర్మేంద్రియములు ఐనవి.

వివరములు ఈ దిగువ నుదహరింపబడుచున్నవి:



రజోవ్యష్టి సూక్ష్మ ఆకాశమువలన – మాట (వాక్కు) కలిగినది.
,, వాయువు – చేయి (పాణి)
,, అగ్ని – కాలు (పాదము)
,, జలము – గుహ్యము (మర్మస్థానము)
,, పృథివి – గుదము (మలవిసర్జనస్థలము)

మాట చేయి కాలు గుహ్యము గుదము అనునవియే వాక్పాణి పాద పాయూపస్థలు అను నామములచే వ్యవహరింపబడుచున్నవి.

ప్రాణాది పంచకము, వాగాది పంచకము వెరశి పదియు కర్మేంద్రియములు అనబడుచున్నవి.

కర్మేంద్రియ దశకము, జ్ఞానేంద్రియ సప్తకము వెరశి సప్తదశేంద్రియములు చేరి సప్తదశేంద్రియాత్మకమగు సూక్ష్మ శరీరము అగుచున్నది.

సూక్ష్మశరీరము చక్షుర్గోచరముగాదు. కేవల మిది భోగ సాధనము మాత్రమే. శరీరమునకు కంచుకము (చొక్కా) వలె, బియ్యపుగింజపైన పొల్లువల్లె, చింతపండుపై బెరడువలె సూక్ష్మశరీరమునకు స్థూలశరీరము ఆవరణమై యున్నది.

ఆవరణము నశించును. కర్మఫలానుభవము తీరిన వెంటనే స్థూలశరీరము పతనమగును. పంచభూతములతో లీనమగును. కాని సూక్ష్మశరీరము ఎట్టి మార్పును జెందదు.

పరిణామపేశలము స్థూలశరీరము. కేవల జడస్వరూపము. సూక్ష్మశరీరమే దీనియం దంతర్గర్భితమై చలనధర్మమును కలిగించుచున్నది.

సూక్ష్మశరీర వివరణచక్రము (లింగశరీరము)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అపంచీకృత పంచభూతములు | ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి | సత్వ రజ సూక్ష్మ భూతములు |
| సత్వసమష్టి పంచభూతములు | మనస్సు | | | బుద్ధి | | అంతరింద్రియములు |
| రజస్సమష్టి పంచభూతములు | సమానము | వ్యానము | ఉదానము | ప్రాణము | అపానము | పంచప్రాణములు |
| సత్వవ్యష్టి పంచభూతములు | శ్రోత్రము | త్వక్కు | నేత్రము | జిహ్వ | ఘ్రాణము | జ్ఞానేంద్రియములు |
| రజోవ్యష్టి పంచభూతములు | వాక్కు | పాణి | పాదము | గుహ్యము | గుదము | కర్మేంద్రియములు |



| తత్త్వములు | ఇంద్రియములు | సంఖ్య |
|---|---|---|
| సత్వ సమష్టినుండి అంతరింద్రియములు | మనస్సు, బుద్ధి. | 2 |
| ఆకాశతత్త్వము : | సమానవాయువు, శ్రోత్రము, త్వక్కు. | 3 |
| వాయుతత్త్వము : | వ్యానము, త్వక్కు, పాణి. | 3 |
| అగ్నితత్త్వము : | ఉదానము, నేత్రము, పాదము. | 3 |
| జలతత్త్వము : | ప్రాణము, జిహ్వ, గుహ్యము. | 3 |
| పృథివీతత్త్వము : | అపానము, ఘ్రాణము, గుదము. | 3 |
| | వెరశి యింద్రియములు | 17 |

## స్థూ ల శ రీ ర ము.

పరమాత్మ తమోగుణముతో గూడిన సూక్ష్మపంచభూతములను స్థూలపంచభూతములుగా పరిణతి నొందించి మరల వానిని సమష్టిభాగములు చేసి, మొదటిభాగముతో అనగా సమష్టి తమోస్థూలభూతములతో అనంతకోటి బ్రహ్మాండములను, చతుర్దశభువనములను నిర్మించెను. రెండవభాగమైన వ్యష్టి స్థూల పంచభూతములతో స్థూలశరీరముల సృజించెను.

స్థూలశరీరము పంచవింశతితత్త్వ సంకలితము. తమోవ్యష్టి పంచభూతములు ఒక్కొక్కటియు నాలుగుభాగములు అగుచు ఒక్కొకటి సమష్టిభూతములయందు జేరుటవలన స్థూలశరీరము ఏర్పడినది. ఇది నశించునది. నియమితకాలము వరకే స్వస్థతతోనుండి కర్మఫలము తీరినవెంటనే జీర్ణమై శీర్ణమై శిథిలమై పతనమగును.

పూర్వకర్మానుసారముగా తిరుగ ఈ లోకమున పితరుల శుక్లశోణితముల సంయోగముచేత నేర్పడి పాంచభౌతికమైన మాత్రాహారరసముచే పోషింపబడుచు నవమాసములు నిండిన తదుపరి అవని కవతరించి సుఖదుఃఖముల ననుభవించుచుండును.

## పంచప్రాణములు - స్థూలశరీరము.

1. వ్యానము:- తమోసమష్టివాయువు "వ్యానము" అని పిలువబడినది. విశ్వగ్గమనము గలిగి శరీరమునందంతటను నఖశిఖపర్యంతము వ్యాపించునది "వ్యానము". బలుపు లక్షణముగా గల "కృకరము" దీనికి ఉపప్రాణము. వ్యానమునకు అధిదేవత విశ్వయోని.

2. తమోవ్యష్టివాయువు నాలుగు భాగము లయ్యెను. అందలి
   మొదటిభాగము + ఆకాశతత్త్వము = సమానము;
   రెండవ భాగము + అగ్నితత్త్వము = ఉదానము;
   మూడవభాగము + జలతత్త్వము = ప్రాణము;
   నాలవభాగము + పృథివీతత్త్వము = అపానము;
   అని పిలువబడినవి.

   శరీర మధ్యమందు (అనగా నాభిస్థానమునందు) ఉండి అన్నపానముల రక్తముగా పరిణమింపజేయునది "సమానవాయువు" అనబడినది. దీనికి ఆకలియే లక్షణముగాగల "నాగము" ఉపప్రాణము. అధిదేవత "జయుడు".

3. ఊర్ధ్వగమనము గలిగి కంఠమందు వర్తించి ఉత్క్రమించునది "ఉదానవాయువు". త్రేపులు లక్షణముగాగల "ధనంజయము" దీనికి ఉపప్రాణము. అధిదేవత 'అజుడు'.



4. ప్రాగ్దిగ్గమనము గలిగి నాసాగ్రమునందుండి ఉచ్ఛ్వాస నిశ్శ్వాస రూపమున సంచరించునది "ప్రాణవాయువు". ఆవులింత లక్షణముగాగల "దేవదత్తము" దీనికి ఉపప్రాణము. అధిదేవత – విశిష్ఠుడు. స్థానము – హృదయము.

5. అధోగమనముగలిగి పాయ్వాదిస్థానములందు వర్తించునది 'అపానవాయువు'. మెలకువ లక్షణముగాగల 'కూర్మము' దీనికి ఉపప్రాణము. అధిదేవత – 'విశ్వకర్త'.

ఇటుల సమష్టివలన గలిగిన పంచప్రాణములు, ఉపప్రాణములు ఐదు, వెఱశి పది 'వాయు పంచీకరణము' వలన గలిగిన తత్త్వములు.

## ప్రాణము అనగా నేమి ?

"ప్రాణయతి ప్రకర్షేణ చేష్టయతి ఇతి ప్రాణమ్"

విశ్శేషముగా అచేతనములుగానుండెడి ఇంద్రియములను వ్యాపారము చేయించును కాబట్టి ప్రాణము అని చెప్పబడుచున్నది. జీవాత్మ ఇంద్రియములద్వారమున సమస్తభోగములను అనుభవించుటకు ముఖ్యకారణము 'ప్రాణము'.

(1) విశ్వయోని (2) జయుడు (3) అజుడు (4) విశిష్ఠుడు (5) విశ్వకర్త అనువారలు వ్యాన, సమాన, ఉదాన, ప్రాణ, అపానములకు వరుసగా అధిదేవతలు.

## స్థూలశరీరము – కర్మేంద్రియములు.

పాయువు – దీనివృత్తి మలవిసర్జనచేయుట. అధిదేవత – మృత్యువు. ఉత్పత్తి – తమస్సమష్టి పృథివి. పాయువునకు

అన్యభూత సంపర్కము లేదు. కేవలము పృథివియొక్క అంశ మాత్రమే యగుటవలన మలమూత్ర విసర్జన కార్యమును మాత్రము చేయుచుండును. మిగిలిన కర్మేంద్రియములు పృథివ్యాత్మకములుగా నున్నను తద్వ్యతిరిక్తములైన అన్యభూత సంపర్కముకూడ ఉండుటవలన తత్సంబంధమైన భూతకార్యములను మాత్రము చేయుచుండును. అంతియేకాని పృథివీతత్త్వమగు విసర్జనకార్యమును చేయజాలవు.

తమోవ్యష్టిపృథివి నాలుగుభాగము లయ్యెను. అందు —

మొదటిభాగము + ఆకాశము = వాక్కు (మాట)
రెండవభాగము + వాయువు = పాణి (చెయ్యి)
మూడవభాగము + అగ్ని = పాదము (కాలు)
నాలుగవభాగము + జలము = ఉపస్థ (గుహ్యము)

అని పిలువబడినవి.

2. 'వాక్కు'యొక్కవృత్తి — వచనము. అధిదేవత — అగ్నిదేవుడు. మిగిలిన ఇంద్రియములకు ఆకాశతత్త్వసంపర్కము లేదు గనుక శబ్దమును ఉత్పత్తిచేయజాలవు.

3. 'పాణి'యొక్క ధర్మము — స్పృశించుట, పట్టుట, విడచుట. ఇచ్చుట పుచ్చుకొనుట మొదలగునవి కార్యములు. అధిదేవత — ఇంద్రుడు; తక్కిన ఇంద్రియములకు వాయుతత్త్వసంపర్కములేదు గనుక ఇట్టి ధర్మములను నిర్వర్తింపనేరవు.



4. 'పాదము'యొక్క వృత్తి — 'గమనము'. అనగా నడచుట. వచ్చుట, పోవుట ఆదిగాగలవి. అధిదేవత — ఉపేంద్రుడు. మిగిలిన ఇంద్రియములకు అగ్నితత్త్వాంశలేదు గనుక గమనాది కార్యములను చేయజాలవు.

5. 'ఉపస్థ'యొక్క వృత్తి — మూత్రపురీషములను విడచుచు ఆనందించుచుండుట. అధిదేవత — ప్రజాపతి. జలతత్త్వసంబంధము మిగిలిన కర్మేంద్రియములకు లేదు. గనుక మూత్రపురీషాదుల విసర్జనకార్యమును చేయనేరవు.

సారాంశము :—

పృథివీపంచకము — వాక్పాణిపాదపాయూపస్థలు. వచనాదానాగమన విసర్గానందములు — తద్విషయములు. మృత్యువు; అగ్నిదేవుడు; ఇంద్రుడు; ఉపేంద్రుడు; ప్రజాపతి అనువారలు తత్తదధిపతులు. ఒక్కొక అవయవము ఒక్కొకకార్యమును చేయుచుండుటవలన ఇవి కర్మేంద్రియములు అనబడినవి. ఇవి పృథివ్యాత్మకములైనను ఏ యే భూతములయొక్క అంశతో చేరియున్నవో సంబంధము కలిగియున్నవో ఆ ప్రత్యేక భూత ధర్మములను మాత్రమే చేయుచుండును.

## స్థూలశరీరము — జ్ఞానేంద్రియములు.

నేత్రము:— తమస్సమష్టిఅగ్నివలన నేత్రము కలిగినది. అధిదేవత — సూర్యుడు. తమోవ్యష్టిఅగ్ని నాలుగుభాగములు ఐనది. అందు —

మొదటిభాగము + ఆకాశము = శ్రోత్రము (చెవులు)
రెండవభాగము + వాయువు = త్వక్కు (చర్మము)
మూడవభాగము + జలము = జిహ్వా (నాలుక)
నాలుగవభాగము + పృథివి = ఘ్రాణము (ముక్కు)

అని పిలువబడినవి.

### అధిదేవతలు

శ్రోత్రమునకు - దిక్కులు; చర్మమునకు - స్పర్శనుడు; జిహ్వకు - వరుణుడు; ఘ్రాణమునకు - అశ్వినేయులు.

జ్ఞానేంద్రియములు స్థూలశరీరమునకు అగ్నిపంచీకరణమువలన ఏర్పడినవి.

### స్థూలశరీరము - పంచతన్మాత్రలు.

1. రసము:— తమస్సమష్టిజలము "రసము" అని పిలువబడినది. తమోవ్యష్టిజలము నాలుగుభాగములైనది. అందు—

మొదటిభాగము + ఆకాశము = శబ్దము
రెండవభాగము + వాయువు = స్పర్శము
మూడవభాగము + అగ్ని = రూపము
నాలుగవభాగము + పృథివి = గంధము.

ఇటుల సమష్టి వ్యష్టి జలపంచీకరణమువలన పంచతన్మాత్రలు కలిగినవి.



### అధిదేవతలు

రసము - విష్ణువు; శబ్దము - సదాశివుడు; స్పర్శము - ఈశ్వరుడు; రూపము - రుద్రుడు; గంధము - బ్రహ్మ.

ఇందు గమనింపదగిన ముఖ్యవిషయము:—

తత్వములు ఆధ్యాత్మికములనియు, వాని కార్యములను ఆధిభౌతికములనియు, వాని అధిదేవతలను ఆధిదైవికములు అనియు చెప్పబడును. ఒక్కొక అధిదేవత ప్రేరణచేతనే ఒక్కొక తత్త్వమును దానిదాని కార్యములు చేయుచుండును.

### స్థూలశరీరము - అంతఃకరణ చతుష్టయము.

శ్రు॥ ఏవం భూత సత్త్వాంశ భాగత్రయ సమష్టితః । అంతఃకరణం అసృజత్॥ అంతఃకరణ మనోబుద్ధి చిత్తాఽహంకారాః తత్ వృత్తయః॥ సంకల్ప నిశ్చయ స్మరణ అభిమాన అనుసంధానాః తత్ విషయాః। గళ వదన నాభి హృదయ భ్రూమధ్యాని స్థానాని॥

— పైంగలోపనిషత్తు.

సమష్టి, వ్యష్టి యని ఆకాశము రెండుగా విభజింపబడినది. అందు సమష్టిభాగము "జ్ఞాత" లేక "జ్ఞానము" అనబడినది. జ్ఞాత (జ్ఞానము) కు స్థానము భ్రూమధ్యము. వృత్తి - అనుసంధానము. అధిదేవత - కూటస్థుడు. వ్యష్టిఆకాశము నాలుగు భాగములు అయ్యెను. అందు —

మొదటి భాగము + వాయువు = మనసు

రెండవ భాగము + అగ్ని = బుద్ధి

మూడవ భాగము + జలము = చిత్తము

నాలుగవ భాగము + పృథివి = అహంకారము

అని పిలువబడినవి.

1. మనస్సు:- సంకల్ప వికల్పాత్మకము. ఒక కార్యమును చేయ దలంచుట సంకల్పము. అటుల సంకల్పించి చేయ మర చుట వికల్పము. సంశయము మనస్సుయొక్క ధర్మము. అధిదేవత - చంద్రుడు.

2. బుద్ధి:- వృత్తి - నిశ్చయము. కార్యాఽకార్యముల చేయ నిశ్చయించుట బుద్ధియొక్క ధర్మము. అధిదేవత - వాచస్పతి.

3. చిత్తము:- చాంచల్యము, స్మరణము అనునవి విషయ ములు. ఇంద్రియములకు చాపల్యము కలిగించి, వాని ద్వారా ఆ యా ఇంద్రియధర్మములను (వృత్తులను) చేయించుచుండును. అధిదేవత - రుద్రుడు.

4. అహంకారము:- "కర్తృత్వము", "అభిమానము" అనునవి వృత్తులు. కార్యాఽకార్యములయందును యుక్తాఽ యుక్తములను గమనింపక, యోచింపక సర్వమునకును తానే కర్తనని "అహ మహమ్మ"ని అహంకరించి, గర్వించి పుణ్యాపాపములను చేయించు చుండును. అధిదేవత - జీవుడు.



జ్ఞాత, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను నవి అంతరింద్రియములు అనబడును.

ఇందలి ఇంద్రియములు - మనో, బుద్ధి, చిత్తాఽహంకా రములు - తమతమ స్థానములయందు ఉండియే బాహ్యములగు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములను వానివాని వృత్తులయందు ప్రవేశింపజేయుచున్నవి. కనుక ఇవి అంతరింద్రియములు అని పిలువబడినవి. ఇవియే సర్వసమష్టిగా "అంతఃకరణము" అనియు పిలువబడుచున్నది. అంతఃకరణము ఒక దర్పణము (అద్దము) వంటిది. జలములయందు చంద్రునివలె, అంతఃకరణమందు పర మాత్మయొక్క చైతన్యము ప్రతిబింబించినది. ఆ ప్రతిబింబమే "జీవుడు", "జీవాత్మ" అని పిలువబడినది.

సారాంశము:— స్థూలశరీరము చతుర్వింశతి తత్త్వాత్మ కము. ప్రాణాదిపంచకము; కర్మేంద్రియపంచకము; జ్ఞానేంద్రియ పంచకము; పంచతన్మాత్రలు; అంతఃకరణచతుష్టయము వెరశి ఇరువది నాలుగు.

ఈ స్థూలశరీరమునందు 'ఆత్మ', 'జీవాత్మ' నివశించు చున్నది. ఇదియే ఇరువదియైదవ తత్త్వము.

స్థూలశరీర పంచీకరణ చక్రము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| తమోస్థూల పంచభూతములు | ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి | పంచభూతములు |
| ఆకాశ పంచీకరణము | జ్ఞానము | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము | అంతఃకరణము |
| వాయు పంచీకరణము | సమానము | వ్యానము | ఉదానము | ప్రాణము | అపానము | పంచప్రాణములు |
| అగ్ని పంచీకరణము | శ్రోత్రము | త్వక్కు | నేత్రము | జిహ్వ | ఘ్రాణము | పంచతన్మాత్రలు |
| పృథివీ పంచీకరణము | వాక్కు | పాణి | పాదము | పాయువు | ఉపస్థ | కర్మేంద్రియములు |



పంచభూతతత్త్వకదంబము.

1. ఆకాశపంచకము:—

జ్ఞానము, సమానము, శ్రోత్రము, శబ్దము, వాక్కు. 5

2. వాయుపంచకము:—

మనస్సు, వ్యానము, త్వక్కు, స్పర్శము, పాణి. 5

3. అగ్నిపంచకము:—

బుద్ధి, ఉదానము, నేత్రము, రూపము, పాదము. 5

4. జలపంచకము:—

చిత్తము, ప్రాణము, జిహ్వ, రసము, గుహ్యము. 5

5. పృథివీపంచకము:—

అహంకారము, అపానము, ఘ్రాణము, గంధము, గుదము. 5

వెరశి 25

1. సూక్ష్మశరీరమునకు, స్థూలశరీరమునకును గల భేదమేమి ?

సత్త్వ రజ స్సూక్ష్మ సమష్టి వ్యష్టి భూతములచే నిర్మితమైనది సూక్ష్మశరీరము. కేవలము తమో సమష్టి వ్యష్టి భూతములచే మాత్రమే ఏర్పడినది స్థూలశరీరము. సప్తదశేంద్రియములు మాత్రమే సూక్ష్మశరీరమునకు గలవు. స్థూలశరీరమునకు చతుర్వింశతి ఇంద్రియములు కలవు. చక్షుర్గోచరముగానిది సూక్ష్మశరీరము. స్థూలశరీరమును ప్రత్యక్షముగా మనము చూచుచున్నాము.

కేవలము భోగసాధనము మాత్రమే సూక్ష్మశరీరము. కాని అది నశింపదు. అగ్నిచే దహింపబడదు. ఆయుధములచే

ఖండింపబడదు. జలముచే తడుపబడదు (నానదు). వాయువుచే శోషింపబడదు. మహాప్రళయమునందును గ్రసింపబడని అక్షరమైనది సూక్ష్మశరీరము.

షట్కోశాత్మకము స్థూలశరీరము. శీతోష్ణములకు లోనై వివిధపరిణామములను జెంది జీర్ణమై అంత్యమున నశించును. పంచభూతములచే నేర్పడినది. పంచభూతములలోనే లయమైపోవును. ఇది అచేతనమైనది. సూక్ష్మశరీరమునకు ఇది ఆవరణముగా నుండును. ఇది కంచుకమువలె నుండును. ఇది కేవలము కర్మఫలసాధనము మాత్రమే యగుచున్నది. సూక్ష్మశరీరము దీనిలో నుండుటచే చైతన్యవంత మగుచున్నది.

కోశత్రయాత్మకము సూక్ష్మశరీరము. ఒక్క అన్నమయ కోశముతోడనే ఆవృతమై పరిపుష్టమై యుండునది స్థూల శరీరము. సూక్ష్మశరీరమునకు లింగభేదము లేదు. వర్ణ భేదము లేదు, గోత్రభేదము లేదు, నామభేదము లేదు, రూపభేదము లేదు, మతభేదము లేదు, వేషభేదము లేదు. ఇట్టి భేదములన్నియు స్థూలశరీరమునకు గలవు.

2. సూక్ష్మశరీరము స్థూలశరీరములో అంతర్గతమైయున్నది అని చెప్పుచున్నారుగదా! దీనికి ఆధారమేమి ?

పరిణామపేశలము స్థూలశరీరము. కేవల జడస్వరూపము. సూక్ష్మశరీరముయొక్క సన్నిహితత్త్వముచేతనే స్థూలశరీరము చైతన్యవంతమై చలనధర్మము గలదగుచున్నది.



విద్యుద్దీపకాచకోశము (Bulb) స్థూలశరీరము. అందు కాంతిని ప్రసరింపజేయు తామ్రతంతువు (Fuse) వంటిది సూక్ష్మశరీరము.

తామ్రతంతువు (Fuse) తెగిపోగానే దీపము ఆరిపోవును. మరల వెలుగదు; గాజువలయము (Bulb) మాత్రమే బోలుగా మిగిలి యుండును. అటులనే కర్మఫలానుభవము తీరినవెంటనే సూక్ష్మశరీరము స్వస్థలమును వీడుచున్నది. వెంటనే స్థూలశరీరము చైతన్యతను గోల్పోయి మరణధర్మమును జెందుచున్నది.

3. సూక్ష్మశరీరము ఎటుల నశించును ?

సూక్ష్మశరీరము కారణదేహమును ఆశ్రయించియున్నది. అవిద్యయే – అజ్ఞానమే కారణశరీర మనబడుచున్నది. ఇది మలినసత్త్వప్రధానము. సుషుప్తియందలి సుఖమును అనుభవించుచు బంధనముగలిగి ఇంకను జీవభావము సిద్ధింపక సంచితకర్మభోగార్థము సూక్ష్మశరీరముతో సంబంధము గలిగి యున్నది. ఈ కారణశరీరమునకు అధిష్ఠాత "ప్రాజ్ఞుడు" అని పిలువబడుచున్నాడు.

ఈ కారణశరీరమే "ఆనందమయ కోశము" అనియు పిలువబడు చున్నది.

వేదవిహిత కర్మానుష్ఠానముచేతను, బ్రహ్మవిదుల నిత్య శుశ్రూషా పరిచర్యలచేతను జీవుడు సంస్కరింపబడి సుఖ దుఃఖానుభావమునుగాని, బంధములుగాని లేక నిర్లిప్తతజెందును. అట్టి దశలో జీవుడు "పారమార్థికుడు" "వాస్మవాత్మకుడు" అని పిలువబడుచున్నాడు.

పారమార్థికునియందలి జ్ఞానాగ్ని రగుల్కొని సంచితకర్మ పుంజమును భస్మీపటలము జేయును. అపుడే సూక్ష్మశరీరము నశించును. కనుక సూక్ష్మశరీరనాశనమునకు గురుశుశ్రూష, సత్పురుషసాంగత్యము, సద్గ్రంథపఠనము, వేదవిహితకర్మాను ష్ఠాన తత్పరత్వము అత్యంతావశ్యకములు.

## జీవుడు (జీవాత్మ) అనగా నెవ్వడు ?

ప్రాణాన్ క్షేత్రజ్ఞరూపేణ ధారయన్ 'జీవఉచ్యతే'॥

క్షేత్రము అనగా శరీరము. అందు ఉండి తత్సంబంధ మైన జ్ఞానముకలవాడు 'క్షేత్రజ్ఞుడు' 'జీవుడు' అని పిలువబడు చున్నాడు.

మూలప్రకృతియొక్క అవిద్యాంశము "జీవుడు." (1) 'శుద్ధసత్త్వము' (2) 'మలినసత్త్వము' అని మూలప్రకృతి రెండు తెఱగులు.

శుద్ధ, మలిన సత్త్వములయందు పరమాత్మచైతన్యము ప్రతిఫలించినది. శుద్ధసత్త్వమునందలి ప్రతిబింబము 'ఈశ్వరుడు' అనబడినాడు.

రజోగుణకలుషితమైనది – మలినసత్త్వము; ఇందు ప్రతి బింబించిన చైతన్యము. ఈ రెండింటికిని (1. మలినసత్త్వము, 2. ప్రతిబింబచైతన్యము) ఆధారభూతమైన 'పరమాత్మ' చైత న్యము సమష్టిగా 'జీవ'సంజ్ఞను బొంది "జీవాత్మ" "క్షేత్రజ్ఞుడు" అనబడుచున్నాడు.



## స్థూలశరీర నిర్మాణము.

శ్రు॥ ఈశః పంచీకృతవేశా నాదాయ వ్యష్టి సమష్ట్యాత్మక స్థూలశరీరాణి యథాక్రమ మకరోత్॥

కపాల చర్మాంత్రాస్థి మాంస నఖాని పృథివ్యంశాః। రక్త మూత్ర లాలా స్వేదాంబశాః। క్షుత్తృష్ణోష్ణ మోహ మైథునా అగ్న్యంశాః॥ ప్రచారణోత్తారణ శ్వాసాదికా వాయ్వంశాః। కామక్రోధాదయో వ్యోమాంశాః। ఏతత్సం ఘాతం కర్మణి సంచితం త్వగాదియుక్తం బాల్యాద్యవస్థాభిమాని బహుదోషాశ్రయం స్థూలశరీరం భవతి॥ —పైంగలోపనిషత్తు.

వ్యష్టి సమష్ట్యాత్మకమైన స్థూలశరీర వివరములు ఇందు ఉదహరింపబడినవి.

1. పృథివ్యంశములు:– కపాలము, చర్మము, అంత్రము అనగా ప్రేగులు, ఎముకలు, మాంసము, గోళ్లు.
2. జలాంశములు:– రక్తము, మూత్రము, నోటిలోఊరు లాలా జలము (చొంగ), చెమట.
3. అగ్న్యంశములు:– ఆకలి, తృష్ణ, వేడిమి, మైథునము.
4. వాయ్వంశములు:– ప్రచారణము, ఉత్తారణము, శ్వాస.

వ్యష్టి సమష్ట్యాత్మక పంచభూత సమ్మిశ్రితము – స్థూల శరీరము. కాలాంతరమున శీతోష్ణపరిస్థితుల ప్రభావమునకు లోనై, బాల్య యౌవన కౌమార వృద్ధాప్యములు అను పరి ణామముల నెందుచుండును. సంచితకర్మదోషాశ్రయమై అంగ వైకల్యాది అవయవలోపములను, రుగ్మతలను నెందుచుండును.

శ్రు॥ తాని సృష్టాని అండే ప్రాక్షిపత్ । తదాజ్ఞయా సమష్ట్యండం వ్యాప్య తాని అతిష్ఠన్, తదాజ్ఞయా అహంకార సమన్వితో విరాట్ సర్వస్థూలాని అసృజత్॥ హిరణ్యగర్భః తదాజ్ఞయా సూక్ష్మాణి అపాలయత్॥ అండస్థాని తాని తేన వినా స్పందితుం చేష్టితుం న శేకుః॥ తాని చేతనీకర్తుం సోఽకామయత॥ బ్రహ్మాండం బ్రహ్మరంధ్రాణి సమస్తవ్యష్టి మస్తకాని విదార్య తదేవానుప్రావిశత్ । తదా జడాన్యపి తాని చేతనవత్ స్వస్వకర్మాణి చక్రిరే॥ —పైంగలో. నిషత్తు.

విరాట్పురుషుడు స్థూలశరీరములను, హిరణ్యగర్భుడు సూక్ష్మశరీరములను విస్తృతముగా సృజించిరి. కాని ఏమి ప్రయోజనము? అవియన్నియు చలనరహితములు. జడములు. శక్తిహీనములు. విరాట్ హిరణ్యగర్భులు తాము సృజించిన స్థూల సూక్ష్మశరీరములను; 'స్పందితుం అపి'=కదలునటుల చేయుటకు చైతన్యవంతములై తమతమ నియుక్తధర్మముల నెరవేర్చుకొనుటకు; "న శేకుః"=చేయ సమర్థవంతులు గాకపోయిరి.

"సోఽకామయత" సః = ఆ పరమాత్మ అనగా ఎవని నుండి జగన్నిర్మాణక్రియారూపమైన ఆకాశాది పురుషాంతమగు సృష్టిక్రమము అవరోహణక్రమమున జరిగినదో; అక్షరుడును, సనాతనుడును, త్రిగుణాత్మిక మాయాఽతిరిక్తుడును అగు ఆ పరమాత్మ; "అకామయత" = కోరెను.

ఏమని కోరెను? తాని = అచేతనములైన విరాట్ హిరణ్యగర్భనిర్మితములైన స్థూల సూక్ష్మ శరీరములను; "చేతనీకర్తుం" = చైతన్యవంతములుగా, సజీవములుగా జేయుటకు; అకామయత = కోరెను.



సజీవములుగా ఎటుల జేయగలిగెను? "సమస్తవ్యష్టి మస్తకాని" = అసంఖ్యాకములైన తత్తత్కర్మానుగుణమైన విభిన్నరూపములుదాల్చిన శరీరములయందలి శిరస్సులయొక్క; "బ్రహ్మరంధ్రాణి విదార్య" = బ్రహ్మరంధ్రములను తెఱచి; "తదేత" = అటుల తెఱువబడిన మార్గమును; "అనుప్రావిశత్" = అనుసరించి ప్రవేశించెను.

తదా = అప్పుడు అనగా బ్రహ్మరంధ్రమార్గమున పరమాత్మ ప్రవేశించిన వెంటనే; "జడాన్యపి" = అతఃపూర్వము అచేతనములైయున్న శరీరములు; "చేతనవత్" = చేతనముల వలె; స్వ స్వ కర్మాణి చక్రిరే = తమ తమ నియుక్తకర్మలను జేయ నారంభించెను.

శ్రు॥ సర్వజ్ఞేశో మాయాలేశ సమన్వితో వ్యష్టిదేహం ప్రవిశ్య, తయా మోహితో జీవత్వం అగమత్॥ శరీరత్రయం తాదాత్మ్యాత్ తత్ కర్తృత్వం భోక్తృత్వం అగమత్॥ జాగ్రత్ స్వప్న సుషుప్తి మూర్ఛా మరణ ధర్మయుక్తో ఘటీయంత్రవత్, ఉద్విగ్నో జాతో మృత ఇవ కులాలచక్రన్యాయేన పరిభ్రమతి ఇతి॥

— పైంగలోపనిషత్తు.

మలినసత్త్వ మాయాప్రభావితుడైన పరమాత్మ విభిన్న రూపములు ప్రకృతులుగల శరీరములను ప్రవేశించి "జీవ" సంజ్ఞను పొందెను. స్థూలము, సూక్ష్మము, కారణము అని శరీర

ములు త్రివిధములు. జాగ్రత, స్వప్నము, సుషుప్తి, మూర్ఛా మరణములు అను అవస్థాంతరములు ఈ శరీరధర్మములు.

జీవాత్మ మాయామోహితుడై స్వస్వరూప జ్ఞానము కోల్పోయి అవస్థాంతరములు బొందుచు "పునరపి జననం, పునరపి మరణం, పునరపి జననే, జఠరే శయనం" అను శ్రీమచ్ఛంకరభగవత్పాదులవారి వాక్యానుసారము జనన మరణములు అను చక్రవలయమున కుమ్మరివాని సారెవలె పరిభ్రమించుచున్నాడు.

## పంచకోశములు.

శ్రు॥ అథ అన్నమయ ప్రాణమయ మనోమయ।
విజ్ఞానమయ ఆనందమయాః పంచకోశాః॥
—పైంగలోపనిషత్తు.

శ్రు॥ అంతశ్శరీరే నిహితో గుహాయాం॥
— అధ్యాత్మోపనిషత్తు.

అన్నమయము; ప్రాణమయము; మనోమయము; విజ్ఞానమయము; ఆనందమయము; అని కోశములు ఐదు. కోశము అనగా సంచి లేక 'ఒర.'

ఒకదానిలో ఒకటి కలసియుండి బాహ్యదృష్టికి ఒకే రూపమున గాన్పించు అరటిపువ్వులోని దళముల (రేకుల) వలె ఈ కోశములు ఒకదానియందొకటి అంతర్భూతమై ఒకే మూసలో బోసిన విగ్రహమువలె నున్నది. పుష్పములోని కర్ణికవలె జీవాత్మ కోశాంతరస్థమై యున్నది.



"ఒర" యందు కత్తి నిక్షిప్తమై యుండును. 'గుల్ల' అనగా బెరడుచే చింతపండు కప్పబడియుండును. గవిసెనచే వీణ మూయబడుచున్నది. పుష్పదళములచే కర్ణిక ఆవరింపబడుచున్నది. పంచకోశములచే జీవాత్మ వ్యాప్తమై కనుమరుగై యున్నది.

1. జ్ఞానస్వరూపము ఆత్మ. స్వప్రకాశాత్మకము ఆత్మ. కోశములు జడస్వరూపములు, చైతన్యరహితములు. వీని ఉత్పత్తియు ఆత్మనుండియే యైనదిగదా! ఇవి ఆత్మ ప్రకాశ ప్రసారమును ఎటుల నిరోధించుచున్నవి?

మేఘములు సూర్యకిరణములవలన కలుగుచున్నవి. ధూమము అనగా పొగ. అగ్నినుండి కలుగుచున్నది. మేఘములు, ధూమము ఇవి రెండును తమ జన్మకారణమైన సూర్యాగ్నులను ఆవరించి మరుగుపడ జేయుచున్నవిగదా? ఆయా వస్తువులను ఆవరించినపుడు అవి గ్రస్తములై తేజోవిహీనములై లేనటులనే తోచుచున్నవిగదా? చర్మ చక్షుస్సులకు వాని నిజస్వరూపము గోచరించుట లేదుగదా?

అజ్ఞానజనిత భ్రమ ప్రమాదమునకు లోనై కోశములు వేఱు, ఆత్మ వేఱు అని మనము గ్రహింపలేకున్నాము. నిదానించి పరీక్షించినపుడు సావకాశముగా అవలోకించినపుడు కత్తి వేఱు, ఒర వేఱు, బెఱడు వేఱు, చింతపండు వేఱు, గవిసెన వేఱు, వీణ వేఱు, పుష్పదళములు వేఱు, అందలి కర్ణిక వేఱు అని తెలియుచున్నది. అటులనే తత్త్వవివేకమువలన జీవాత్మ వేఱు, పంచకోశములు వేఱు అని బోధపడును.

జీవాత్మకును, పంచకోశములకును ఎటుల సంబంధము కలిగినది ?

ఇది అన్యోన్య అధ్యాసమువలన కలిగినది. అధ్యాసము అనగా ఈ వస్తువుయొక్క ధర్మము (విషయము - వృత్తి) ఆ వస్తువునందును, ఆ వస్తువుయొక్క ధర్మము ఈ వస్తువునందును తోచుట "అధ్యాస" యనబడును.

2. అన్నమయకోశము = స్థూలశరీము.

శ్రు॥ అన్నరసే నైవ భూత్వా అన్నరసే నాభివృద్ధిం ప్రాప్య అన్నమయ పృథివ్యాం యత్ విలీయతే సః అన్నమయకోశః తదేవ స్థూలశరీరమ్.

— పైంగలోపనిషత్తు.

మనము భుజించు పదార్థము "అన్నము" అనబడుచున్నది. అన్నరసము "అమృతము" అనియు పిలువబడుచున్నది. ఈ అమృతముచే తల్లిశోణితము గలుగుచున్నది. అది 'త్వక్కు' (అనగా చర్మము), మాంసము, రుధిరము (అనగా నెత్తురు) రూపమై యున్నది. ఆ యమృతముచేతనే తండ్రియొక్క "శుక్లము"ను కలుగుచున్నది. అది 'అస్థి' (అనగా ఎముక), 'మజ్జ' (అనగా ఎముకలలోపలి మెత్తని పదార్థము), శుక్లము (అనగా వీర్యము) అను వీని రూపమైయున్నది.

పిండోత్పత్తికి శుక్లమే బీజము. ఈ శుక్ల శోణితముల చేత శిరో నేత్రాది అవయవములతోగూడిన శిశువు గలుగుచున్నది. అనగా జలాంశమైన "ప్రాణము" గలుగుచున్నది.

పొట్టిగాను, పొడవుగాను, సన్నగాను, లావుగాను పరిణమించినంది చక్షుర్గోచరమగు ఆవరణవిశేషమే స్థూలశరీరము. ఈ



స్థూలశరీరమే అన్నమయకోశము అనబడుచున్నది. ఇది 'అస్తి జాయతే వర్ధతే పరిణమతే అపక్షీయతే వినశ్యతి॥' అనెడు ఆరు భావములు అనగా వికారములు, పరిణామ ధర్మములు గలిగి అంత్యమున పృథివిలోనే విలీనమగుచున్నది.

స్థూలశరీరమునకు స్త్రీ పుం లింగభేదము, జాతిభేదము, ఆశ్రయభేదము, వయోభేదము, పరిణామభేదము, గోత్రభేదము, నామభేదము, వర్గభేదము, రూపభేదము, మతభేదము, వేషభేదము ఇత్యాదులు పెక్కు అంతరములు (భేదములు) గలవు.

అన్నమయ కోశము (అనగా స్థూలశరీరమును) అంటక ఆ కోశముతో ఎట్టి సంబంధమును లేక తామరపాకు పైని నీటిబిందువువలె. పేడలోని కుమ్మరిపురుగువలె, లోహము పైని పాదరసమువలె కేవలము సాక్షిమాత్రముగానే సత్యజ్ఞానానంద లక్షణములుగల 'ఆత్మ' యున్నది. కనుక అన్నమయకోశము ఆత్మగాదు. అటులని భావించుట భ్రాంతిమాత్రమే యగును.

సూక్ష్మశరీరము - ప్రాణమయకోశము.

1. శ్రు॥ కర్మేంద్రియైస్సహ ప్రాణాదిపంచకం ప్రాణమయ కోశః॥

— పైంగలోపనిషత్తు.

వాక్పాణి పాద పాయూపస్థలు అను కర్మేంద్రియ పంచకము, ప్రాణాఽపాన వ్యానోదాన సమానములు అను పంచ ప్రాణములు వెరశి పది సమష్టిగా "ప్రాణమయ కోశము" అనబడును.

"ఆఢ్యోఽస్మి బలవానస్మి కోన్యోఽస్తి సదృశోమయా" ఇత్యాది విషయదోషములు "అబ్బా! ప్రాణమునకు ఎంత హాయిగానున్నది. ఓహో అపూర్వము! అసదృశము! ఈ ప్రకృతి రామణీయకము!" అను భావములు ఈ ప్రాణమయ కోశమే 'ఆత్మ' యను భ్రాంతిని జనింపజేయుచున్నవి. వాస్తవమునకు 'ఆత్మ'కు ఇందు ఎట్టి సంబంధమును లేదు.

2. శ్రు॥ జ్ఞానేంద్రియైస్సహ మనః మనోమయకోశః॥
— పైంగలోపనిషత్తు.

మనస్సు, చర్మము, నేత్రములు, చెవులు, నాలుక, ముక్కు వెరశి ఆరు కలసి "మనోమయకోశము" అనబడును. సంకల్ప వికల్పములు, రాగద్వేషములు, కామక్రోధములు — మనోమయకోశ ధర్మములు. ఆత్మ వీనికి బాహ్యమైయున్నది.

3. శ్రు॥ జ్ఞానేంద్రియైస్సహ బుద్ధిః విజ్ఞానమయకోశః॥
— పైంగలోపనిషత్తు.

బుద్ధి త్వక్ చక్షు శ్రోత్ర జిహ్వాఽఘ్రాణములు అను జ్ఞానేంద్రియషట్కము "విజ్ఞానమయకోశము" అనబడును.

"కార్యాఽకార్యములను, యుక్తాఽయుక్తములను, ధర్మాఽధర్మములను నిర్ణయించువాడను నేనే. నేను సదాచార సంపన్నుడను, అశేష శేముషీధురంధరుడను, స్వర్గాదిఊర్ధ్వలోక సంచారసామర్థ్యసంపన్నుడను, తపశ్శక్తిచే సూర్య చంద్రుల గతుల నిరోధించగలను." ఇత్యాది భావోద్రేకములు విజ్ఞాన మయకోశమునకు జెందినవి.

శ్రు॥ ఏతత్ కోశత్రయం లింగశరీరః ॥ —పైంగలోపనిషత్తు.



ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు మూడును సూక్ష్మశరీరము అనబడును. ఇదియే లింగశరీరము అనియు నామాంతరము గలిగియున్నది.

తనకు కంచుకమువలె ఆవరించియుండిన స్థూలశరీరము పతనముచెందిన తదుపరి జీర్ణమై వాసయోగ్యము కాకపోగా జీవుడు స్వర్గాది అవాంతరలోకములకు ఈ లింగశరీరముతోడనే వెళ్లగలుగుచున్నాడు. జీవుడు తానుచేసిన ఆ యా పుణ్యాపాప ఫలములను అట ననుభవించిన తరువాత మరల మరల పుట్టుచు చచ్చుచు అసంఖ్యాకమైన జన్మల నెత్తుటకు కర్మఫలసాధనమగు నది ఈ లింగశరీరమే.

ఈ లింగశరీరము భంగమగుటయే, నాశనమగుటయే జీవునకు జననమరణరూప సంసరణ బంధవిముక్తి. దీనికి అధిష్ఠానమై కారణశరీరము గలదు. చింతగుల్లలోని ఈనెలవలె అది లింగ శరీరమును అంటిపెట్టుకొనియుండి విడరాని బంధమైయున్నది. కనుక ముందు కారణశరీరము నశించినగాని, లింగశరీరము సర్వనాశనముగాదు.

కారణశరీరము — ఆనందమయకోశము.

శ్రు॥ స్వరూపాఽజ్ఞాన మానందమయకోశః ॥
— పైంగలోపనిషత్తు.

తనకు ఇష్టమగువస్తువును గాంచినంతనే జనించు సంతోషము 'ప్రియము' అనబడును. ఆ వస్తువు తనకు లభ్యమగునపుడు గలుగు సంతోషము "మోదము" అనబడును. ఆ వస్తువును కామించి లభ్యపరచుకొని అనుభవింపగా తదుపరి కలుగు

సంతోషము "ప్రమోదము" అనబడును. కేవలము అజ్ఞానము వలన అవిద్యవలనమాత్రమే క్షణికములైన ప్రియము మోదము ప్రమోదములు గలుగుచున్నవి. ఈ వ్యామోహమే ఈ "ప్రియ మోద ప్రమోద" త్రయమే కారణశరీరముగా పరిగణింపబడు చున్నది.

"నేను కర్తను, భోక్తను, సాత్వికుడను, అజ్ఞానిని, మూఢు డను, భ్రమకలవాడను" ఇత్యాదులు అజ్ఞానధర్మములు, అవిద్యా విషయములు. ఆనందమయకోశము – కారణశరీరము అనియు నామాంతరము కలిగియున్నది. 'ఆత్మ' ఈ కారణశరీరధర్మము లకు విలక్షణమై యున్నది.

సారాంశము:— కోశధర్మములు ఆత్మయందును సత్య జ్ఞానానందలక్షణములు కోశములందును 'ఆభాస'గా దోచు చున్నవి. ఇది కేవలము భ్రాంతిమాత్రమే. ఆత్మ వీనికి వేరుగా నున్నది.

ఒకవ్యక్తి – "ఇది నా యిల్లు, నా పొలము, నా భార్య, నా బిడ్డ, నా మిత్రుడు, నా దేశము" అని చెప్పుచున్నాడు. "ఇది నాది", "నాకు చెందినవి" అని అహమ్మికచరచి చెప్పుకొను వ్యక్తి ఆ యా వస్తువులకు వేరుగానే యున్నాడు. కాని వానిలో తాదాత్మ్యము చెందలేదు. లీనము కాలేదు. ఒకటియై పోవ లేదు. అటులనే ఆత్మకూడ కోశధర్మములయందు తాదాత్మ్యము చెంది ఏకమగుటలేదు.

ఒకవ్యక్తి "నా మిత్రుడు విశేషప్రజ్ఞావంతుడు, నా యజ మాని ఉదారస్వభావుడు, నాభార్య సద్గుణరాశి, నాకుమారుడు సంగీతకళానిధి, నా శరీరము రోగగ్రస్తమైనది" అని చెప్పుకొను



చున్నాడు. కాని ఆ యా పదార్థముల ఆ యా వ్యక్తుల స్వభావ గుణములు, పరిణామములు వికారములుమాత్రము ఆ వ్యక్తికి అనుభవమగుటలేదు. అటులనే జాతి కుల గోత్ర రూప నామాది అన్నమయకోశ వికారములు, వృత్తులు ఆత్మకు జెందుటలేదు. క్షుత్తు, తృష్ణ, పిపాస ఇత్యాది ప్రాణమయకోశ ధర్మములు ఆత్మకు చెందుటలేదు. సంకల్ప వికల్పాది మనోమయకోశధర్మ ములు ఆత్మకు చెందుటలేదు. కర్తృత్వ భోక్తృత్వాది విజ్ఞానాఽనందమయకోశ విషయములు ఆత్మకు చెందుటలేదు. 'ఆత్మ' ఒక ప్రత్యేక విలక్షణమగు వస్తువు. వీనిలోచేరియుండి నటుల అవినాభావసంబంధము కలిగియున్నటుల భ్రాంతికొలు పును. కాని దీనిలోచేరక పృథగ్భావమునుజెంది సాక్షిమాత్రము గానే యున్నది.

"నిజమే, ఇల్లు పొలము భార్య బిడ్డ మిత్రుడు దేశము ఇత్యాదులు వేఱు, నేనువేఱు ఇవి నాతోకలియని బాహ్యవస్తు వులు" అని ప్రత్యక్షముగా తెలియబడుచునే యున్నవి. మరి కోశములవిషయమున అటులగాదే ?

అన్నమయకోశము ప్రాణ మన విజ్ఞాన ఆనందమయ ములు అను నాలుగింటిచేతను, ప్రాణమయకోశము మన విజ్ఞాన ఆనందమయములు అను మూడింటిచేతను, మనోమయకోశము విజ్ఞాన అనందమయములు అను రెంటిచేతను, విజ్ఞానమయము ఆనందమయముచేతను వ్యాప్తమై ఒకదానియందు మరియొకటి పొదుగబడి ఒకేమూసలో పోసిన విగ్రహామువలె ఉన్నవిగదా? "ఇవి వేఱు, ఆత్మ వేఱు" అను విచక్షణజ్ఞానము, వివేకము గలుగును ?

శ్లో॥ బాహ్యదృష్టి శ్శ్రోత్రం అంతర్దృష్టి ర్బుద్ధిః । బాహ్య దృష్ట్యా జ్ఞాతుం అశక్యా అపి పదార్థాః అంతరదృష్ట్యా జ్ఞాతుం శక్యంతే ॥

ప్రత్యక్షముగా స్థూలపదార్థములను కనులతో చూచి తెలిసికొనుచున్నాము. దీనికే "బాహ్యదృష్టి" యని పేరు. బాహ్యదృష్టితో గ్రహింపజాలని విషయములను అంతరదృష్టి యగు బుద్ధిచేత తెలిసికొనవచ్చును.

సలసలమని పొగలుగ్రక్కునటుల ఆవిరి వెడలునటుల జలమును మరగగాచుచున్నాము. కొంతవడికి జలముపై నావరించిన పొగ ఆవిరి ఉపశమించి సమత్వమందును. ఉష్ణత్వము మాత్రము అటులనే వీడకయుండును. అట్టిస్థితిలో అది అనగా ఆ జలము వేడిగానుండినదో, చల్లగానుండినదో తెలియదు. బాహ్యదృష్టిచే ఈ సమస్యను పరిష్కరించలేము, నిర్ణయించజాలము. కాని స్పర్శజ్ఞానముచేత అనగా చేతితో తాకిచూచి (స్పృశించి) అది శీతలోదకమో ఉష్ణోదకమో యని నిర్ధారణ చేయుచున్నాము. ఇట్టి నిర్ణయము అంతరదృష్టిచేత స్పర్శజ్ఞాన సాధనచేత చేయగలుగుచున్నాము.

సినిమారంగమునందలి తెఱపై (Screen) చిత్రము కాంతికిరణములద్వారా ప్రసారింపబడి యవనిక (తెఱ) యొక్క అస్థిత్వమును మరుగుచేసి చిత్రమే కాన్పించుచున్నది. వాస్తవమునకు చిత్రము వేఱు, తెర వేఱు. అంతరదృష్టి (బుద్ధి) చేతనే యథార్థమును మనము గమనించుచున్నాము.

మనము నిత్యమును సేవించు తేనీటి పానీయములో బెల్లము కలసియున్నదో, పంచదార కలసియున్నదో బాహ్య



దృష్టికి గోచరముగాదు. రుచిచూచినపుడుమాత్రమే యథార్థమవగత మగుచున్నది.

అటులనే వ్యవసాయాత్మికమగు బుద్ధిచేత కోశములకును ఆత్మకునుగల అంతరమును పరిశీలించి "ఆత్మ" వేఱు, "కోశములు" వేఱు అని నిర్ణయింపచ్చును.

## జీవత్రయలక్షణము.

## స్థూలశరీరాభిమాని — విశ్వుడు.

శ్రు॥ అథ జ్ఞానేంద్రియపంచకం, కర్మేంద్రియపంచకం, వియదాదిపంచకం, అంతఃకరణ చతుష్టయం, అవిద్యాకామ తమాంసిపురం ఈశాజ్ఞయా విరాట్ వ్యష్టిదేహం ప్రవిశ్య బుద్ధి మధిష్ఠాయ విశ్వత్వం అగమత్ ॥

విజ్ఞానాత్మా చిదాభాసో విశ్వో వ్యావహారికో జాగ్రత్ స్థూలదేహాభిమానీ కర్మభూః ఇతిచ విశ్వస్య నామాభవంతి॥

— పైంగలోపనిషత్.

పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచ ప్రాణములు, పంచభూతములు, అంతఃకరణచతుష్టయము వెరశి తత్త్వములు ఇరువదినాలుగు. ఈ చతుర్వింశతి తత్త్వసంకలితము స్థూలశరీరము. ఇది అన్నరసపరిణామ రూపము. షట్కౌశికము—'బుద్ధి'ని అధిష్ఠానముగా జేసికొని ఈశ్వరరూపియగు ఆత్మచే ప్రబోధింపబడి ఈశరీరమునందు ప్రవేశించిన మాయాశబలిత చైతన్యమునకు 'జీవుడు' 'విశ్వుడు' అని పేరు,

"ప్రాణాన్ క్షేత్రజ్ఞరూపేణ ధారయన్ 'జీవ' ఉచ్యతే॥"

క్షేత్రము=అనగా చతుర్వింశతి తత్త్వాత్మకమైన చైతన్య రహితమైన (కళేబరము) శరీరము చక్షుర్గోచరమగుచు నామము రూపము కలిగియున్నందున స్థూలశరీరము అనబడుచున్నది. ప్రాణరూపమున మలినసత్త్వచైతన్యము ఇందుజేరి 'జీవ' సంజ్ఞను పొందినది. 'క్షేత్రజ్ఞుడు' అనియు చెప్పబడుచున్నాడు.

శ్రు॥ ఈశ్వర పిత బ్రహ్మ విష్ణు ఈశాన ఇంద్రాదీనాం నామ రూపద్వారా స్థూలోఽహం ఇతి అజ్ఞానవశాత్ జీవః సోఽయమేకోఽపి దేహారంభక భేదవశాత్ జీవః॥ —నిరాలంబోపనిషత్తు.

ఈశ్వరుడు బ్రహ్మ విష్ణు ఈశానాది నామములను రూపములను ధరించి తద్వారా "నేనే ఈ స్థూలదేహముగానున్నాను." అను మిథ్యారోపణను తనకు తానే వహించి "జీవుడు" అగుచున్నాడు. ఈశ్వరుడు ఒక్కడే. ఐనను దేహోత్పత్తికి కారణభూతమైన కర్మభేదముచేత బహుజీవులుగా గనబడుచున్నాడు.

పద్మకోశమువంటి ఆకారముగల ఒక మాంసపిండము ఈ శరీరమున గలదు. అది అంతఃకరణ చతుష్టయమునకు అధిష్ఠానము. అదియే హృదయము. ఇందు 'బుద్ధి' ప్రాధాన్యము వహించుచున్నది. బుద్ధికి అధిదేవత విజ్ఞానమయ పురుషుడు. తత్త్వరహస్యమును క్షుణ్ణముగా గ్రహించి ఆయా ఇంద్రియములను అనుభవించువాడు విజ్ఞానమయ పురుషుడు.

"హితము" అను పేరుగల 72000 డెబ్బదిరెండువేల నాడులు హృదయమునుండి వెలువడి శరీరమునం దంతటను



వ్యాపించి యున్నవి. శ్రోత్రాదికరణములు బుద్ధిచే ప్రచోదితములై తమ తమ నియుక్తకర్మలను జేయుచున్నవి.

తామ్రతంతువులు (copper-wires) నిర్జీవములు. విద్యుత్తు(electricity) అందు – ఆతంతువులయందు ప్రసరించి చైతన్యమును గలిగించి తేజస్సును కలిగించుచున్నది. లోహము (ఇనుము) జడపదార్థము. అది తప్తమై అగ్నిచే వ్యాపింపబడి అగ్నిరూపమును దాల్చుచున్నది. అన్నరస పరిణామరూపమైన స్థూలశరీరమునందలి బుద్ధియందు ఈశ్వరచైతన్యము ప్రసరించి జాగ్రదవస్థను కలుగజేయుచున్నది. జాగ్రదవస్థయందలి జీవాత్మ జీవస్వరూపము "విశ్వుడు" అని పిలువబడుచున్నాడు.

## 1. "జాగ్రదవస్థ" యనగా నేమి ?

చతుర్దశేంద్రియములును జాగృతినొంది తమ తమ విధ్యుక్తధర్మముల నెరవేర్చుసమయము "జాగ్రదవస్థ" యని స్థూలముగా నిర్వచింపబడుచున్నది. జీవస్వరూపియగు ఆత్మకు ఇది ప్రథమ భూమిక.

శ్రు॥ యేన ఆది చతుర్దశకరణైః పుష్కలైః ఆదిత్యాద్యనుగృహీతైః శబ్దాదీన్ విషయాన్ యథా ఉపలభతే తత్ ఆత్మనో జాగరణం॥
— సర్వసారోపనిషత్తు.

శ్రు॥ తత్తదేవానుగ్రహాన్వితైః శ్రోత్రాది జ్ఞానేంద్రియైః శబ్దాది అర్థవిషయగ్రహణజ్ఞానం జాగ్రదవస్థా భవతి.
— పైంగలోపనిషత్తు.

మనో బుద్ధి చిత్తాహంకారములు అనబడు అంతరింద్రియములు నాలుగు, త్వక్ చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణములు వాక్కు పాణి పాద పాయూపావస్థలు అను పది బాహ్యేంద్రియములు సమిష్టిగా చతుర్దశేంద్రియములు.

ఇవి ప్రత్యేకించి ఒక్కొకటియు వానివాని అధిదేవతలచే ప్రేరేపింపబడినవై తమ తమ నియుక్త (ధర్మమును) కర్మములను జేయుచుండును. ఆయా ఇంద్రియములు తాము తమ విధ్యుక్త ధర్మముల నెరవేర్చుచుండగా శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయజ్ఞానము విశ్వునకు కలుగుచున్నది. ఇట్టి విజ్ఞానావస్థకే "జాగ్రదవస్థ" యని పేరు.

"ఇవి ఈ దారా పుత్ర గృహ క్షేత్ర ఆరామములు నావి. ఇది ఈ అన్నరసపరిణామరూపమైన స్థూలదేహము నేనే" అని అభిమానించుట వలన ఈ జాగ్రదవస్థయందలి జీవస్వరూపము 'విశ్వుడు' అనుపేర బరగుచున్నది.

స్థూలశరీరమును అవలంబనముగా జేసికొని తన్మూలమున 'విశ్వుడు' సర్వకార్యములను నిర్వహించుచున్నాడు. కనుక "వ్యావహారికుడు" అని పిలువబడుచున్నాడు.

సచ్చిదానంద పరమాత్మయొక్క అంతఃకరణమునందు ప్రతిబింబించుటవలన "చిదాభాసజీవుడు" అనబడుచున్నాడు.

## 2. తైజసుడు – సూక్ష్మశరీరాభిమాని.

శ్రు॥ ఈశాజ్ఞయా సూత్రాత్మా వ్యష్టిసూక్ష్మశరీరం ప్రవిశ్య మన మధిష్ఠాయ తైజసత్వం అగమత్ ॥



శ్రు॥ తైజసః ప్రాతిభాసికః స్వప్నకలితః ఇతి తైజసస్య నామాని భవంతి॥ — పైంగలోపనిషత్తు.

## ఈశ్వరస్వరూపియగు "ఆత్మయే సూత్రాత్మ".

శ్రు॥ ఏక ఏవహి భూతాత్మా భూతే భూతేత్యవస్థితః
ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్.
— అమృతబిందూపనిషత్తు.

చంద్రుడు ఒక్కడే. ఐనను అనేక ఘటజలములయందు ప్రతిఫలించి ఒకేమారు అనేకములుగా దోచుచున్నాడు. అటులనే అసంఖ్యాకమైన అంతఃకరణములయందు పరమాత్మ ప్రతిఫలించి అనంతకోటి జీవులుగా దోచును. పెక్కుపుష్పములతో గూర్చబడిన హారమునందు ఒకే సూత్రము వ్యాపించియున్నది. పుష్పముల యందలి సూత్రము ఆత్మగా భావింపబడుచున్నది. అటులనే పెక్కుజీవులయందుదోచు ఆత్మయే "సూత్రాత్మ", "అంతర్యామి" అని పిలువబడుచున్నది.

మనస్సునకు సూత్రాత్మ అధిదేవత. స్వప్నభూమికయందు అది తేజోవంతమైయుండును. కనుక "తైజసుడు" అని పిలువబడుచున్నాడు.

## స్వప్నము అనగా నేమి?

శ్రు॥ తద్వాసనా సహితైః చతుర్దశకరణైః శబ్దాది అభావేపి వాసనామయాత్ శబ్దాదీన్ తత్కాలికాన్ ప్రతిభాసమానాన్ యథా ఉపలభతే తదా స్వప్నః॥ — సర్వసారోపనిషత్తు.

శ్రు॥ కరణోఽపరమే జాగ్రత్ సంస్కారార్థ ప్రబోధవత్
గ్రాహ్య గ్రాహక రూపస్ఫురణం స్వప్నావస్థా భవతి॥
— పైంగలోపనిషత్తు.

శబ్ద స్పర్శాది తన్మాత్రవిషయములను జ్ఞానేంద్రియములు మరచిపోవును. కర్మేంద్రియములు నిర్వీర్యములగును. తమకు సహజమైన కార్యనిర్వహణమునందు విముఖములై జ్ఞానేంద్రియ కర్మేంద్రియదశకము విశ్రమించి యుండును. ఒక్క అంతఃకరణము మాత్రమే జాగృతినంది యుండును. ఇట్టి స్థితియందు 'మనస్సు' ప్రాధాన్యత వహించి భాసమానమైయుండి జాగ్రదవస్థయందు ఆయా ఇంద్రియములచే గ్రహింపబడిన విషయములను చేయబడిన కార్యసంఘాతమును అనుభవింపబడిన భోగములను స్మరించుచుండును. జాగ్రదవస్థయందలి విషయములు భోగములు వాస్తవముగా లేకున్నను అవి ఉన్నటులను వానిని అనుభవించుచున్నటులను జాగ్రదవస్థయందలి కార్యములు చేయుచున్నటులను ద్యోతకమగుచుండును. భ్రాంతి పూర్వకమైన ఇట్టి మనస్సంకల్పమే ప్రమాదజనితావస్థయే "స్వప్నము" అనబడును.

స్వప్నావస్థయందలి తైజసుడు ఒకచో బ్రాహ్మణుడుగాను వేఱొకచో చండాలుడుగాను మరియొకచో పశుపక్ష్యాది తిర్యగ్రూపములుగాను విభిన్నరూపములతో నున్నటుల తనకు తానే భావించుకొనుచున్నాడు. కనుక 'ప్రాతిభాసికుడు' అని పిలుబబడుచున్నాడు.

అవిద్యాభూయిష్ఠమగు తమోవృతుడైన "తైజసుడు" "స్వప్నకలితుడు" అనబడుచున్నాడు,



3. ప్రాజ్ఞుడు – కారణశరీరాభిమాని.

శ్రు॥ ఈశాజ్ఞయా మాయోపాధిః అవ్యక్తసమన్వితో వ్యష్టి కారణశరీరంప్రవిశ్య ప్రాజ్ఞత్వం అగమత్ ॥

శ్రు॥ ప్రాజ్ఞః అవిచ్ఛిన్నః పారమార్థిక సుషుప్త్యభిమాని ఇతి ప్రాజ్ఞస్య నామభవతి॥ — పైంగలోపనిషత్తు.

ఈశ్వరస్వరూపియైన ఆత్మచేత ఆజ్ఞాపింపబడి కారణశరీరమును ప్రవేశించిన చైతన్యము 'ప్రాజ్ఞుడు' అని పిలువబడుచున్నాడు.

మాయోపాధి అనగా సుషుప్తి. గాఢనిద్ర.

శ్రు॥ చతుర్దశకరణోఽపరమాత్ విశేషవిజ్ఞానాభావాత్, యదా శబ్దాదీన్ విషయాన్ నోఽవలభతే తదాత్మా సుషుప్తిః॥
— సర్వసారోపనిషత్తు.

శ్రు॥ చిత్తైకకరణా సుషుప్త్యవస్థా భవతి ॥
— పైంగలోపనిషత్తు.

బీజమునందు అంకురము నిగూఢమై యున్నది. అటులనే అవిద్యయందు అనగా అజ్ఞానమునందు మనస్సుతోగూడ చతుర్దశేంద్రియములు అన్నియు లీనమై వ్యాపారరహితములై యుండును. ఇట్టిసమయమునందు 'పురేతత్' అను నొక 'నాడి' ద్వారా జీవాత్మ పరమాత్మనుజేరి తాదాత్మ్యమును జెంది యుండును. అపుడు జీవునకు ఎట్టి కోరికలును ఉండవు. జాగ్రదవస్థయందలి 'అహమహమ్మ'ను భావముగాని, స్వప్నావస్థయందలి పూర్వస్మృతుల భోగానుభవముగాని యుండదు,

కూర్మము స్వాంగములను లోనికి ఉపసంహరించుకొనునటుల కరణశక్తిని 'బుద్ధి'లోనికి ఆకర్షించుకొనును. అప్పుడు సంకల్ప వికల్పములు నశింపగా మనస్సు విశుద్ధమై శ్రియానంద నిలయమై ప్రశాంతమై నిశ్చలమై నిర్వికారమై యుండును. ఇట్టి దివ్యానుభూతియే మహదానందమే 'సుషుప్తి' యనబడును.

సూక్ష్మరూపేంద్రియములతోనైనను కూడి జీవుడు పని చేయని అవస్థకే (సు+షుప్తి) గాఢనిద్ర యనబడును. దీనికే కారణావస్థ; కారణశరీరమని పేరు. సుషుప్తియందు దేహేంద్రియాంతఃకరణములు ఏమియు ద్యోతకముగావు. ఐనను ఈ కారణశరీరము 'నేను' అను ఈషదభిమానము మాత్రము జాగరిత మగుచుండగా ప్రజ్ఞాస్వరూపుడై ప్రకాశించుచున్నందున వ్యష్టికారణశరీరమును ప్రవేశించిన 'జీవాత్మ' 'ప్రాజ్ఞుడు' అనబడుచున్నాడు.

అవస్థాత్రయమందును అనుస్యూతుడై యుండుటవలన ప్రాజ్ఞుడే "పారమార్థికుడు" అగుచున్నాడు.

దేహేంద్రియాంతఃకరణాదులు ఒక యవస్థయందు (భూమిక) యందు దోచును. మరియొక దశలో నిర్వీర్యములై అచేతనములై క్రియారహితములై జడభూతములగును. కాని ప్రాజ్ఞస్వరూపియగు ఆత్మ అవస్థాత్రయమునందును నాశనము లేక ప్రకాశించుచున్నందున "అవిచ్ఛిన్నుడు" అనబడుచున్నాడు.

## 4. తురీయావస్థ – సాక్షిచైతన్యము.

శ్రు॥ అవస్థాత్రయ భావాఽభావ సాక్షిస్స్వయం భావాఽభావ రహితం నిరంతరచైతన్యమాత్రం యదా తత్ తురీయం॥

— సర్వసారోపనిషత్తు.



జాగ్రదాది అవస్థాత్రయముల గమనాగమనములు దేనివలన దెలియబడుచున్నవో ఎయ్యది ఈ అవస్థాత్రయమును తెలిసికొనుచున్నదో ఆ పరమాత్మయే భావాభావసాక్షియని చెప్పబడుచున్నది. అట్టి సాక్షిచైతన్యము భావము అభావము అనునదిలేక ద్రష్ట దృక్కు దృశ్యము అనెడి త్రిపుటిరహితమై, సంకల్ప వికల్పములులేక ఎఱుక మఱుపులులేక నిర్వికల్పసమాధియందు లగ్నమైయుండుట "తురీయావస్థ" "బ్రహ్మనిష్ఠ" యని చెప్పబడును.

### 'చైతన్యము' అనగా నేమి?

శ్రు॥ అవస్థాత్రయోపహితం అవస్థాత్రయోప లక్షితం చ। నిరవస్థ విశుద్ధమేవ చైతన్యం॥ — సర్వసారోపనిషత్తు.

ఇది అవస్థాత్రయమునందును వ్యాప్తమైయుండును. ఒక అవస్థయందు జాగరితమై యుండినపుడు మిగిలిన రెండు దశలును లేవని తెలిసికొనును. ఇంతియేగాక ఈ అవస్థాత్రయమును అధిగమించినదై తద్వ్యతిరిక్తమై తద్విలక్షణమై పరిశుద్ధమై సత్యస్వరూపమై నిర్వికారమై స్వప్రకాశాత్మకమై ద్యోతకమగుచుండు జ్యోతి యొండుగలదు. అదియే ఆ జ్యోతియే తురీయ చైతన్యము. పరమాత్మ.

### శరీరత్రయ సమిష్టిరూపము – ఈశ్వరుడు.

### 'ఈశ్వరుడు' అనగా నెవ్వరు? ఆయన లక్షణమెట్టిది?

శ్రు॥ బ్రహ్మైవ స్వశక్తి ప్రకృత్యాఽభిధేయం ఆశ్రిత్య లోకాన్ సృష్ట్వా ప్రవిశ్య అంతర్యామిత్వేన బ్రహ్మాదీనాం బుద్ధీంద్రియ నియంతృత్వాత్ ఈశ్వరః॥ — నిరాలంబోపనిషత్తు.

తనయందలి ప్రకృతి యనబరగు మాయను ఆశ్రయించిన పరమాత్మయే ఈశ్వరుడు. చతుర్దశభువనములను సృజించి అందలి జీవరాశియందు సూత్రాత్మయై అంతర్యామియై ఆయా జీవుల బుద్ధిని ఇంద్రియములను ప్రవర్తింపజేయు నియంత ఈశ్వరుడు.

పరమాత్మలక్షణ మెట్టిది ?

శ్రు॥ దేహాదేః పరతరత్వాత్ బ్రహ్మైవ పరమాత్మా ॥
— నిరాలంబోపనిషత్తు.

నామము, రూపము, కర్మ ఇవి మూడును అనాత్మ స్వరూపములు. సమిష్టిగానివి "సత్తు" అనబడుచున్నవి. సద్రూపమే ఈ పాంచభౌతికశరీరము.

"తత్సృష్ట్వా తదేవ అనుప్రావిశత్" అను శ్రుత్యను సారము ఈశ్వరచైతన్య మిందు ప్రవేశించినది.

జీవాత్మవలె నామరూపకారణముగా తనకుతానే స్థూల సూక్ష్మ హ్రస్వ దీర్ఘాది పరిణామముల కల్పించుకొని 'అహం' భావమును పొందక స్వీయదేహోత్పత్తికి కారణభూతమైన కర్మమునకు కర్తృత్వ భోక్తృత్వభారమును వహింపక అనాత్మ స్వరూపకారణముల నధిగమించి వానితో నెట్టి సంబంధమును పొందక జ్యోతిస్స్వరూపమై స్వప్రకాశకమై భాసమానమగు చైతన్యమే "పరమాత్మ".

విరాట్పురుషుడు – స్థూలశరీరము.

దేవ మానవ పశు పక్షి మృగ క్రిమి కీటకాది సమిష్టి స్థూలశరీరములు అసంఖ్యాకముగా విభిన్నరూపములతో విభిన్న



నామములతో 'తస్మాత్' = సత్యజ్ఞానానందమయుడైన అక్షర పరబ్రహ్మమునుండి ఆదిపురుషునినుండి 'విరాటజాయత' = (సమిష్టిజీవరాశి విశిష్టుడైన) విరాట్పురుషుడుగా అయ్యెను.

"దేవోమర్త్యాగ్ం ఆవివేశ". — తైత్తిరీయోపనిషత్తు.

పరమాత్మచైతన్యము మర్త్యశరీరములయందువ్యాపించి 'విరాట్' అను నామమును బడసెను.

"విశ్వాన్ నరాన్ నయతి ఇతి వైశ్వానరః".

వివిధరూపములతో విభిన్ననామములతో వ్యవహరించుచున్న జీవాత్మలకు బాహ్యావస్తుపరిజ్ఞానమునొసంగి కర్మాచరణ తత్పరులజేసి తత్తత్కర్మానుగుణమైన ఫలదాయకములగు విభిన్న మార్గముల బ్రాపింప జేయు విరాట్స్వరూపి యగు 'ఆత్మ'యే వైశ్వానరుడు.

సహస్రానేకరూపములు అసంఖ్యాకనామములు గలవాడు అగుటవలన ఈ విరాట్స్వరూపియగు "ఆత్మ"యే (వైరాజసుడు.) వైరాజుడు.

1. హిరణ్యగర్భుడు సూక్ష్మశరీరము.

సమిష్టి సూక్ష్మశరీరమును ప్రవేశించిన ఈశ్వరచైతన్యము హిరణ్యగర్భుడు, సూత్రాత్మ, ప్రాణుడు అగుచున్నాడు.

అర్థవివరణము.

1. హిరణ్యగర్భుడు:— ఇతడు స్వప్నావస్థయందు జ్ఞానశక్తిగలిగి యుండును. బాహ్యార్థజ్ఞానజన్య వాసనస్మృతి పథమును

వీడడు. బాహ్యేతరములగు స్వప్నపదార్థముల ననుభవించు చుండును.

2. సూత్రాత్మ:– పుష్పదామము నందు వ్యాపించి యుండు సూత్రమువలె విశ్వమునందంతట పిపీలికాది బ్రహ్మపర్యంతము వ్యాప్తమై యుండును.

3. ప్రాణుడు:– క్రియాశక్తియుతుడై జీవుల స్వకర్మాచరణ ప్రయుక్తుల జేయును.

### 2. ప్రాజ్ఞుడు కారణశరీరము.

ప్రాజ్ఞుడు, ఈశ్వరుడు, అంతర్యామి, అవ్యాకృతుడు ఇవి కారణశరీరమును ప్రవేశించిన ఈశ్వరచైతన్యము యొక్క నామములు.

### అర్థవివరణము.

ప్రాజ్ఞుడు:– శ్రు॥ యత్రసుప్తో న కంచన కామం కామయతే,
న కంచన స్వప్నం పశ్యతి తత్ సుషుప్తం॥
— మాండుక్యోపనిషత్తు.

సుషుప్తి యనగా గాఢనిద్ర. అందు జీవునకు ఎట్టి కోరికలు నుండవు. స్వప్నములుగూడ గలుగవు. మనస్సు విశుద్ధమై ప్రజ్ఞానఘనమై శ్రియానందనిలయమై ఏకాగ్రమై నిశ్చలమై ప్రకాశించుచుండు ఈశ్వరచైతన్యమే "ప్రాజ్ఞుడు".

### ఈశ్వరుడు.

జాగ్రదవస్థయందు విశ్వజీవకోటి తానేయనియు తన కన్యమైన దెద్దియు లేదనుకొను స్వాభిమాని. జీవరాశికి



బాహ్యార్థజ్ఞానమును నశింపజేసి తత్సంబంధములగు విషయములను వాసనలను ఉపసంహరించి స్వాత్మభూతములుగా జేసికొని సౌషుప్తికానందమును స్వప్నజగత్తున ప్రసాదించును.

తాను కోరినపుడు స్వసామర్థ్యముచే జాగ్రత్స్వప్న జగత్తులను యథాపూర్వముగా నిర్మించును.

### అంతర్యామి.

"సవాఏష ఇహ ప్రతిష్ఠ ఆనఖాగ్రేభ్యః"
— బృహదారణ్యకము.

నామరూపాది వికారరహితమైనది ఆత్మ. నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావముగలది ఆత్మ. కోశమునందు ఖడ్గమువలె, దారువునందు అగ్నివలె విశ్వజగద్వ్యాప్తమైనది ఆత్మ. మనుష్యులయందు నఖశిఖపర్యంతము వ్యాపించి 'బుద్ధి'ని సాధనముగా జేకొని కరణములను స్వనియుక్తకర్మలయందు నియమించుచున్నది ఆత్మ. అదియే "అంతర్యామి" యనబడినది.

### అవ్యాకృతుడు

నామరూప రహితమైన నిరంశమగు నిర్గుణావస్థయందలి పరమార్థవస్తువే అవ్యాకృతుడు. కనుక శ్రమపడియైనను అట్టి అమూల్యమగు వస్తుస్వరూపమును తెలిసికొనవలయును.

### తురీయావస్థ.

(1) శ్రు॥ ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽంతర్యామిః ఏషయోనిస్సర్వస్య ప్రభవాప్యయౌహి భూతానాం॥ (2) నాంతః ప్రజ్ఞం న బహిః ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం

న ప్రజ్ఞం నాఽప్రజ్ఞం అదృష్టం అవ్యవహార్యం అగ్రాహ్యం అలక్షణం అచింత్యం అవ్యపదేశ్యం ఏకాత్మప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివం అద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః॥ — మాండూక్యోపనిషత్తు.

## తురీయస్వరూప నిరూపణము.

ఇతడు బాహ్యపదార్థజ్ఞానము గల 'విశ్వుడు' గాడు అంతఃప్రజ్ఞ గల 'తైజసుడు' గాడు. ప్రజ్ఞాన ఘనస్వరూపియైన సుషుప్త్యభిమాని గాడు. ప్రజ్ఞాన్వితుడనిగాని మూఢుడనిగాని నిర్వచింపజాలము.

ఇట్టి తురీయరూపము జ్ఞానేంద్రియగోచరము గాదు. వాక్కులకు మనస్సునకు అందదు. కర్మేంద్రియాతీతము. అనుమాన ప్రత్యక్ష ప్రమాణములచే ఇదమిత్థమని నిర్ణయింప నలవి గానిది. శబ్దముచే నిర్దేశింపబడదు.

కామము, క్రోధము, రాగము, ద్వేషము ఇత్యాదులు దానిని స్పృశింపనేరవు.

ఇట్టి స్వరూపమును శ్రమపడి ఎందుకు తెలిసికొనవలయును?

అది అత్యంత ప్రియమైనది. ఆత్మ దారా పుత్రాదుల కంటెను ప్రియమైనది. ఆత్మ గృహ ధన ఆరామ క్షేత్రాదుల కంటె ప్రియతరమైనది. చతురంభోధిపరీత మహీసామ్రాజ్యాధిపత్య మహాభోగాదులకంటెను ప్రియతమమైనది. స్వర్గాది ఉన్నత లోకాధిపత్యములకన్నను అధికప్రియతమమైనది.



దారాపుత్రాదులు మృత్యువాతబడుదురు. గృహక్షేత్ర ఆరామాదులు కాలగర్భమున గలసిపోవును. సామ్రాజ్యాధిపత్యాదులు క్షణికములు. అందలి భోగములు మూనాలపై తేనియలు. బుద్బుదప్రాయములు. పాంచభౌతికమైన ఈ కళేబరము జీర్ణమై శీర్ణమై పతనమగును. ఇచట శాశ్వతమైనది స్థిరమైనది ఎద్దియు లేదు. కనుక శ్రమపడియైనను అట్టి అమూల్య వస్తు స్వరూపమును తెలిసికొనవలయును.

## ఆత్మను జేరు మార్గమేది ?

"ఆత్మనా ఆత్మానం సంవిశతి" — మాండూక్యోపనిషత్తు.

పరమాత్మ అనుగ్రహమువలననే అతనిని చేరవచ్చును. అమృతస్వరూపుడతడు, మృత్యువాత బడకుండ రక్షించు మహోదార కల్యాణగుణసముపేతుడతడు, సజాతీయ విజాతీయ స్వగత భేదరహితుడతడు, దివ్యమంగళస్వరూపుడు, అక్షరుడు, జాగ్రదాది అవస్థాత్రయ నిర్వాహకుడు. సః=అతడే, ఆత్మా = పరమాత్మ, సః=అతడే, విజ్ఞేయః= తెలియదగినవాడు.

## 1. స్థూల, సూక్ష్మ శరీరములకు గల అంతరమేమి ?

సత్త్వ రజ స్సూక్ష్మ సమిష్టి వ్యష్టి భూతములచే నిర్మితమైనది సూక్ష్మశరీరము. తమో సమిష్టి వ్యష్టి భూతములచేనైనది స్థూలశరీరము. సప్తదశేంద్రియములు సూక్ష్మశరీరమునకు గలవు. స్థూలశరీరమునకు చతుర్వింశతి ఇంద్రియములు గలవు. చక్షుర్గోచరముగానిది సూక్ష్మశరీరము. నయనగోచరమగునది స్థూలశరీరము.

సూక్ష్మశరీరము అగ్నిచే దహింపబడదు. ఆయుధములచే ఖండింపబడదు. జలముచే తడుపబడదు (నానదు). వాయువుచే శోషింపబడదు. మహాప్రళయమునందును గ్రసింపబడదు. అది ఇహపరలోకములకు సంధిస్థానము. జాగ్రత్సుషుప్తులకు (కూడలి) కేంద్రము.

షట్కోశాత్మకము స్థూలశరీరము. శీతోష్ణములకు సుఖదుఃఖములకు ప్రకృతి పరిసరప్రభావములకు లోబడి విభిన్న పరిణామముల నొంది క్రుంగి కృశించి జీర్ణమై శీర్ణమై శుష్కపత్రమువలె నేల రాలును. దహింపబడునదిగనుక దేహ మనబడినది. శీర్ణమగునది యగుట శరీరమనబడినది. పంచభూతములచే నేర్పడినది తిరుగ పంచభూతములలోనే లయమగును. వీణకు గవిసెనవలె సూక్ష్మశరీరమున కిది యొక ఆచ్ఛాదనము మాత్రమే. జననమరణ వేదనల పాల్పడుచు ఇంద్రియసంఘాతములచే తప్తమై శుష్కమగునది స్థూలశరీరము.

స్త్రీ పుం లింగ గోత్ర నామ రూప వేషములు అను భేదములుగలది స్థూలశరీరము. ఇట్టి భేదములులేనిది సూక్ష్మశరీరము. నామము రూపము గలది స్థూలశరీరము. సంచితకర్మ సంజనిత దోషభూయిష్ఠము సూక్ష్మశరీరము.

2. అగోచరము, అదృష్టము నైనది సూక్ష్మశరీరము. దీనికి కోశభూతము స్థూలశరీరము అని చెప్పుటకు ఏమి ఆధారము గలదు ?

స్థూలశరీరము – బోలుగానున్న (Bulb) గాజుకుప్పె. విద్యుత్కిరణప్రసారసాధనమగు(Fuse) తామ్రతంతువు సూక్ష్మ



శరీరము. ఈతంతుద్వారమునప్రసరించు విద్యుత్తు(Electricity) పరమాత్మచైతన్యము. విద్యుత్ప్రసారము లేనిచో గాజుకుప్పెయందు కాంతి ప్రసరింపదు. వెలుగు ఉండదు. సూక్ష్మశరీరముద్వారా చైతన్యప్రసరణ లేనిచో స్థూలశరీరమునకు చలన ముండదు. జీవముండదు.

3. ప్రళయమునందున నశింపనిది సూక్ష్మశరీరము అని చెప్పినారు. ఇది యున్నంతవరకు జననమరణములు తప్పవుగదా ? ఇక బంధవిముక్తి కలుగుట ఎట్లు ?

చింతగుల్లయందు బెరడువలె, అరటిపండుయందు తొక్కవలె అవిద్య అజ్ఞానము అనృతము ఇత్యాది నామప్రసిద్ధమైన కారణశరీరము సూక్ష్మశరీరమును ఆవరించియున్నది. బాహ్యమందలి దారాపుత్రాదులయందలి మోహము అభిమానము ఆదరము వాని ప్రాప్తికై కావింపబడు వర్తనములు అజ్ఞానము అనబడును. ఈ అజ్ఞానమువలన మనము అభిలషించు ఫలితములు లభ్యముగావు. ఉదాహరణమునకు పరలోకగతులైన మన తాతతండ్రులను దారాపుత్రాదులను బంధుమిత్రులను ఒక్కపర్యాయమైననుసరే చూచి మాట్లాడవలయును అను అభిలాష నెరవేరుట లేదుగదా ? మరీచికల (ఎండమావుల) వెంట బరుగిడి అలసిపోయి దప్పితీరక నాలుక తడియారిపోగా కుప్పకూలి గ్రుడ్లు తేలవేయుచున్నాము గదా ? ఇసుకనుండి తైలమును తీయజాలముగదా? కుందేటికొమ్మును పట్టలేముగదా?

సత్సాంగత్యమువలన సద్గురూపదిష్టమార్గము ననుసరించుటవలన సద్గ్రంథపఠనముచేత అవిద్య నశించును. అజ్ఞాన

మంతరించును. మబ్బునువీడిన సూర్యునివలె సత్యస్వరూపము
గోచరించును. దారువునందు అగ్నివలె మనయందేయుండి నివురు
గప్పిపోయిన జ్ఞానాగ్ని రగుల్కొని ప్రజ్వలితమై విస్ఫులింగము
(అగ్నికణము) దూదిపింజనువోలె సంకుచితకర్మరాశిని భస్మీ
పటలము జేయును. అపుడే లింగశరీరము భగ్నమై భస్మమగును.

4. ఆత్మకు జీవుడన్న పేరు ఎటుల వచ్చినది? వినిర్మలా
కాశమును మేఘములు ఆవరించినటుల అవిద్య జీవుని ఆశ్ర
యించి శరీరాత్మభావమును ఛాయాత్మజ్ఞానమును ఆపాదించు
చున్నది. సత్యజిజ్ఞాసచే స్వరూపజ్ఞానమును బడసిన జీవుడు
తొల్లింటి ఛాయాత్మజ్ఞానము మిథ్యయని విశ్వసించి స్వప్రకాశా
త్మకమగు జ్యోతిస్వరూపమగు పరమాత్మను ఆశ్రయించుటచేత
("జీవుడు+ఆత్మ") జీవాత్మయని పిలువబడుచున్నాడు.

5. (1) జీవాత్మ, (2) ఈశ్వరుడు ఈ ఉభయులకు గల
భేదమేమి?

శ్రు॥ పాదోఽస్య విశ్వాభూతాని॥

శ్రు॥ తమ ఆసీత్ తమసా గూఢ మగ్రే॥

పరమాత్మయందు అవిద్యారూపిణియైన మాయ ఏకాంశ
చేత విలీనమై ఆకాశాది ప్రపంచోత్పాదన సామర్థ్యమును
చేకూర్చుచున్నది.

శ్రు॥ న కృత్స్న బ్రహ్మవృత్తిః సా శక్తిః కింతు ఏకదేశ
భాక్ ఘటశక్తిః యథాభూమహా స్నిగ్ధమృద్యేవ వర్తతే॥

ఎన్నియో విధములుగా మట్టి భూమియందున్నది. కాని
ఒక్క మెత్తని మట్టిచేతనే కులాలుడు (కుమ్మరి) ఘటములను



(కుండలు) చేయుచున్నాడు. మిగిలిన పలువిధములగు మట్టి
ఘటోత్పాదనశక్తిని గలిగియుండలేదు.

పరమాత్మయందు ఒక్క పాద (అంశ) మాత్రమే
యున్నది. అదియే పరమాత్మయొక్క శక్తిస్వరూపము. సామర్థ్య
విశేషము. ఉత్కృష్టమహిమ.

అట్టి శక్తి త్రిగుణాత్మిక. అందలి సత్త్వగుణము (1)
శుద్ధము (2) మలినము అని రెండు తెఱగులు. శుద్ధసత్త్వము
నందు ప్రతిబింబించిన మాయను ఆశ్రయించిన ఆత్మచైతన్యము
'ఈశ్వరుడు' అనబడినది. మలినసత్త్వమునందు ప్రతిఫలించిన
అవిద్యోపాధికమైన ఆత్మచైతన్యము 'జీవాత్మ' యని వ్యవహా
రింపబడినది.

పరిశుద్ధసత్త్వఉపాధి కలిగియుండుటచే ఈశ్వరుడు – సర్వే
శ్వరుడు సర్వాంతర్యామి అని పరిగణింపబడుచున్నాడు. మలిన
సత్త్వ ఉపాధి కలిగియుండుటచే జీవాత్మ – కించిజ్ఞుడు; అజ్ఞాని;
మూఢుడు; జంతువు; పశువు అని లెక్కింపబడుచున్నాడు.
ఇతడు కర్మపాశబద్ధుడు.

మేలిమిబంగారము ఈశ్వరుడు. రజస్తమోగుణ కలు
షితుడగు జీవాత్మ పదునాలవ (క్యారట్) వన్నెగల (Fourteen
Carrot) బంగారము.

గుణత్రయప్రభావ సమ్మోహితుడై కామోపభోగముల
ననుభవించుచు జననమరణరూపసంసారచక్రమున పరిభ్రమించు
అవిద్యావశవర్తి జీవాత్మ.

"యదన్నేనాతిరోహతి" యత్ = ఏకారణమువలన, అన్నేన = అన్నహేతుకమగు జగత్తుచే అనగా అన్నముచే జీవించెడి జగత్తుకంటె మాయాశక్తిని, అతిరోహతి = అతిక్రమించుచున్నాడో ఆకారణముచే, అతడు = ఈశ్వరుడు అనబడుచున్నాడు.

6. (1) ఈశ్వరుడు (2) హిరణ్యాగర్భుడు (3) విష్ణువు, (4) జీవుడు అను ప్రధానమైన ఈ నాలుగు భూమికలు పరమాత్మకు జెందినవి. ఇన్నిభూమికలు సృష్టినిర్మాణావశ్యకములా?

"ఏతావానస్య మహిమా" యని శ్రుతులే శ్లాఘించినవి. ఆత్మసామర్థ్యమును మాయాస్ఫురణచే స్పందనక్రియచే నేర్పడినవి ఉపాధులు.

ఈషత్ప్రిచలిత నిరతిశయ జ్ఞానశక్తియే ఈశ్వరుడు. రజస్తమశ్శక్తులే క్రియాచరణ సమర్థులగు హిరణ్యాగర్భ విష్ణువులు. మహోద్ధృత గాఢతమశ్శక్తి అవిద్యా కామకరణోపాధి సమన్వితుడు జీవుడు.

అజ్ఞానావరణము తొలగిపోవగనే ఉపాధిభేదములు గోచరముగావు. అపుడు నిర్వికారమైన నిష్కలంకమైన నిరంశమైన ఆత్మ "శ్రియానందస్వరూపమున" సాక్షాత్కరించును. ఈశ్వర సత్యనారాయణ – పరబ్రహ్మ, పరమాత్మ, పరశివుడు, పరాశక్తి ఇత్యాది నామాంతరములచే భాసమానమగునది సూత్రాత్మ యొక్క "ఆత్మ"తేజమే. శక్తియే.

"అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః"

"తస్య భాసా సర్వమిదం విభాతి"



బాహ్యాంతరముల ఎల్లయెడల ఆ జ్యోతి వ్యాప్తమైయున్నది. ఆ జ్యోతిప్రకాశముచేతనే భువనములన్నియు భాసమానములగుచున్నవి. వెలుగొందుచున్నవి.

ఈశ్వర సత్యనారాయణ యనగా నెవ్వరు ?

శ్రు॥ సదితి శ్రౌతప్రతీతి లక్ష్యం సత్యం । అసదిత్య వాచ్యం సత్యం।త్రికాలాబాధ్యం సత్యం।సర్వకల్పనాధిష్ఠానం వా సత్యం॥

—సర్వసారోపనిషత్తు.

జహదజహల్లక్షణ లక్ష్యముగా వేదములయందు వర్ణింపబడిన 'సత్త'యే **సత్యము.** అసత్తుగానిది సత్యము. అక్షరమైనది సత్యము. మార్పులేనిది సత్యము. భూత భవిష్య ద్వర్తమానములను కాలత్రయమునందును వ్యాపించి అపరిచ్ఛిన్నమైయుండునది **సత్యము.** అద్వితీయమైనది సత్యము. సర్వోత్కృష్టమైనది **సత్యము.** సజాతీయ విజాతీయ స్వగతభేద రహితము **సత్యము.**

స్థాణుపురుషుడు, రజ్జుసర్పము, శుక్తికారజతము, గగనారవిందము, వంధ్యాపుత్రుడు, మృగతృష్ణ, సముద్రతరంగములు అను ఇత్యాదులు మిథ్యాభూతములు. భ్రాంతిజనకములు. అవిద్యాసంజనితములు.

జీవుడు, ఈశ్వరుడు అను ఇరువురియందును మనము గాంచుభేదము ఆభాసమాత్రమే. ఇట్టి భ్రాంతిపూర్వక సంకల్పములకు అధిష్ఠానముగా నుండునదే సత్యము.

శ్రు॥ తత్సత్యం స ఆత్మా॥ —ఛాందోగ్యోపనిషత్తు.

సత్యమే ఆత్మ.

శ్రు॥ యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపివా।
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః॥
— పురుషసూక్తము.

దృగ్గోచరములగు చరాచర జీవకోటియందును అదృశ్యములై శ్రవణగోచరములుమాత్రమే యగు పదార్థములయందును బహిరంతరముల వ్యాపించియుండు సత్యలక్షణ లక్షితుడగువాడే సత్యనారాయణుడు.

1. నారాయణుడు:— 'నర' అనగా 'ఆత్మ'. "ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః" అను శ్రుత్యనుసారము ఆత్మసంభూతములైన ఆకాశాది పంచభూతములు "నారములు" అనబడును. పంచభూతములయందు కారణాత్మచే వ్యాపించి అవియే "అయనములు" (శరీరములు) గా గలవాడు నారాయణుడు. తనచే సృజింపబడి ప్రవృద్ధములైన పాంచభౌతికశరీరములందు సూత్రాత్మగానుండు ఈశ్వరచైతన్యమే సత్యనారాయణుడు.

శ్రు॥ వేదాహమేతం పురుషం మహాంతం,
ఆదిత్యవర్ణం తమసస్తుపారే
సర్వాణిరూపాణి విచిత్యధీరః
నామానికృత్వాఽభి వదన్యదాస్తే॥ — పురుషసూక్తము.



2. నారాయణుడు:—

శ్రు॥ యతోవా ఇమాని భూతాని జాయన్తే
యేన జాతాని జీవంతి,
యత్ప్రయన్త్యభి సంవిశంతి
తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి॥ — తైత్తిరీయోపనిషత్తు.

పిపీలికాది బ్రహ్మపర్యంతము సమస్త భూతములును అతనియందు జనించుచున్నవి. ప్రవర్ధమానము లగుచున్నవి. అంత్యమున సాగరగర్భమున విలీనమగు నదీమతల్లులవలె ప్రళయమున అతనినే "ప్రయంతి" పొందుచున్నవి. చేరుచున్నవి. అతనియందే "అభిసంవిశంతి" తాదాత్మ్యమును పొందుచున్నవి. "తద్ బ్రహ్మ" జగత్కారణమగు నదియే బ్రహ్మము.

శ్రు॥ ఏతస్యానందస్య అన్యాని భూతాని।
మాత్రా ముపజీవంతి॥ —బృహదారణ్యకోపనిషత్తు.

సర్వవిధ భోగభాగ్యములకు – సుఖానందములకు మూలకందము ఈ పరమాత్మయే – ఈ సత్యనారాయణుడే.

3. నారాయణుడు:—

'నరాణా మయనం యస్మాత్ తేన నారాయణ స్మృతః' మోహపాశబద్ధులైన జీవులు 'నరులు' అనబడుచున్నారు. అయనం=అనగా స్థానము, నరాణామయనం = అనగా పశుప్రాయులైన జీవులకు (జంతువులకు) ఆశ్రయస్థానము"పశుపతి." బ్రహ్మజిజ్ఞాసాపరులైన సత్యాన్వేషణతత్పరులైన భవరోగార్తులైన జీవులను శిష్యకోటికి సాధకలోకమునకు అయనం=గురు

స్థానమందుండి ప్రబోధించువాడు పశుపతి. అతడే సత్యనారాయణుడు.

4. నారాయణుడు:—

"నరస్యేదం నారం వపుః అవతారేషు నరశరీరం అయతే గచ్ఛతీతివా తదయనం ఆశ్రయో యస్యేతివా నారాయణః॥

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥

— భగవద్గీత.

ధర్మహాని గలిగినప్పుడు అధర్మము వృద్ధిజెందును. వర్ణాశ్రమధర్మములు యుక్తపథమున ప్రవర్తింపవు. సాధుపురుషులు పరిభవింపబడుదురు.

పలుబాధలకు లోనగుదురు. అనావృష్టి ఏర్పడును. కాటకము ప్రబలును. వ్యాధులు వ్యాపించును. క్షామదేవత వికటతాండవము జేయును. అదియొక కరుణాద్భుత భయానక బీభత్స రౌద్ర రసావేశ సన్నివేశము. విశ్వజీవకోటికి ఘాస గ్రాస సలిలపాన దారిద్ర్య మేర్పడును. ఆసురీశక్తులు విజృంభించును. అరిషడ్వర్గము హద్దులు మీరును. వర్ణసంకర మగును. అనాచారము తలయెత్తును. పరద్రవ్యాపహరణవాంఛ మిక్కుటమగును. అట్టి సమయమున —

ఆకటిబాధ కోర్వలేక అలమటించు ఆర్తుల 'భిక్షాం దేహి' యను దీనాలాపములచేతను, 'నాస్తి-గచ్ఛ' యను ధనికుల నిర్దయ కఠోర కర్కశ పరుష వాక్కులచేతను దిగంతములు మారుమ్రోగుచుండును. 'రక్షంతి పుణ్యాని పురాకృతాని' యని దృఢవిశ్వాసముతో నుపదేశములుచేయు ధార్మికులు సైతము సంశయగ్రస్తు లగుదురు. 'దరిద్రతా ధీరతయా విరాజితే' యని గుండెనిబ్బరముతో వ్యవహరించు సత్పురుషులు ఓపికచెడి మతిలువోయి నింగి చూచుచుందురు. 'స దేవాస్సృష్టినాశనమ్' యని సభాంతరముల చాటు పౌరాణికులు మూగవోవుదురు.



అప్పుడు ఎటుచూచినను పెక్కులగు పీనుగులకుప్పలు, పశు శల్య పర్వతమయంబులైన గ్రామోపకంఠములు, వానిపై తిరుగులాడి పెనగులాడు కుక్కుర కంక గృధ్ర సాలావృకములు; దుర్భర దుర్గంధభరిత దిగంతములు, పిశాచమలినఛాయావృతములైన సంధ్యలు, దుర్భరవేదనాతప్తహృదయవిస్తృతశోకారవ సంకులిత దివారాత్రములు ఓహో! దుర్భరము! దుస్సహము! అనూహ్యము! ఆ దృశ్యము. అట్టితఱి —

ఒక అలౌకికశక్తి పూర్వస్మృతి కలిగించును. ఒక ఆశాకిరణము మనల నావరించిన తమస్సు నొకింత తొలగించును. పురాకృతపుణ్యపుంజములందొకటి అంకురమువోలె ప్రస్ఫుటమగును. చిత్తము ఏకాగ్రమగును. పరమాత్మయందు బుద్ధి లగ్నమగును. అప్పటి ధ్యానక్రమములందు ఈదిగువ నుదహరింపబడునది ఒక భాగము. ఇది సర్వసాధారణము మాత్రమే. ధ్యానము పలు తెగలుగా నుండవచ్చును.

శ్రు॥ భవాయనమః శర్వాయనమః జ్వాలాయనమః నిధనపతయే నమః నిధనపతాంతికాయనమః ఆత్మాయనమః॥

మాఛిదో మృత్యో మావధీర్మా మేబలం విత్రుహో మా ప్రమోషీః । ప్రజా మామే రిష ఆయురుగ్రన్రుచక్షుసం త్వా హావిషా విధేమ॥

పరమాత్మా! నీవు జగదుత్పాదకుడవు జగత్స్వరూపుడవు. కల్యాణప్రదుడవు రక్షకుడవు. అష్టైశ్వర్యప్రదుడవు. నీకు మా నమస్కారములు.

తండ్రీ! నీవు మా జ్ఞానమును ఛేదింపకుము. మా సత్కార్యానుష్ఠానముల కంతరాయము కల్గింపకుము. మమ్ములను నిర్వీర్యుల జేయకుము. మా సంతతి అల్పాయుష్కు లగునటు లొనర్పకుము. చిరపరిచితములేగదా తండ్రీ! నీ యీ బిడ్డల గుణదోషములు, అనుచితవ్యాపారములు. వానిని సైరింపుము. మమ్ము కాపాడుము.

శ్రు॥ మానో మహాన్త ముతమానో అర్భకం
మాన ఉక్షన్త ముతమాన ఉక్షితం
మానోవధీః పితరం మోత మాతరం
ప్రియామాన స్తనువో రుద్ర రీరిషః॥

సాధుపురుషులు మాకు గురువులు. నీ యెడ మా బుద్ధులను ప్రచోదింపజేయు విజ్ఞానఖనులు. మార్గదీపికలు. పూజ్యులు. వారిని హింసింపకుము తండ్రీ! గర్భస్థపిండములు, ముక్కుపచ్చలారని కసిగందులు, మా వంశాంకురములు, సాంప్రదాయ ప్రవర్తకులు, వారిని రక్షింపుము. ధర్మసాధనమైన ఈ భౌతిక కాయమును ప్రసాదించిన మా జననీజనకులను, మమ్ములను ఈ దుఃఖసాగరమునుండి పారము జేర్పుము.



శ్రు॥ మానస్తోకే తనయేమాన ఆయుషి
మానో గోషు మానో అశ్వేషు రీరిషః ।
వీరాన్మానో రుద్రభామితో వధీః
హావిష్మంతో నమసా విధేమ తే॥

అజ్ఞానవశమున మోహజాలసంకీర్ణులమై నిన్ను మరచితిమి. పురాకృత కర్మపుంజములు పెనుకండలై పెరిగి కన్నులు గప్పినవి. చేయరానిపనులు చేసితిమి. వినరాని దుర్భాష లాడితిమి. ఇదిగో ఫలితమును అనుభవించుచున్నాము. ఇక చాలును. తండ్రీ చాలు నీ యనుభవము.

కపర్దీ! నీ ధనువు నెక్కిడకుము. కోపము నుపసంహరింపుము. ఈ బాధలు దుస్సహములుగా నున్నవి. ఈ ఆర్తనాదములను వినలేకున్నాము. ఈ ఆక్రోశములు దుర్భరములుగా నున్నవి.

నిన్ను పూజింతుము. ఆరాధింతుము. పశుపతే! మా బిడ్డల కాపాడుము. మా పశువుల రక్షించుము. మాకు దారాపుత్రుల జననీజనకుల ప్రసాదించుము. నిరంతరము నీ దివ్యగాన తత్పరులమై దివ్యానుభూతుల నొంది తరించుటకు దీర్ఘాయువును అనుగ్రహించుము.

శ్రు॥ ప్రజాపతే నత్వదేతాన్యన్యో
విశ్వాభూతాని పరితా బభూవ॥

పరమాత్మా! విశ్వజగన్నిర్మాణ కర్తవు నీవే. దేవ తిర్యగాది పిపీలికాది బ్రహ్మపర్యంతమైన సమస్తభూతజాలము, పంచభూతములు, బ్రహ్మాండపిండాండములు, సర్వము నీవే.

సమస్తము నీవే. నీవులేని పదార్థమే లేదు. సృష్టి స్థితి లయ హేతువు నీవే. అన్యులు ఇందులకు సమర్థులు గారు.

శ్రు॥ యేతే సహస్రమయుతం పాశా
మృత్యో మర్త్యాయ హంతవే।
తాన్ యజ్ఞస్య మాయయా
సర్వానవ యజామహే॥

నీకు విముఖులైనవారిని, నిన్ను మరచినవారిని, నీవారిని దూషించినవారిని, నీవారివారిని దూషించినవారిని బంధించుటకు నీయొద్ద వేలు పదివేలు లక్షలు కోట్లు ఆదిగాగల అసంఖ్యాకములైన పాశములు గలవు. అవి మమ్ములను దరిజేరకుండుగాక! వేదవిహిత ధర్మకర్మాచరణప్రభావమున మేము వానిని నిర్వీర్యములగునటుల చేయగల శక్తిని, స్థిరసంకల్పమును అనుగ్రహింపుము.

శ్రు॥ నమో రుద్రాయ విష్ణవే మృత్యుర్మే పాహి॥

హే పశుపతే! పార్వతీనాథా! హే లక్ష్మీపతే! నారాయణా! మీకు ఇవే మా నమస్కారములు. మృత్యువు బారినుండి మమ్ము కాపాడుడు. మాయందు అవతరించిన అజ్ఞానాంధకారమును పటాపంచలు చేయుడు.

"పాదోఽస్య విశ్వాభూతాని" అను శ్రుత్యనుసారము అట్టితరి సంతుష్టుడైన పరమాత్మనుండి ఒక దివ్యతేజము అవనికవతరించి మానుషశరీరము నాశ్రయించి రామకృష్ణాది లీలా మానుష వేషములతో మనలో కలసి మెసలుచు మనలో నొకడై అన్నింటిలో తానై మన కష్టములను తనవిగా



భావించి మనకనుకూలముగా పరిష్కరించుచు మనల సత్పథానువర్తులజేయుచు చల్లని మెల్లని సుస్నిగ్ధ సుశీతల సుమధుర వాక్సుధలతో అలరించుచు మనకు తోడునీడయై బాసటయై అండయై నిలచి లీలానటనలతో పలుకష్టములను తానే అనుభవించుచు ఆదర్శజీవితమును గడపుచు ఆసురశక్తుల నడంచి ఛిన్నాభిన్నమైన వర్ణవ్యవస్థను తిరుగ పాదుకొల్పి వసుంధరను సస్యశ్యామలనుగా తరు పుష్ప ఫల లతా కుంజపుంజములతో నయనపర్వముగా హృదయానందకరముగా విరాజిల్లజేయుచు మనమిత్రుడై బంధుడై సచివుడై గురుడై వ్యవహరించు ఆ దివ్యజ్యోతియే – ఆ పరమాత్మతేజమే – ఆ ఈశ్వరతేజమే – ఈ సత్యనారాయణుడు.

"స్వప్రకాశాత్మకము – ఆత్మ" యని జెప్పితిరి గదా? అది స్వప్రకాశాత్మక మెట్లైనది? నిరూపింపుడు.

బృహదారణ్యకోపనిషత్తులోని యొక ఉపాఖ్యానమునందిది నిరూపింపబడినది. అందలి విషయమును ఈ దిగువ నుదహరింతును.

ఒకసరి బ్రహ్మర్షియైన శ్రీ యాజ్ఞవల్క్య గురుదేవుడు, మిథిలాధిపతియగు జనకచక్రవర్తిని కుశలమరయ సందర్శింపబోయెను. ఆ సందర్భమున చక్రవర్తి మహర్షిని అభ్యర్థింపగా స్వప్రకాశాత్మకమైన ఆత్మజ్ఞానము ఉపదేశింపబడినది.

1. శ్రు॥ యాజ్ఞవల్క్య కిం జ్యోతిరేవాయం పురుష ఇతి।
ఆదిత్య జ్యోతిః సమ్రాడితి హోవాచ॥ ఆదిత్యే నైవ

అయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మకురుతే విపత్యేతీతి ఏవంవైతత్ ॥ — యాజ్ఞవల్క్య.

చక్రవర్తి :— ఇట పురుషుడనగా జీవుడని గ్రహింపవలయును. జీవుడు ఎట్టిజ్యోతిచే స్వీయకార్యములను నిర్వహించుచున్నాడు ?

మహర్షి :— అది ఆదిత్యజ్యోతిస్సు. సూర్యకాంతివలన అతడు జీవించియున్నాడు. ఆ వెలుగువలననే అతడు చూడగలుగుచున్నాడు. వలయుచోటికి వెళ్లి తన పనులను ముగించుకొని తిరిగి స్వస్థలము జేరుచున్నాడు.

చక్రవర్తి :— ఇది న్యాయసమ్మతమైనది.

2. శ్రు॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞ్యవల్క్య కిం జ్యోతిరేవాయం పురుష ఇతి। చంద్రమా ఏషా అస్య జ్యోతిర్భవతి। చంద్రమసైవాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మకురుతే విపత్యేతీతి ఏవమేవైతత్ ॥ — యాజ్ఞవల్క్య.

చక్రవర్తి:— సూర్యుడస్తంగతుడైనపుడు జీవుడు ఏ జ్యోతిస్సుచే వ్యవహరించును ?

మహర్షి:— అది చంద్రుని జ్యోతిస్సు. ఆ ప్రకాశమువలన అతడు చూడగలుగుచున్నాడు. వలయుచోటికి వెళ్ళి తన పనులను పూర్తిజేసికొని స్వస్థలమును జేరుచున్నాడు.

చక్రవర్తి:— ఇది ధర్మసమ్మతమైనది.

3. శ్రు॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య చంద్రమస్యస్తమితే కిం జ్యోతిరేవాయం పురుష ఇతి। అగ్నిరేవ అస్య జ్యోతిర్భవతి। అగ్నిసేవాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మకురుతే విపల్యేతీతి ఏవమేవైతత్ ॥ —యాజ్ఞవల్క్య.



చక్రవర్తి:— సూర్య చంద్రు లిరువురును అస్తమించినపుడు యే జ్యోతిస్సు గలదు ?

మహర్షి:— అది అగ్నియొక్క ప్రతిరూపమగు దీపము. ఆ దీపపు వెలుగులో జీవాత్మ స్వీయకార్యములను నిర్వహించుకొనుచున్నాడు. సూర్యచంద్రాగ్నులు ముగ్వురును చక్షురింద్రియము సాధనముగా సమస్తజీవరాశిని గాంచునటులను, తన పనులను సక్రమముగా నెరవేర్చుకొనుటకును జీవునకు తోడ్పడుచున్నారు.

చక్రవర్తి:— ఇది సహేతుకముగా నున్నది.

4. శ్రు॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య చంద్రమస్యస్తమితే శాంతేగ్నౌ కిం జ్యోతి రేవాయం పురుష ఇతి॥ వాగేవ అస్య జ్యోతి ర్భవతి। ఇతి॥ వాచైవాఽయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మ కురుతే విపల్యేతీతి॥ తస్మాద్వై సమ్రాడివ యత్ర స్వః పాణిః సవినిర్జ్ఞాయతే అథ యత్ర వాగుచ్చరత్యుపైవ తత్ర నేతీతి ఏవమేవైతత్ ॥ —యాజ్ఞవల్క్య.

చక్రవర్తి:— సూర్య చంద్రాగ్ని జ్యోతిస్సులు లేనియపుడు జీవుడు ఏ జ్యోతిస్సహాయమున తన పనులను నిర్వర్తించుకొనుచున్నాడు ?

**Note:**— వాక్కు అనగా మాట లేక శబ్దము అని గ్రహింపవలయును.

మహర్షి:— శబ్దమే (నాదమే) ఒక జ్యోతిస్స్వరూపము. తత్సహాయమున జీవుడు వ్యవహరించుచున్నాడు.

ఇతఃపూర్వము సూర్యచంద్రాగ్ని తేజస్సులు తోడ్పడినవి. అపుడు చక్షురింద్రియము సాధసముగా నుండినది. సూర్యాస్తమయమైనపుడు చంద్రకాంతి (వెన్నెల) తోడ్పడినది. చంద్రాస్తమయమైనపుడు అగ్నికి ప్రతిరూపమైన దీపము ఉపకరించినది. ఇపుడు ఆ దీపపుకాంతియు మందగించి క్షీణించినది. గాఢతమస్సు ఎల్లయెడల నావరించినది. చక్షురింద్రియ వ్యాపారము స్తంభించినది. ఐన నేమి? శ్రోత్రేంద్రియము చైతన్యవంతమై యున్నది. అది వాక్కువలన ఉత్పన్నమైన శబ్దమును గ్రహించి తత్సహాయమున జీవుని ప్రబోధించి స్వీయకార్యనిర్వాహణసమర్థుని జేయుచున్నది.

శ్రోత్రమునకు బధిరత్వము ప్రాప్తించును. అట్టియెడ గంధము అనగా వాసన సాధనముగా ఘ్రాణేంద్రియము ఉపకరించుచున్నది. ఆ ఘ్రాణేంద్రియమును నిరుపయోగమగును. అపుడు రసము అనగా రుచి ఉపకరణముగా రసనేంద్రియము (నాలుక) ఉపయోగపడుచున్నది. రసనేంద్రియము గూడ వ్యాపారవిముఖమగుచో త్వగింద్రియము (అనగా చర్మము) స్పర్శజ్ఞానముచేత జీవునకు స్వనియుక్త కార్యాచరణమునందు తోడ్పడుచున్నది.

ఈ విధముగా త్వక్చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణములు జ్యోతిస్స్వరూపములై సూర్యచంద్రాగ్ని తేజస్సులు అస్తంగతములైనపుడు జీవాత్మ కుపకరించుచున్నవి.



చక్రవర్తి:— ఇది సర్వజనాంగీకారయోగ్యముగా నున్నది.

5. శ్రు॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య చంద్రమస్యస్తమితే శాంతేగ్నౌ శాంతాయాం వాచి కిం జ్యోతి రేవాయం పురుష ఇతి॥ ఆత్మైవ అస్య జ్యోతిర్భవతి ఆత్మనైవాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మకురుతే విపల్యేతీతి॥

చక్రవర్తి:— సూర్య చంద్రాగ్ని తేజస్సులు అంతరించినవి. త్వక్చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణేంద్రియములు మోఘములైనవి. వానియందలి జ్యోతిస్సులు మందగించి తిరోభూతములైనవి. ఇక నిప్పుడు జీవాత్మకు ఆధారమగు జ్యోతిస్సు ఏది?

మహర్షి:— చక్రవర్తీ! ఆత్మయే ఆ జ్యోతిస్సు. ఆ ప్రకాశము జాగ్రదాది అవస్థాత్రయమునందును వ్యాప్తమై యుండును. మొక్కవోవనిది ఆ దివ్యతేజము.

## వివరణము.

జాగ్రదవస్థయందు చక్షురాది బహిరింద్రియములు, సూర్యచంద్రాగ్ని తేజస్సులు, ఇవి జీవాత్మకు నిత్యకృత్య నిర్వాహణమందు కేవలము సాధనములుగా - ద్వారములుగా మాత్రమే యైయున్నవి. ఈ సాధనముల కధిష్ఠానముగా కరణేంద్రియములకు పరమైన అన్యమైన స్వప్రకాశాత్మకమైన ఆత్మయొక్క తేజోప్రసారమార్గమున జీవాత్మ ప్రవర్తించి కృతకృత్యు డగుచున్నాడు.

జాగ్రదవస్థ యంతరింపగా జీవాత్మ స్వప్నజగత్తున కాలిడును. అతడందెన్నియో విషయములను గాంచును. ఒడలు మఱచి స్వస్థతను గోల్పోయి, తను యింకను బాహ్యజగత్తునే చూచుచున్నటులను, అందలి విషయభోగములను అనుభవించుచున్నటులను అనుభూతిని బొందుచున్నాడు.

ఒక్కొకచో జాగ్రదవస్థయందు చూడనివియు, చెప్పగా విననివియు ఊహాతీతములును నగు వస్తువులను గాంచుచున్నాడు. ఇంతియే గాదు. కన్నులులేని గ్రుడ్డివాడును, స్వప్నజగత్తులో అందలి వస్తుసముదాయమునుజూచి ఆనందించుచున్నాడు. చెవిటివాడు వినగలుగుచున్నాడు. కుంటివాడు పరుగిడుచున్నాడు. పక్షులవలె నెగురుటకు మనకు ఱెక్కలు లేవు. ఐనను ఎగురగలుగుచున్నాము. తిండిలేక డొక్కలు లోనికిపోయి శల్యావశిష్టుడైన ఆగర్భదరిద్రుడుగూడ పంచభక్ష్య పరమాన్నములతో గూడిన షడ్రసోపేతమైన మృష్టాన్నమారగించినటుల అనుభూతినొంది తృప్తిని ప్రకటించుచున్నాడు. సర్వసామాన్యుడు సర్వంసహామహీమండలాధిపత్యమును వహించి సార్వభౌమభోగముల యనుభవము నొందుచున్నాడు. పశుపక్ష్యాది వివిధరూపముల ధరించుచున్నాడు. మహాసంగ్రామరంగమున వీరయోధుడై పోరాడి అసువులబాసి వీరస్వర్గమలంకరించుచున్నాడు. దుష్టపిశాచముల బారిపడి బాధనొంది కుత్తుకనులిమివేయబడినటుల అనుభూతినొంది కెవ్వున కేకవైచి మంచముపైనుండి క్రిందకు దొర్లిపడి తొంటివిరుగగా జాగ్రదవస్థలో వికలాంగుడై బాధపడుచున్నాడు.



ఇట్టివియగు నింకను ఎన్నియో ఇతఃపూర్వము జాగ్రదవస్థయందు చూడనివి, విననివి, ఊహింపనివి, ఊహాతీతములును యగు దృశ్యములను స్వప్నజగత్తునగాంచి అందలి కార్యకలాపములందు బాల్గొని కష్టసుఖములను భోగభాగ్యములను జీవాత్మ యనుభవించుచున్నాడు.

కనుక స్వప్నజగత్తున యెయ్యది తలంచుచున్నాడో ఎట్టి క్రియాచరణనైపుణ్యమును ప్రదర్శించుచున్నాడో ఎట్టి దివ్యానుభూతులను అనుభవించుచున్నాడో వానియన్నింటికి అధిష్ఠానమైనది 'ఆత్మ'. అదియే బ్రహ్మము.

వాస్తవమునకు కరణేంద్రియములు కేవలము సాధనసామగ్రి మాత్రమే. ఇంటికి ద్వారములవలె ఇవియు గమనాగమనములకు మార్గములు. విషయపరిగ్రహణమునకు ఉపకరణములు.

శరీరమునకు ఒక్క స్పర్శజ్ఞానము మాత్రమే గలదు. వేఱొండుకార్యమును జేయనేరదు. బాహ్యేంద్రియములలో ప్రధానమైన పాత్ర వహించి చూచుటకు మాత్రమే ఉపకరించు సాధనము నేత్రము. ఇదియు స్వయంశక్తి సంపన్నము గాదు. నేత్రమున కట్టి శక్తి లేదు. అది స్వయంశక్తి సంపన్నమే యైనచో మృతశరీరమునందలి నేత్రములు చూడవలయును గదా ? అటుల జరుగుటలేదు. ఇది అసంభవమైన విషయమని మనమందరమును నిస్సందేహముగా ఏకగ్రీవముగా నంగీకరించు ప్రత్యక్ష సత్యము.

అది జాగ్రదవస్థయందే గానిండు, స్వప్నజగత్తునందే గానిండు లేక ధ్యానావస్థితస్థితియందే గానిండు మనము నిమీలిత నేత్రులమై ఇతఃపూర్వము జూచిన వినిన ఊహించిన వస్తువులకు రూపకల్పన జేసి నామమిడి కనుల కఱవుదీర చూచి మనస్సు తృప్తిజెందునటుల యనుభవించి ఆనందపరవశుల మగుచున్నాము. అగునుగదా ?

అగుచో ఏమిన్నిర్ణయ మగుచున్నది ? సంకల్పము చేయునది చూచునది అనుభవించునది యగు వేఱొండువస్తువు గలదని తేటతెల్లమగుచున్నది గదా ? అదియే 'ఆత్మ'. అదియే 'బ్రహ్మము'.

ఆత్మశక్తిచేతనే సంకల్పము కలుగుచున్నది. కార్యసంఘాతము నిర్వహింపబడుచున్నది. సర్వమును చూడగలుగుచున్నాము. చూచినదానిని అనుభవింపగలుగుచున్నాము. అంతియేగాని త్వగాది ఇంద్రియములు ద్రష్టలుగావు. వానికి దర్శనాది శక్తి లేదు.

గాఢసుషుప్తియందు మనకేమియు గోచరము గాదు. ఏమి జరుగుచున్నదోగూడ తెలియదు. కరణేంద్రియములకు గ్రహణశక్తి లోపించియుండును. సంకల్పవికల్పములు విరామమొందును. స్వప్నజగత్తునందువలె స్వర్గసుఖానుభవ ముండదు. మనస్సుతోగూడ మిగిలిన ఇంద్రియములన్నియు బడలిపోయి విశ్రాంతి నొందుచుండును.

ఇట్టి సుషుప్తిజగత్తునుండి జాగృతి నొందిన జీవాత్మ "ఆహా ! యెంత చక్కని సుఖమైన నిద్రపోయితిని" అని యొడలు



విరచి ఆవులించి చిటికవేసి సుఖానుభూతిని ప్రకటించుచున్నాడు.

సుషుప్తియందు యేదియో యొక దివ్యతేజస్సు లేకున్నచో ఇట్టి యనుభవమును ప్రకటించుట సంభవమగునా ? ఇట్టి యనుభవమునకు మూలకారణము 'ఆత్మతేజము'. ఆ దివ్యతేజస్సు సుషుప్తియందు అంతర్వాహినియై ప్రవహించుచున్నందువలననే తత్సుఖానుభవమును జాగ్రదవస్థయందు బాహాటముగా ప్రకటించుచున్నాము.

**1.** పోనీ, చక్షురాది కరణేంద్రియములకు దర్శనాదిశక్తి లేదు. ఒప్పుకొనుచున్నాను. సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు ఉన్నదిగదా ? మనస్సునకు దర్శనశక్తి లేదా ? అదియే చూచుచున్నది. పనులు చేయించుచున్నది. భోగములను అనుభవించుచున్నది అని ఏల చెప్పగూడదు ?

ఇది పొరబాటు ఇటుల చెప్పదగదు. "ఇది 'నా' సంకల్పము. 'నేను' చేసితిని. 'నేను' చూచితిని. 'నేను' స్వప్నమును గాంచితిని. 'నేను' నింగి కెగిరి నందనోద్యానమున విహరించి వచ్చితిని" అని మనస్సు తలచుచున్నది. చెప్పుచున్నది. అట్టి సమయమున మనస్సుగూడ ఒక విషయమైనది. ఒక వృత్తిగా పరిణమించినది. ఒక ఉపకరణమైనది.

"నేను – నాది" యనునపుడు మనస్సు కధిష్ఠానమై తద్విలక్షణముగా మరియొక వస్తువు ఉండినది; అని ప్రస్ఫుటమగుచున్నది. ఆ 'మరియొకవస్తువే' "నేను – నాది" యనబడు కర్తయే 'ఆత్మ' 'బ్రహ్మము'. ఆత్మ తేజోప్రసార ప్రభావితమైనది "మనస్సు".

ఆనిత్య చంద్రాగ్నులు జాగ్రదవస్థయందు కరణేంద్రియములను ప్రబోధించి జీవాత్మను స్వనియుక్త కర్మాచరణ సమర్థుని జేయుచున్నారు. అటులనే స్వప్నసుషుప్తులయందు గూడ కార్యకారణసంఘాతమునకు సజాతీయమైన మరియొకజ్యోతిస్సు ఉండియుండగూడదా? అది 'ఆత్మ' తేజస్సే యైయుండవలెను అను సిద్ధాంత మెచట గలదు?

మీ యీ అభిప్రాయము సరియైనదిగాదు. ఒక వస్తువునకు వేఱొండు సజాతీయవస్తువే సహాయపడవలయును అను నియమము ప్రకృతియందు గానవచ్చుటలేదు.

శుష్కకాష్ఠములు (కట్టెపుల్లలు) పార్థివాంశములు. అవి విజాతీయమైన అగ్నిచే దహింపబడుచున్నవి. మేఘములు జలాంశములు. విజాతీయమైన విద్యుత్తు అందు ఉత్పత్తియగుచున్నది. మనము త్రాగు నీరు విజాతీయమైన జఠరాగ్నియందు జేరి ఆహారమును పచనముజేసి ఆ యా ప్రత్యేకావయవములకు పరిమితప్రమాణమున చేరవైచి శరీరపోషణమునకు ఉపకరించుచున్నది. అన్యజాతీయములైన పశుపక్ష్యాదులు మన నిత్యజీవితమునందు ఎన్నియో తెఱగుల సహాయపడుచున్నవి.

ఆత్మ సజాతీయ విజాతీయ స్వగతభేద రహితమైనది. ఆదిత్యాది తేజస్సులకంటెను పరమైనది. ఉత్కృష్టమైనది.

శ్రు॥ న తత్ర సూర్యోభాతి; న చంద్రతారకం నేమా విద్యుతోభాన్తి కుతోఽయమగ్నిః తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి॥ — కఠోపనిషత్తు.



అగ్ని చేరికవలన కట్టెలు అగ్నిరూపమునే చెంది తదితర పదార్థములను గాల్చుచున్నవి. కట్టెలకు కాల్చుశక్తి స్వతఃసిద్ధము గాదు. అటులే స్వతఃసిద్ధమైన ఆత్మయొక్క జ్ఞానప్రకాశముచేతనే కాష్ఠసదృశములైన సూర్య చంద్ర నక్షత్రాదులు విద్యుత్తు మున్నగునవెల్ల ప్రకాశములుగా దోచుచున్నవి.

ఆదిత్యుని చైతన్యకిరణకాంతులు ఆత్మకు జెందినవే. హిమధాముని శీతలకిరణములు ఆత్మకు జెందినవే. అగ్నిదేవుని దహనశక్తి ఆత్మకు జెందినదే. మినుకుమినుకు మనెడి చుక్కల తేజము ఆత్మకుజెందినదే. సౌదామినీకాంత సౌందర్యము ఆత్మ వలన నెరవుగొన్నదే. కాన ఆత్మ స్వయంప్రకాశాత్మకమై మనలను స్వధర్మాచరణతత్పరులను జేయుచున్నది.

2. శ్రు॥ కతమ ఆత్మేతి యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః॥ సః సమానస్సన్ ఉభౌ లోకా అనుసంచరతి ధ్యాయతీవ లేలాయతీవ స హి స్వప్నో భూత్వా ఇమం లోకం అతిక్రామతి మృత్యోర్యారూపాణి॥

చక్రవర్తి:— ఆ యాత్మ ఎవడు? దేహేంద్రియ మనస్సులయం దెచట నున్నాడు?

మహర్షి:— పంచప్రాణములలో విజ్ఞానమయుడతడు. హృదంతర్జ్యోతిః — "హృది అయం హృదయం".

అయం=ఈ ఆత్మ. హృది=హృదయము. హృదయము అనునది ఒక గుహగా వర్ణింపబడినది. ఆ గుహాయందు జ్యోతిస్స్వరూపమున 'ఆత్మ' ప్రకాశించుచున్నాడు. కనుక "హృదంతర్జ్యోతిః" అని పేర్కొనబడినది.

శ్రు॥ ప్రతిద్వోచే అమృతం నువిద్వాన్ గంధర్వోనామ నిహితం గుహాసు । త్రీణి పదాని నిహితా గుహాసు యస్తద్వేద సవితుః పితాసత్ ॥ —తైత్తిరీయోపనిషత్తు.

అతడొక గంధర్వుడు. బ్రహ్మవేత్త. ఆత్మసాక్షాత్కారమును బడసిన శ్రియానందుడు. నామధేయము వేనుడు. ఆత్మతత్త్వమును ఈ దిగువ నుదహరించిన విధమున తన శిష్యులకు ఉపదేశించెను.

“త్రీణి పదాని నిహితా గుహాసు”

గుహాసు=పిపీలికాది బ్రహ్మపర్యంతమైన జీవరాశియొక్క హృదయగుహాలయందు, త్రీణి = జాగ్రత్తు స్వప్నము సుషుప్తి అను అవస్థాత్రయముగా, తత్ = ఆ అక్షరమైన బ్రహ్మము – పరమాత్మ, నిహితా = అవస్థితమైయున్నది.

పరమాత్మ జాగ్రదాది అవస్థాత్రయమునందును ప్రవర్తించుచు వానికి అధిష్ఠానమై హృదయకమలమునందు ఉన్నాడు. ఈ విధముగా యః = ఏ సాధకుడు స్వానుభవముచే తెలిసికొనునో, సః = ఆ భాగ్యశాలి, సవితుః = తన జన్మకారకుడైన తండ్రికికూడ, పితాసత్ = తండ్రి యగుచున్నాడు.

ఆత్మతత్త్వమును గ్రహించిన భాగ్యశాలి సర్వజనవంద్యుడై జననమరణ సంసరణ బంధినుండి విముక్తుడై అమరుడగుచున్నాడు.

1. ఇది చాల అసభ్యముగా నున్నది. తండ్రికి, తండ్రి యగునా కుమారుడు? ఇట్టి ప్రకృతివిరుద్ధ సూత్రములనా శ్రుతులు బోధించునది?



ఔను. ప్రకృతివిరుద్ధముగనే యున్నది బాహ్యార్థము. త్వరపడి మీరును ప్రకృతిని గోల్పోవగూడదు. నిదానించి ప్రశాంతమనస్కులై ఇందలి అంతరార్థమును గ్రహింప యత్నింపుడు.

తండ్రి పుత్రునియొక్క భౌతికదేహమునకే సృష్టికర్త. అతని బుద్ధిని సంస్కరించి అనుగ్రహించి శుద్ధసాత్త్వికప్రధానమైన ధర్మసాధనముగా పవిత్రదేవాలయమును దా పరివర్తనము చేయు మహాశిల్పి (శ్రీ)గురువు. నియమితపథమున సాధనజేసి తన హృదయగుహాయందున్న ఆత్మజ్యోతిని ప్రజ్వలింపజేసి బాహ్యతేజస్సు అందు విలీనమొనర్చి బాహ్యాంతర జ్యోతిస్సు ఏకీభూతములుజేసి సర్వభూతసమత్వముబడసి ఆ దివ్యజ్యోతిస్సునందు తాదాత్మ్యమును జెంది తత్స్వరూపుడేయై పరమాత్మస్వరూపుడై అఖండప్రజ్ఞానందస్వరూపుడై అణువునుండి బ్రహ్మపర్యంతము సర్వమును తానే యని భావించి “ఏతస్మిన్ ఖల్వక్షరే గార్గి ఆకాశ ఓతశ్చ ప్రోతశ్చ” అను శ్రుత్యనుసారము జగత్కారణచైతన్యము సమస్తప్రపంచమునందును వస్త్రము నందు తంతువువలె ఓతప్రోతమై పడుగు పేకలవలె నున్నదని గ్రహించి మహదానందనిమగ్నుడై యుండునో అట్టి సాధకుడు జగదుత్పత్తి స్థితి లయ హేతుభూతుడు అగుచున్నాడు. అట్టి సాధకునకు స్వీయనిర్మిత జగదంతర్గతు డగుటచే తండ్రియు పుత్రుడే యగుచున్నాడు. ఇందాశ్చర్యమేమున్నది? అసభ్యత ఏమి గలదు? “యస్తం విజానాత్ సవితుః పితాసత్” అను శ్రుతివాక్యము ప్రకృతివిరుద్ధ సూత్ర మెటులగును?

శ్లో॥ చిత్రం వటతరోర్మూలే వృద్ధా శ్శిష్యా గురుర్యువా,
గురోస్తు మౌనవ్యాఖ్యానం శిష్యాస్తు చ్ఛిన్నసంశయాః॥

మహర్షిశ్రేష్ఠులు దక్షిణామూర్తిగురుదేవుల దర్శనము చేసిన యవసరమున వర్ణించిన దృశ్యమిది.

ఆత్మతత్త్వమును మౌనవ్యాఖ్యతో బోధించు గురువు – ఒక యువకుడు, వయోగరిష్ఠులు, ఆత్మజ్ఞాన పిపాసార్తులు నగు శిష్యులు అతనిని సేవించి తమ సందేహములను నివర్తి చేసికొనుచున్నారు.

కనుక గురుశాస్త్రానుగ్రహమున ఆత్మసాక్షాత్కారము నొందిన శిష్యుడు, సాధకుడు – వయోవృద్ధులకును పూజార్హుడే యగుచున్నాడు. ఈ కారణముచేతనే యువకులైన మఠాధిపతులు వయోవృద్ధులైన పండితులచేతను, సామ్రాజ్యాధినేతల చేతను, బంధుమిత్రులచేతను, చివరకు తనజన్మకు కారణభూతుడైన తండ్రిచేతనుగూడ పూజింపబడుచున్నాడు ఇది నేటికిని మనము ప్రత్యక్షముగా చూచుచునేయున్నాముగదా ? కాదనగలరా మీరు ? ఇది అసభ్యమని ప్రకృతివిరుద్ధమని నివారింపగలరా మీరు ?

పిండాండమునందు — హృదయగుహాయందు మూడు భాగములు గలవు. ఆత్మతేజము ఆయా భాగములయందు విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు అను త్రివిధ రూపములతో ప్రకాశించుచున్నది.

అదియే తేజము. బ్రహ్మాండమునందు విరాట్పురుషుడు, హిరణ్యగర్భుడు, ఈశ్వరుడు అను త్రివిధరూపములతో ప్రకాశించుచున్నది.



"భూర్భువస్సువరితి తిస్రోవ్యాహృదయః"

— తైత్తిరీయోపనిషత్తు.

అదియే తేజము. భూః భువః సువః అను మూడు వ్యాహృతిరూపములను దాల్చినదియు ఆత్మతేజమే

విశ్వాత్మ - స్థూలశరీరాభిమాని.

శ్రు॥ పద్మకోశప్రతీకాశగ్ం । హృదయంచాప్యధోముఖం,
అధోనిష్ట్యా వితస్త్యాంతే । నాభ్యా ముపరితిష్ఠతి,
జ్వాలమాలాకులంభాతి । విశ్వస్యాయతనం మహత్ ॥

— పురుషసూక్తము.

గుండెకాయకు దిగువ 'నాభ్యాముపరి వితస్త్యాంతే' వితస్తి అనగా జేన. అనగా తొమ్మిదిఅంగుళములు. నాభికి ఊర్ధ్వమున తొమ్మిది అంగుళములుగల ప్రదేశమున హృదయకోశము కలదు. అది క్రిందికి వ్రేలాడుచున్న తామర మొగ్గవలె నున్నది. అదియే స్థూలశరీరాభిమానియగు విశ్వుడనుపేరుగల పరమాత్మ యొక్క స్థానము.

క్షీరమునందు నిక్షిప్తమొనర్పబడిన మరకతమణి స్వకీయమైన తేజఃప్రభచే క్షీరమునకు స్వతస్సిద్ధమైన శ్వేతవర్ణమును పూర్తిగా మార్చివైచి స్వాత్మతేజమును కలుగజేయుచున్నది.

'బుద్ధి' యనునది 'హితము' అనబడు ఒకనాడి. అది ఆత్మతేజమునకు అతిసన్నిహితమై హృదయకమలమునందు గలదు. ఆత్మతేజప్రభావితమైన స్వీయసాన్నిధ్య సంపర్క–

సంబంధముచేత 'బుద్ధి' తత్ప్రతిచ్ఛాయయగుచు ఆత్మయొక్క శక్తిసామర్థ్యములను ఎరవుగొనుచున్నది.

కనుకనే బుద్ధిసంపన్నులైన విద్వాంసులు పూజార్హులును లోకమాన్యులును అగుచున్నారు.

బాహ్యజగత్తున అనగా బ్రహ్మాండమున ఈ విశ్వుడే విశ్వాత్మయే విరాట్పురుషుడు అనబడుచున్నాడు.

వ్యాహృతులందు 'భూః' అనబడు భూమిక ఇదియే.

## తైజసాత్మ - సూక్ష్మశరీరాభిమాని.

సః = ఆయాత్మయే, జాగ్రదవస్థయందు 'విశ్వుడు' అను పేరుగల ఆ ఆత్మతేజమే, స్వప్నోభూత్వా=స్వప్న జగత్తునందు, 'తైజసుడు' అను నామమున వ్యవహరించుచు, సమానస్సన్ = జాగ్రదవస్థయందలి విషయములనే స్మరించుచు వాటిని కల్పించుకొని అందు వ్యవహరించుచు వానిని ఈ జగత్తునందువలెనే అనుభవించుచున్నాడు. ఇంతేగాక, ఇమం లోకం అతిక్రామతి= ఈలోకమునందలి విషయములను అధిగమించిన ఇతర విషయములను, మృత్యోరూపాణి = అవిద్యాజగత్తునందలి సుషుప్తి జగత్తునందలి ఆనందానుభూతులనుగూడ విజ్ఞానమయపురుషుడై అనుభవించుచున్నాడు.

## వివరణము.

శ్రు॥ సంతతగ్ం శిలాభిస్తులంబతి ఆకోశసన్నిభమ్,
తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్



తస్యమధ్యే మహానగ్నిః విశ్వార్చిః విశ్వతోముఖః
సోఽగ్రభుక్ విభజన్ తిష్ఠన్ ఆహార మజరః కవిః
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయ స్తస్య సన్తతా
సంతాపయతి స్వం దేహం ఆపాద తలమ స్తకః ॥

బుద్ధికి అధిష్ఠానము 'హితము' అనబడు నాడి. అది ఒక విద్యుత్కేంద్రము (Thermal Station). అటనుండి 72000 డెబ్బదిరెండువేల నాడులు శాఖోపశాఖలై ఊర్ధ్వాధోముఖములుగా సవ్యాపసవ్యములుగా నల్దెసల చిలువలు పలువలై తంతు (Wires) రూపమున వ్యాపించియున్నవి. 'విశ్వాత్మ' యొక్క తేజోకిరణములు ఈ నాడీ తంతురూపమున శరీరమంతయు ఆపాదమస్తకమును వ్యాపించి చైతన్యము కలుగజేయుచున్నవి.

ఆకోశము అనగా తామరమొగ్గ. ఆకోశసన్నిభము అనగా తామరమొగ్గతో సమానమగు ఆకారముగల మరియొక మొగ్గ. అదియే సుషుమ్న యనబరగు నాడి. అది హృదయకమలముయొక్క మధ్యభాగమునుండి అధోముఖముగా "ఆలంబతి"=వ్రేలాడుచున్నది. దానియందు బిసతంతుతనీయసమగు అతిసూక్ష్మమగు సుషిరము అనగా రంధ్రము ఒకటి గలదు. ఆ రంధ్రమునందు కార్యకారణసంఘాతరూపమగు 'విశ్వ'జగదాత్మ 'తైజసుడు' అను పేర వ్యవహరించుచున్నాడు.

ఈ తైజసుడే ప్రౌఢమగు అగ్నిసదృశముగా ప్రజ్వరిల్లుచు 'జఠరాగ్ని' 'వైశ్వానరుడు' అనియు వ్యవహరింపబడుచున్నాడు.

జఠరాగ్నిజ్వాలలు అన్నాదికమును ఆహుతిగొనుచు హుతమగు ఆహారమును 'తిర్యగూర్ధ్వమధశ్శాయీ' అడ్డముగా నిలువుగా పడుగుపేకలవలె శాఖోపశాఖలుగా ఆపాదమస్తకము వ్యాపించియున్న నాడీతంతుముఖమున ఆ యా అవయవములకు పరిమిత ప్రమాణమున ( Proportionate ) గా వ్యాపింపజేసి పుష్టివర్ధనముగా జేయుచుండును.

శ్లో॥ అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః,
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥
— భగవద్గీత.

"నేను (అనగా పరమాత్మ) వైశ్వానరుడనై శరీరముల నాశ్రయించి ప్రాణాపానములతో గూడుకొన్నవాడనై భక్ష్య భోజ్య లేహ్య చోష్యములు అను నాలుగు విధములైన ఆహారాదికమును పచనము అనగా జీర్ణము చేయుచున్నాను" అని శ్రీకృష్ణభగవానుడు సెలవిచ్చినాడు.

భుజించిన యన్నమును జీర్ణము జేయును. కాని తాను మాత్రము ఆ యాహారముతో బాటు జీర్ణముగాక యుండును. కనుక వైశ్వానరుడు 'అజరుడు' అని పిలువబడినాడు.

సంకల్ప వికల్పాత్మకమైన స్వప్నజగత్తులో బాహ్యా బాహ్యేతరార్థములను గ్రహించుచున్నందున 'కవి' యనియు, సర్వజ్ఞుడనియు వైశ్వానరుడు పిలువబడినాడు.

కవి, అజరుడు, వైశ్వానరుడు, జఠరాగ్ని, తైజసుడు అను నామములు సుషుమ్నాసుషిరాంతర్గత ఆత్మతేజమునకు నామములు.



బ్రహ్మాండమున అనగా బాహ్యజగత్తున ఇతడే "హిరణ్యగర్భుడు" అని పిలువబడుచున్నాడు.

వ్యాహృతులయందు 'భువః' అనబడు భూమిక ఇదియే.

## ప్రాజ్ఞాత్మ – కారణశరీరాభిమాని.

శ్రు॥ తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః।
నీలతోయదమధ్యస్థాత్ విద్యుల్లేఖేవభాస్వరా।
నీవారశూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా।
తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః।
సబ్రహ్మ సశివ స్సహరి స్సేంద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్॥

నీవారధాన్యపు ముల్లువలె సూక్ష్మాతిసూక్ష్మ అణుప్రమాణమున హిరణ్మయరూపమున నల్లని మేఘములోని మెఱుపు తీగవలె ప్రకాశించుచు అగ్నిజ్వాల ఈ జఠరాగ్ని నడుమనుండి ఊర్ధ్వముఖముగ నెగురుచున్నది. ఆ యగ్నిశిఖామధ్యమున 'ప్రాజ్ఞుడు' 'ఈశ్వరుడు' అనబడు పరమాత్మ యున్నాడు. సుషిర మధ్యమునందలి వహ్నిశిఖామధ్యమున పరమాత్మ యున్నాడు.

అతడే బ్రహ్మము; రుద్రుడు; విష్ణువు; ఇంద్రుడు; అక్షరుడు (నాశరహితుడు); కూటస్థుడు అను నామములు గల సుషుప్త్యభిమానియగు స్వప్రకాశాత్మకమైన 'ఆత్మ' బ్రహ్మాండమునందు ఈ ప్రాజ్ఞుడే 'ఈశ్వరుడు' అనబడుచున్నాడు.

వ్యాహృతులయందు 'సువః' యను మూడవ భూమిక ఇదియే.

### సారాంశము.

ఆత్మ వ్యష్టియనియు, సమిష్టియనియు రెండు రూపముల ధరించినది. వ్యష్టిశరీరము పిండాండము. సమిష్టిశరీరము బ్రహ్మాండము. వ్యష్టి సమిష్టి శరీరములు అవస్థాత్రయమును పొందుచున్నవి. అవస్థాత్రయమునందును మూడునామములచే వ్యవహరింపబడుచున్నది.

### వ్యష్టి శరీరము.

హృదంతర్జ్యోతియందు జాగ్రదభిమానియగు విశ్వుడు, సుషుమ్నయందలి జఠరాగ్నియందు స్వప్నాభిమానియగు తైజసుడు, జఠరాగ్నియందలిఊర్ధ్వశిఖామధ్యమున సుషుప్త్యభిమానియగు ప్రాజ్ఞుడు అను నామములతో ఒకే ఒక పరమాత్మ వ్యవస్థితుడై యున్నాడు.

### సమిష్టి శరీరము.

స్థూలదేహము, తదభిమాని – విరాట్పురుషుడు.

సూక్ష్మశరీరము, తదభిమాని – హిరణ్యగర్భుడు.

కారణశరీరము, తదభిమాని – ఈశ్వరుడు.

పరమాత్మ జాగ్రదవస్థయందు విరాట్ పురుషుడుఅనియు, స్వప్నావస్థయందు హిరణ్యగర్భుడు అనియు, సుషుప్తియందు ఈశ్వరుడు అనియు, పిండాండమునందువలెనే బ్రహ్మాండమునందు అవస్థాత్రయమును పొందుచున్నాడనియు భావింపవచ్చును. పరమాత్మయొక్క సుషుప్తి అవస్థాప్రవేశమే 'ప్రళయము.' జగన్నాటక చరమాంకము.



భూః భువః సువః అను వ్యాహృతిత్రయమే పిండాండమున జాగ్రత్స్వప్నసుషుప్తులు. బ్రహ్మాండమున భూలోకము, స్వర్గలోకము, సత్యలోకము పరమాత్మయొక్క మాయానాటకరంగములు.

ఇక ప్రకృతమునకు వత్తము.

వ్యష్టిశరీరమునందు అనగా పిండాండమునందలి జీవాత్మకు ఆదిత్య చంద్రాగ్నులు బాహ్యజ్యోతిస్సులు. జాగ్రదవస్థయందు కరణేంద్రియములన్నింటికిని ఈ బాహ్యజ్యోతిస్సులు అనుగ్రాహకములై యున్నవి.

కాని ఇవి అనగా ఈ బాహ్యజ్యోతిస్సులు నిర్దిష్టమైన ఒక నియమిత కాలమునకే ఉపయోగపడుచున్నవి. ఇవి అస్తంగతములైనపుడు "హృదంతర్జ్యోతులు" సాధనములై జాగ్రదాది జగత్త్రియమునందును వెలుగునిచ్చుచు అంతరింద్రియములకు అనుగ్రాహకములై యున్నవి. ఈ స్వప్రకాశాత్మక తేజోప్రభావితము లగుటచేతనే కార్యకారణసంఘాతము చైతన్యవంతమగుచున్నది.

ఇచ్ఛామాత్రమైనది కార్యకారణసంఘాతము. ఇచ్ఛకు మూలస్థానము బుద్ధి. బుద్ధిపై ఆత్మప్రభావము లేనిచో ఎట్టి వ్యవహారకలాపమును యుండదు.

1. బుద్ధి తీవ్రవేగమున పరుగిడుచు అన్యమనస్కమై యుండును.

2. ఆత్మ తేజోప్రభావితమైన 'బుద్ధి' ఆత్మయే యగుచున్నది. అట్టియెడ 'ఆత్మ' 'బుద్ధి' యను రెండింటియందును

వ్యత్యస్తమే లేదు. రెండును ఒకటియే యని నిరూపిత మగుచున్నది. మీా అభిప్రాయమేమి ?

మీారు పొరబడుచున్నారు. ఆత్మ వేఱు, బుద్ధి వేరు. ఆత్మయొక్క ఆభాసమాత్రమే 'బుద్ధి'.

శుద్ధ శ్వేతవర్ణము విద్యుత్కాంతి. హరిత నీల పీత రక్త వర్ణములుగల గాజుకుప్పెల (Bulbs) యందు విద్యుత్కాంతి ప్రసరించినపుడు అది స్వకీయమైన శ్వేతవర్ణమును గోల్పోయి హరిత నీల పీత రక్తవర్ణములుగానే గోచరించుచుండును. అటులనే ఆత్మతేజముచే నావరింపబడిన బుద్ధియు నని ఊహింపవలయును.

జాగ్రదాది అవస్థాత్రయమునందును బుద్ధి వివిధపరిణామముల నొందుచున్నది. కాని ఆత్మ యెట్టిమార్పును జెందుట లేదు. అది నిరంశమైన స్వచ్ఛమైన సర్వస్వతంత్రమైన అద్వితీయమైన సత్య తేజోజ్జ్వల జ్వాల.

3. శ్రు॥ స వా అయం పురుషో జాయమానః శరీరం అభి సంపద్యమానః పాప్మభిస్సృజ్యతే స ఉత్క్రామన్ మ్రియమాణః పాప్మనో విజహాతి॥

పాంచభౌతికమైన ఉపాధి గలిగిన 'జీవాత్మ' అనబడు పురుషుడు విషయలోలుడై పాపభూయిష్ఠమైన కార్యకారణములకు బాధ్యుడగుచున్నాడు. ఉపాధి విడిపోవును. కార్యకారణములును అంతరించును. కర్మఫలముమాత్రము ఒక బంధమై వెంటనంటియుండును. ఆ బంధము మర్గములోని కండె వలె అతనిని ఇహపరలోకములకు జననమరణవ్యాజమున త్రిప్పు



చుండును. కర్మఫల బంధవిమోచనమే ఈ గమనాగమనములను ప్రవేశ నిష్క్రమణలను నిరోధించును. జననమరణ బంధవిమోచనమే ముక్తి – మోక్షము అనబడును.

1. జాగ్రదాది అవస్థాత్రయమును బ్రహ్మాండమునందలి లోకత్రయములు అని చెప్పితిరిగదా ? దీని సమన్వయమెటులు?

## లోకత్రయము

ఇహము, స్వర్గము, పరము అని విశ్వజగత్తు మూడు భాగములుగా విభజింపబడినది. పాతాళము, మర్త్యము, స్వర్గము అనియు ఇవియే చెప్పబడుచున్నవి. చతుర్దశ భువనములందును ఇవి ముఖ్యములుగా పరిగణింపబడుచున్నవి. మనము నిత్యమును అనుభవించు జాగ్రత్స్వప్న సుషుప్తులు అను అవస్థాత్రయమునకు అనుగుణము సుబోధకార్థము – ఇహము, పరము, స్వర్గము అని లోకములు మూడుగా ఇట గ్రహింపబడినవి.

1. ఇహలోకము :— పాప పుణ్య ఫలభోగాస్పదమైన కర్మభూమి – ఇదియే భూలోకము. "విశ్వుడు" అనబడు జీవాత్మ కర్తృత్వాభిమానియై జన్మ జరా మరణ సదృశమైన వేదనను జాగ్రదవస్థయందు అనుభవించుచున్నాడు.
2. స్వర్గలోకము :— ఇది ఇహపరములకు కేంద్రస్థానము. స్వర్గాధిపతి ఇంద్రుడు. స్వప్నావస్థయందు ఇంద్రియములకు అధినేతయైన తైజసుడే ఇంద్రుడు. కర్మఫలము సరిగా అనుభవింపబడునది లేనిది పర్యవేక్షించు వృత్తి

ఇంద్రునిది. ఇతడే త్రిలోకాధిపతియనియు చెప్పబడినాడు. తైజసుడు సంకల్పవికల్పాత్మకమైనమనోరూపమున జీవుని గమనాగమనకార్యములను పర్యవేక్షించుచుండును.

3. పరలోకము :— శరీరపతనానంతరము సూక్ష్మశరీరముతో కర్మఫలము ననుభవించు భోగభూమి – దుఃఖభరితమైన నరకలోకము (పాతాళలోకము) గావచ్చును. ఆనంద నిలయమగు బ్రహ్మలోకము గావచ్చును. ఒక అనుభవముయొక్క పారమ్యత (అనధి) నొందుటయే 'సుషుప్తి' లోకముగా పరిగణింపబడినది. ఆత్మ ఇట ద్రష్టయై సాక్షిమాత్రముగానే నిర్లిప్తుడై యుండును.

స్వప్నజగత్తు మధ్యమ లోకమగు స్వర్గలోకము. ఇందలి అధినేత తైజసుడు. ఇతడు జాగ్రదవస్థయందలి జీవుని విషయ భోగముల గమనించుచు అవియే విషయములను అనుభవమునకు తెచ్చుకొనుచుండును. కనుక ఇహలోకచర్యలను పర్యవేక్షించుచున్నాడని చెప్పవచ్చును.

జాగ్రదవస్థయందును అనగా ఇహలోకమునందును చూడని వినని ఊహించని ఊహాతీతములును నైన విషయములను సహితము స్వప్నజగత్తున అనగా స్వర్గలోకమున (జీవుడు) తైజసుడు అనుభవించుచున్నాడు. కనుక ఇహలోకమునకు వ్యతిరిక్తమైన వేఱొకలోకము గలదని స్పష్టమగుచున్నది. అదియే పరలోకము. బ్రహ్మలోకము. సత్యలోకము. అందలి సౌఖ్యమును జీవుడు స్వప్నజగత్తునందు అనుభవించుచున్నాడు. కనుక ఇహ పరలోక సుఖదుఃఖముల ననుభవించు భోగభూమి



స్వప్నజగత్తు. అదియే స్వర్గము. తదధినేత ఇంద్రియములకు అధిపతియైన ఇంద్రుడు – తైజసుడు.

జాగ్రదాది అవస్థాత్రయమునకును లోకత్రయమునకును సమన్వయ మిదియే.

2. "మనస్సు మొదలగు ఇంద్రియములు సుషుప్తియందు నిష్క్రియములై నిరుపయోగము లగుచున్నవి. అవియేగదా చూచుటకును నియమించుటకును ఆత్మకు సాధనభూతములుగా నున్నవి. గాఢసుషుప్తియందు 'ఆత్మ' ఎటులు చూచుచున్నాడు? చూచుటకు శక్యముగాదు. అతని దృష్టి మందగించి అంధుడగుచున్నాడు." ఇది నా అభిప్రాయము. మీరేమందురు ?

మీరు పొరబడుచున్నారు. ఆత్మదృష్టికి అంధత్వ ప్రశంసయే లేదు. అతడు ద్రష్ట – చూచువాడు. చరాచరమైన విశ్వమున కతడే వెలుగును ప్రసాదించుచున్నాడు. సూర్యచంద్రాగ్నులకు అంధత్వము నెవరేని ఆపాదింతురా? ఆత్మ స్వప్రకాశాత్మకము. దృష్టి ఆత్మను వీడియుండదు. అతనికి దృష్టి తేజస్సే. కనుక గాఢసుషుప్తియందును చూచుచునే యుండును.

సుషుప్తియందు అవిద్య నశించగా పాలలో నీటివలె నీటిలో నుప్పువలె లీనమై ఏకమై స్వచ్ఛమై ద్రష్టయై అద్వితీయుడై 'పురీతత్' యను నాడీద్వారమున పరమాత్మను జేరిన జీవాత్మ తాదాత్మ్యమును జెందియుండును.

జీవాత్మయొక్క అప్పటి యా యద్వైత స్వస్వరూప స్థితియే – సర్వాత్మభావనా నిమగ్నతయే పరబ్రహ్మ ప్రాప్తి స్థానము. సర్వోత్కృష్ట శ్రీ శ్రియానందనిలయము.

ఆ మహదానందమునం దొక లేశమాత్రమును భుక్తము జేసికొని విశ్వజీవకోటి జీవించుచున్నది.

3. అగుచో సుషుప్తాత్మయే "అక్షరము, అమృతము, సత్యము" అని శ్రుతులచే నిర్దేశింపబడిన 'పరమాత్మ' అనియే అభిప్రాయమా? తాను ఇట్టివాడను అనిగాని, ఈ భూతములు ఇట్టివనిగాని సుషుప్త్యాత్మ తెలిసికొనుటలేదు. ఎట్టిభావములును లేక నిశ్చలముగా నిర్వికారముగా నుండును. కర్మ నియంతృత్వమును గూడ కలిగియుండదు. సర్వజ్ఞత్వము మరగియుండును. ఇది ఆత్మ యెట్లగును?

కాదు. అది నిశ్చయముగా ఆత్మ యని చెప్పబడుట లేదు. జాగ్రదాది అవస్థాత్రయమునందును ప్రవర్తించు 'ఆత్మ' వాస్తవికమైన ఆత్మగాదు. అది ఆత్మయొక్క ప్రతిబింబము. 'ఛాయాత్మ' యనబడును.

అవస్థాత్రయమును కూడ అధిగమించిన తురీయావస్థ యొండు గలదు. అందలి ఆత్మయే "ఊర్ధ్వమూలము" అని శ్రుతులచే వర్ణింపబడినది. అదియే జగత్కారణము. సర్వజ్ఞత్వ సర్వస్వతంత్రత్వ సర్వకర్తృత్వ సర్వనియంతృత్వాది ఐశ్వర్య సమన్వితమై యుండును.

4. ఈ తురీయాత్మ ఎచట నున్నది? దానిని పొందు మార్గ మెయ్యది? ఎటుల ఉపాసింపవలయును?

మన ఈ శరీరము పాంచభౌతికమైనది. దీనికి పతనము సిద్ధము. అది ఎప్పుడు, ఏ స్థితిలో, ఏ క్షణమున, ఎచట, ఎటుల సంభవించునో మనకు తెలియదు.



"శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్"

—కుమారసంభవము.

పురాకృత కర్మఫలమును అనుభవించుచునే సద్గురూపదిష్టమార్గమున వేదోక్తకర్మానుష్ఠాన మాచరించుచు స్వస్వరూపానుభవము నొందుటకు సాధనముగా మాత్రమే ఈ శరీరమును ఉపయోగించుకొనవలయును.

శ్రు॥ దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవః సదాశివః ।
త్యజే దజ్ఞాన నిర్మాల్యం 'సోఽహం' భావేన పూజయేత్ ॥

ధర్మసాధన కుపయోగింపబడు ఈ స్థూలదేహమే ఒక పవిత్ర దేవాలయమని చెప్పబడినది. ఇందు వసించు మాయా శబలితమైన జీవాత్మయే 'పరంజ్యోతిస్వరూపమగు ఆత్మ'. ఆ పరంజ్యోతి స్వరూపమే "సోఽహం". అదియే 'నేను' అను భావమున ఉపాసింపదగినది.

ఉపాసించుట యనగా ఇతరమైన జ్ఞానములేక కేవలము సజాతీయ జ్ఞానప్రవాహరూపముగ భావించుట.

శ్రు॥ దహ్రం విపాపం పరమేశ్మభూతం
యత్పుండరీకం పురమధ్య సగ్ంస్థమ్ ।
తత్రాపి దహ్రం గగనం విశోక
స్తస్మిన్ యదన్త స్తదుపాసితవ్యమ్॥

—తైత్తిరీయోపనిషత్తు.

శ్రు॥ యదిదం అస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరేస్మిన్ అన్తరాకాశః తస్మిన్ యదన్తః తత్ అన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్యమ్॥ —ఛాందోగ్యోపనిషత్తు.

శరీరము ఒక దేవాలయము. అందు ప్రాణాట్టము చైతన్య శక్తి 'దహ్రాం'. అనగా అతిసూక్ష్మమైన హృదయకమలము గలదు. "తత్రాపి దహ్రాం" ఆ హృదయకమలముకంటెను అతి సూక్ష్మమై పరమాణు సదృశమై నిరవయవమై జన్మ జరా క్లేశ మోహ బంధ శోకవిరహితమైన పరమాత్మ పరంజ్యోతిస్వరూప మున "తస్మిన్ యదంతః" ఆ హృదయకమలాంతర్భాగమున ప్రకాశించుచున్నది. "తదుపాసితవ్యం" ఆ సదాశివతత్త్వమే అనంతకల్యాణగుణ సముపేతమైన ఉజ్జ్వల దివ్యతేజమే ఉపా సింపదగినది. తపోనిష్ఠచే తెలిసికొనదగినది. 'సోఽహం' భావ మున పూజింపదగినది. తపస్సు అనగా నేమి ?

శ్లో॥ కోఽహం? ముక్తిః కథం? కేన సంసారం ప్రతిపన్నవాన్?
ఇత్యాలోచన మర్థజ్ఞాః తపశ్శంసన్తి పండితాః॥

— సూతసంహిత.

'నే నెవడను ? ముక్తి యన నెట్టిది ? ఈ సంసారబంధ మెటుల గలిగినది ? ఈ విషయమగు జిజ్ఞాసయే పరిశీలనయే 'తపస్సు' అనబడును' అని పండితులు నిర్వచించినారు.

'ఖం బ్రహ్మేతి వ్యజానాత్' —తైత్తిరీయోపనిషత్తు.

ఆకాశమే బ్రహ్మము. శోకరహితమైనది గగనశబ్దవాచ్య మగు బ్రహ్మము. దేహమను దేవాలయమునందలి గర్భగుడి యందు దహరాకాశమునందు బ్రహ్మమే, పరంజ్యోతి స్వరూప మగు ఆత్మయే ప్రతిష్ఠితమైయున్నది.

"తద్విజిజ్ఞాసస్వ" "తద్బ్రహ్మేతి" —ఛాందోగ్యోపనిషత్తు.



అని శ్రుతులు నిర్దేశించు ప్రజ్ఞానఘనస్వరూప మదియే. అదియే అన్వేషించి తెలిసికొనదగినది. 'సోఽహం' అదియే 'నేను' అను భావమున ఉపాసింపదగినది. పూజింపదగినది.

ప్రియాప్రియములయందు మోదఖేదములను, ధర్మాధర్మములయందు శాంతి క్లైబ్యములను సంయోగవియోగముల యందు ఆశానిరాశలను జీవాత్మ పొందుచు ప్రచండవాతప్రచలితమైన ధ్వజపటమువోలె ఒకచో స్థిరతలేక స్వస్వరూపజ్ఞాన మును బడయలేకున్నాడు. శోకమోహావిష్టుడై అలమటించు చున్నాడు.

జీవుని ఈ అశాంత దుర్భర శోచనీయపరిస్థితికి మూల కారణములు – అవిద్య; అజ్ఞానము; కారణశరీరము. ఉదాహర ణార్థము స్వస్వరూపవిస్మృతి (అవిద్య) గ్రీష్మఋతువుగాను, స్వస్వరూపజ్ఞానము (విద్య) వర్షఋతువుగాను గ్రహింపబడు చున్నవి.

గాలి (వాయువు), తెలిమబ్బు, మెఱుము ఇవి మూడును వేసవియందు అశరీరములై యుండి ఆకాశమునం దణగి మరగి స్వస్వరూప విస్మృతినొంది అజ్ఞాతముగా ఒక నియమితపరిధిలో నిలిచియుండును.

ఇవి వర్షఋతువునందు పరంజ్యోతిస్వరూపుడైన సూర్య తేజస్సంపర్కము నందును. అపుడు ధూమ జ్యోతి సలిల మరుత్తులు సంయోగమై రసాయనిక (Chemical) పరిణతి నంది ఒక స్వరూపము నేర్పరచుకొనను అపుడే వానికి పూర్వస్మృతి గలిగి స్వస్వరూపజ్ఞాన మేర్పడి చైతన్యవంతము లగును.

అట్టియెడ మరుత్తు (వాయువు) ప్రచండవేగమున పరవళ్లు త్రొక్కుచు మహోద్ధృతముగా లేచి మహావృక్షములను సహితము అవలీలగా సమూలముగా పెకలించివైచును. మహా ప్రాకారములను, సౌధములను పునాదులతోఁకూడ కదల్చి నేలమట్టము చేయును. ధూళి దూసరములతోఁ నింగిని మంటిని ఏకముచేయును. ఇతఃపూర్వము చీలిపోయి పిశాపికలై ఖండఖండములైన తెలిమబ్బు తునకల నొకచోఁ చేర్చి ఒక స్వరూపమును కల్పించును.

అటుల మరుత్తులచే రూపకల్పన చేయబడిన తెలిమబ్బు మొదట నీలిమనొంది పిమ్మట హారిత పింగళ లోహిత ధూమ్రవర్ణ సంకలితమై ఆపైని చక్కని చిక్కని నల్లని భీకరరూపమును ధరించి సమీరకుమారుని సాహచర్యభాగ్యమును వడసి తండ్రిని (సూర్యుని) ధిక్కరించి అహంకరించి ఒడలు పెంచి దిక్కుల నాక్రమించి, గ్రహగణముల నధిగమించి, త్రివిక్రమావతారమున భయదభీకర గర్జానినాదములతోఁ దిక్కులు ప్రతిధ్వనులీనుచుండ ఉల్కాపాత నెపమున కనుల నిప్పులు కురియించుచు తటిత్కాంతులచే నెటగాంచిన తానేయై ఘామదేవతను వెంటాడి తరిమి హిమగిరిసానువుల కాపుండ నియమించును.

శ్రు॥ పర్జన్యాయ ప్రగాయత । దివస్పుత్రాయ మీఢుషే ।
సనోయ వస మిచ్ఛతు॥ ఇదం వచః పర్జన్యాయ స్వరాజే ।
హృదో అస్త్వన్తరం తద్యుయోత । మయోభూర్వాతో
విశ్వకృష్టయస్స న్త్వస్మై । సుపిప్పలా ఓషధీ ర్దేవగోపాః॥
యోగర్భ మోషధీనాం । గవాం కృణోత్యర్వతాం ।
పర్జన్యః పురుషీణాం॥ —తైత్తిరీయారణ్యక అరుణోపనిషత్తు.



అనావృష్టిచే బాధితులైన కృషీవలులు (అనగా సమస్త మానవులును) కృష్ణమేఘుని మహిమ నిటుల వర్ణించుచు ఋత్విక్కులకు చెప్పుచున్నారు.

"స్వరాజే పర్జన్యాయ ఇదం వచః హృదంతరస్తు"

పూజ్యులారా! మా యీ పర్జన్య ప్రార్థనావాక్యములను సావధానులరై ఆలకింపుడు.

బ్రహ్మమగు ఆకాశమునం దుద్భవించిన పరంజ్యోతి స్వరూపుడు మేఘుడు. అతడు దయాసముద్రుడు. తద్రసముచే నార్ద్రమైనది పృథివి. కనుకనే పృథివి ఓషధి వనస్పతులచేతను, వ్రీహ్యాది నీవారధాన్యములచేతను, ఫల పుష్ప తరు లతా గుల్మములచేతను సుసంపన్నమై సుశోభితమై జీవనప్రదమై ఐహికాముష్మిక భోగభాగ్యసాధన క్రియోపకరణమగుచున్నది.

"సుపిప్పలా ఓషధీ ర్దేవగోపాః"

సుమధుర ఫలములచేతను, ఓషధులనుండి గ్రహింపబడిన సోమరసముచేతను, హవిస్సురూపమునను దేవగణములకును కృష్ణమేఘుడు జీవనసంధాత యగుచున్నాడు. ఇంతియే గాదు —

"పర్జన్య పురుషీణాం గర్భం కృణోతి॥"

క్షీరనీరాదులచేతను, ఓషధి వనస్పతులచేతను, షడ్రసోపేతమైన ఆహారాదికముచేతను పరిపుష్టమై ప్రవర్ధమానమగునది మన యీ స్థూలశరీరము. ఈ కోశమునందు శుక్లశోణిత రూపమున ప్రవేశించిన పర్జన్య=కృష్ణమేఘుడు, పురుషీణాం=స్త్రీలకు,

గర్భం కృణోతి = సంతానప్రదమగు గర్భధారణహేతువు అగుచున్నాడు.

లోకత్రయమునకు కల్యాణప్రదు డతడు. 'తస్మాత్ - పర్జన్యాయ - ప్రగాయత' = కృష్ణమేఘుని స్తోత్రము చేయుడు, సమస్తారిష్టములును శాంతించును.

ఒక్క మేఘుడేగాదు, అతని ఆంతరంగిక మిత్రుడగు వాతః = వాయువు 'అస్మై మయోభూః భవతు' సుఖములను కలిగించునుగాక !

తప్తహృదయములతో శుష్కహస్తములు చాచి నింగివైపు దృష్టిసారించి ఏకాగ్రచిత్తమున క్షామపీడితులైన కర్షకసంఘముచే ఋత్విఙ్ముఖమున ప్రార్థింపబడిన కృష్ణమేఘుడు - ఆర్ద్రహృదయుడై, కనులు చెమ్మగిల, అశ్రుధారాపాతమున అనుగ్రహించి గాఢపరిష్వంగమున విశ్వజీవకోటి నాదరించును.

ఈ విధముగా గ్రీష్మమున స్వస్వరూపవిస్మృతి నొంది ఆకాశమునం దణగి మరగియుండిన తెలిమబ్బు ధూమ జ్యోతి సలిల మరుత్సంయోగమున పరంజ్యోతి సంపర్కము నొంది (స్వస్వరూపజ్ఞానము నొంది) కృష్ణమేఘమై, త్రైలోక్య పూజ్యమై ఆరాధ్యదైవమైనది.

'ఏతావానస్య మహిమా' ఆత్మయొక్క సామర్థ్యమిట్టిది.

సద్గురూపదేశమే పరంజ్యోతి సంపర్కమును అనుసంధానించును. సత్సాంగత్యము, సాధుసేవ, సద్గ్రంథపఠనము, సత్కర్మాచరణము - మేఘునకు నెచ్చెలియగు సమీరకుమార



సదృశములు. ఏతత్సంయోగము సాధకునకు స్వస్వరూపజ్ఞానహేతువు.

1. సత్సాంగత్యము, సాధుసేవ, సద్గ్రంథపఠనము, సత్కర్మాచరణము ఇవి సాధకునకు వివేకోదయమును కలుగజేయుచున్నవి. శోక మోహ క్లేశ బంధవిముక్తికి దోహదము లగుచున్నవి. యుక్తాయుక్త పరిజ్ఞానమును, ధర్మాధర్మ విచక్షణాధికారమును, సత్యాసత్య వస్తునిర్ణయమును జేయ తోడ్పడుచున్నవి. ఈ మార్గమున పయనించి గమ్యస్థానము చేరజాలమా? ఇక సద్గురూపదేశము దేనికి ? దానివలన మనకు కలుగగల ఉపయోగమేమి ? మనము చదివినది, వినినది, తెలిసికొనినది యగు వీని సారాంశమేకదా సద్గురూపదేశసారమును ? బంధవిముక్తిని గోరు మనము మరల నీ కొత్తబంధము నెందుకు తగిలించుకొనవలయును ? గమ్యమును చేరుటకు స్వశక్తి చాలదా ?

ఇది మంచిప్రశ్న. సహేతుకముగనే యున్నది. కాదనను. కారణజన్ములగు కొందరు మహనీయులు మాత్రమే అట్టి శక్తిసంపన్నులు కాగలుగుచున్నారు. ఈ సూత్రము సర్వసాధారణముగా అందరికిని వర్తింపదు. సద్గ్రంథములు అనగా వేదములు (శ్రుతి స్మృతి పురాణేతిహాసములు ఇందు చేరినవే) వాని అంతములు అనగా సారాంశములు ఉపనిషద్వాక్యములు. అట్టివానిని పఠించుటచేత సంసారనివర్తకమగు జ్ఞానోదయ మగుచున్నది. సత్సాంగత్యమువలన బాహ్యవిషయ సుఖలంపటత్వమునందు విరక్తి గలుగుచున్నది. సాధుసేవవలన త్యాగశీల మలవడుచున్నది. సత్కర్మానుష్ఠానముచేత చిత్తశుద్ధి గలుగుచున్నది.

సాధకుని యీ స్థితి ఉషఃకాల సదృశము. అప్పటి వెలుగునం దింకను అంధకారఛాయలు ఆవరించియే యుండునుగదా ?

చిత్తశుద్ధి అలవడినదేగాని కర్మఫల మపేక్షింపబడుచునే యున్నది. త్యాగశీలమునం దింకను మాలిన్యము పచ్చని ఆకులోని తల్లిఈనెవలె విడరాని అనుబంధమును కలిగియే యున్నది. బాహ్యావిషయవైముఖ్య మేర్పడినదేగాని ఆముష్మిక భోగభాగ్యములకై మనస్సు పరవళ్లు త్రొక్కుచునే యున్నది. ఉపనిషద్వాక్యములు సహితము విభిన్నదృక్పథముల సూచించుచు శృంగాటకమునకు చేర్చి కింకర్తవ్యతావిమూఢుల జేయుచున్నది. గమ్యస్థానమునకు జేర్చు సువిశాలరాజపథము గోచరించుటలేదు. కనుక సాధకుడు సంశయగ్రస్తుడై తర్క వితర్కములతో వృధా కాలవ్యయమును జేయుచు జీవబ్రహ్మైక్య లక్షణమును పొందలేకపోవుచున్నాడు.

మనము ఆర్జించిన జ్ఞానమునందలి మాలిన్యమును తొలగించుకొనుటకు అనుభవజ్ఞుడైన సద్గురుపాదముల నాశ్రయింపక తప్పదు. అతడే మనలను గమ్యస్థానమును జేర్పగల సమర్థుడు.

గురు డెట్టివాడై యుండవలయును ?

శ్రు॥ వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థాః,
సన్న్యాసయోగాద్యతయ శ్శుద్ధసత్త్వాః
తే బ్రహ్మలోకేతు పరాంతకాలే
పరామృతాత్పరిముచ్యంతి సర్వే॥
— తైత్తిరీయోపనిషత్తు.



వేదాంతములు అనగా ఉపనిషద్వాక్యములు. వానిని ఆచార్యుని సమీపమునందే పఠింపవలయును. స్వయంకృషి ఆశించిన ఫలితమునీయదు. ఉపనిషద్వాక్యవివరణమును గురుముఖమున వినినపుడే జీవబ్రహ్మైక్యలక్షణము ప్రాప్తించును. గురునిచిత్తము సునిశ్చితమై గమ్యస్థానమును ఇట్టె అవలీలగా ఎట్టి ప్రయాసము లేకుండగనే చేర్చును.

సన్న్యాసయోగము అనగానేమి ?

తలలు బోడిచేసికొనుట; కాషాయాంబరములు, దండ కమండలములు, రుద్రాక్షమాలలు ధరించుట సన్న్యాస మనిపించుకొనదు. బోడికావలసినవి తలలుగావు; తలపులు. ధరించవలసినవి కాషాయాదులు గాదు; సత్యాహింసలు. సన్న్యసించవలసినది ఆలుబిడ్డలను గాదు; కర్మఫలమును.

యోగమనగా విషయసుఖములను అనుసంధానించుట గాదు. దారాపుత్రాదులయందు ప్రేమవాత్సల్యములను నెరపుట గాదు. చిత్తవృత్తిని నిరోధించుట విషయభోగముల కభిముఖముగా కోతివలె పరుగిడు మనస్సును ఒకచో నిలువరించుట, జీవాత్మను పరమాత్మయెడ అనుసంధానించుట ఇట్టికృషియందు ఉత్తీర్ణుడై జయపతాకధరించిన మహనీయుడే తేజస్వియే వాస్తవమైన గురుడు.

పరాంతకాల మనగా నేమి ?

అవిద్య ఈషన్మాత్రముండినను స్వయంకృషిచే నార్జించిన ఉషఃకాలీనసదృశజ్ఞానముండినను అది పునర్జన్మహేతువే యగు

చున్నది. అట్టి అపరిపక్వజ్ఞానము నార్జించిన సాధకుని అంత కాలము అనగా మరణసమయము దేహప్రాప్తిహేతువై "అపరాంతకాలము" అనబడుచున్నది.

అజ్ఞానము పూర్తిగా నశించగా స్వస్వరూపజ్ఞానము కలుగును. అట్టి సాధకుని 'అంతకాలము' అనగా మరణసమయము పరాంతకాలము అనబడును. అతనికి పునర్జన్మ యనునది యుండదు. పరంజ్యోతిస్వరూపుడైన ఆ మహనీయునకు దేహప్రాప్తికి అవకాశమే యుండదు.

తే సర్వే = అట్టి స్వరూపము నార్జించిన మహనీయులు అందరును, బ్రహ్మలోకేతు = ఆత్మ (బ్రహ్మ) సాక్షాత్కారము కలిగిన తరువాత, పరాన్తకాలే=మరణసమయమునందు, పరామృతాత్ =అవ్యక్తమునుండి అనగా (అవ్యాకృతము) మహామాయనుండి, పరిముచ్యంతి = విడువబడుచున్నారు. బంధవిముక్తులగుచున్నారు.

1. ఇందు విశేషమేమున్నది? అజ్ఞానులునైతము ప్రళయసమయమున స్థూలసూక్ష్మశరీరములను విడుచుచునే యున్నారు గదా? ఇక జ్ఞానులకును, అజ్ఞానులకును భేదమేమి?

అజ్ఞానులకు స్థూల సూక్ష్మ శరీరములు రెండుమాత్రమే నశించుచున్నవి. కాని ప్రళయసమయమునందును నశింపని మూడవశరీరము ఒకటి ఉన్నది అని మీరు మరచుచున్నారు. అదియే కారణశరీరము. అది నశించుటలేదు. అది పరమాణుసదృశమై అస్పష్టరూపమై అణగి మరగియుండి పునస్సృష్టియందు కర్మఫలభోగార్థమై దేహధారణ మొనర్చుచున్నది. జ్ఞానులు



మాత్రమే పరాంతకాలమునందు కారణశరీరబంధనమునుండియు "ఉర్వారుకమివ బంధనాత్" పరిపక్వమైన దోసపండు తొడిమ నుండి విడివడినటుల విముక్తులగుచున్నారు.

అజ్ఞానులకును, జ్ఞానులకునుగల అంతరమిదియే. యతుడు అనగా నెవరు?

విషయసుఖలోలుడగు జీవాత్మకన్న వేరైనవాడు, ఆత్మజ్ఞానముచేత పరమాత్మస్వరూపమునందు లీనమై ఏకమై సర్వజగత్కారణుడై కరచరణాద్యవయవములతో మనలో నొకడై మనశ్రేయోభిలాషియై సంచరించు తేజస్సంపన్నుడైన గురుడు.

'అమృతుడు' అనగా నెవరు?

మరణరహితుడు, తత్త్వజ్ఞానముచేత మృత్యువును జయించినవాడు. అజ్ఞానము, అమృతత్త్వమును సాధింపనేరదు.

సారాంశము:— ఆచార్యుడు (గురుడు), నియమశీలుడు, చిత్తశుద్ధిగలవాడు, సర్వకర్మఫలత్యాగి, విజ్ఞానఖని, సునిశ్చితమైన దృక్పథముగల దృఢవ్రతుడు. పరమాత్మయందు ఐక్యతను సాధించినను మనలో నొకడై మనశ్రేయోభిలాషియై నిరంతరము సుఖదుఃఖములలో పాల్గొనుచుండును.

శ్రు॥ తద్విష్ణోః పరమంపదం సదా పశ్యంతి సూరయః దివీవ చక్షురాతతమ్ । తద్విప్రాసో విపన్యవో జాగృవాం సస్సమింధతే విష్ణోర్యత్ పరమం పదమ్॥

సర్వవ్యాపకమైన సచ్చిదానందపరబ్రహ్మమును మాయాప్రపంచభావమును సన్యసించిన బ్రహ్మవిద్యానిష్ణాతులు స్వస్వ

రూపముగానే భావించి ఆత్మానందానుభూతిని బొందుచున్నారు. పరమాత్మ ఆకాశమువలె సర్వత్ర వ్యాపించియున్నాడు. అతడు పిపీలికాది బ్రహ్మపర్యంతము సమస్త జీవసంఘమునందును సాక్షిమాత్రముగా నుండి నేత్రము సకలరూపములను ఎరుగునటుల దేహేంద్రియాదిసమస్తప్రపంచమును ఎరుగుచున్నాడు. అహంకార మమకారములకు తిలోదకములిచ్చిన ఆత్మవేత్తలు పరమాత్మను స్వస్వరూపముగానే గుర్తించి తాము తమకులబ్ధమైన ఆత్మానుభూతిని మరుగుపడనీయక విస్మరింపక నిగ్రహించి అధిగమించి మాయాప్రపంచస్ఫూర్తిని గడించి ఆరోహణ అవరోహణ క్రమమున సర్వాత్మభావముతో అద్వైతదృక్పథముతో సమత్వ దృష్టితో వ్యవహరించుచున్నారు.

ఇట్టి మహామాహిమాన్వితుడు ఆచార్యుడు.

శ్రు॥ ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యం కదాచన,
ప్రమాదో మృత్యురిత్యాహుః విద్యాయాం బ్రహ్మవేదినః
యథాఽప కృష్టం శైవాలం క్షణమాత్రం న తిష్ఠతి
ఆవృణోతి తథా మాయా ప్రాజ్ఞం వాపి పరాఙ్ముఖమ్॥

— అధ్యాత్మోపనిషత్తు.

తటాకజలములపై నావరించిన శైవాలమును (అనగా నాచును, పాచిని) దూరముగా నెట్టివైచి నిర్మలజలమును మాత్రమే మనము గ్రహించుచున్నాము. మనచే దూరముగా త్రోసివేయబడిన శైవాలము అటులనే త్రోసివేయబడిన ప్రదేశమునందే నిలచియుండుటలేదు. మరల అది వచ్చి జలముపై యథాపూర్వముగా నావరించుచునే యున్నది.



అటులనే ఎంత దిట్టయైన ఆత్మవేత్తయే యగుగాక – మహామహిమాన్వితుడే యగుగాక – 'ఇనుపకచ్చడ'మును బిగించిన జితేంద్రియుడే యగుగాక – ఆత్మానుసంధానమునందు 'చింతాకంత' పరాకుగానుండెనేని బ్రహ్మనిష్ఠయందు 'ఆవంత' పరాఙ్ముఖుడయ్యేనేని, జలమును శైవాలమువలె, ఆవరణ విక్షేపరూప గాఢతమస్సు తత్క్షణమే అతనిని ఆవరించి గ్రసించి జననమరణరూప గర్భనరకకుండమున కూలద్రోయును.

సర్వసాధారణముగా మన ఎల్లరికిని ప్రాప్తించు అవసాన కాలము వాస్తవమైన మృత్యువు కాదు. సూర్యోదయాస్తమయములవలె అది ప్రకృతినియమిత సిద్ధాంతము. ఒక అనూచాన ధర్మము. ఇందు విశేషాంశము ఎట్టిదియును లేదు.

ఆత్మానుసంధానమును మఱచుటే ఘోరమృత్యువు. బ్రహ్మనిష్ఠా పరాఙ్ముఖత్వమే భయంకరమృత్యువు. ఈ ఘోర ప్రమాదమును గుర్తెరింగి అనుష్ఠానమునందు అప్రమత్తులై "తద్విష్ణోః పరమం పదం దివీవ చక్షురాతతం సదా పశ్యంతి సూరయః" ఆత్మవేత్తలు తైలధారాసదృశమైన అవిచ్ఛిన్నమైన సంధానమును చేయుచున్నారు. ఇట్టి అగ్రశ్రేణికి జెందినవాడే ఆచార్యుడు.

శ్రు॥ యద్దృశ్యం తన్నశ్యం దృశ్యం సర్వమనాత్మేతి।
దృగేవ పరమాత్మా॥

ఈ పరిదృశ్యమాన చరాచరజీవకోటి సర్వమును ఎప్పుడో ఒకప్పుడు రూపు మాసిపోవునదే. ఇది అంతయు అసత్యము. అసత్తు. సద్రూపమైన సర్వసాక్షియైన ఆత్మ ఒక్కటియే

ఎప్పటికిని నశించనిది. అది నిత్యపరిపూర్ణము. త్రికాలాతీతము. తదన్యమైనది, ఉత్కృష్టమైనది వేఱొండు లేనే లేదు. 'న భూతో న భవిష్యతి' ఇతఃపూర్వము లేదు ఇప్పుడు కానము. భవిష్యత్తునందును ఉండబోవదు. ఇది సత్యము. ఇట్టి దృఢసంకల్పముతో స్థిరనిశ్చయముతో ఆత్మానుసంధానమును జేసి ఆనందానుభూతిని బొందు పరమవిజ్ఞానియే ఆచార్యుడు.

శ్రు॥ బ్రహ్మణః పరమాత్మనః విద్యా బ్రహ్మవిద్య॥

అదృశ్యము, అక్షరము, అగ్రాహ్యము, సర్వగతము, అగోత్రము, అవర్ణము, అచక్షుశ్శ్రోత్రము, అపాణిపాదము, నిత్యము, సర్వగతము, విభువు, సుసూక్ష్మము, అవ్యయము, భూతయోని ఇత్యాది విశేషణవిశిష్టమైన సత్యస్వరూపము ఆత్మ. తత్సంబంధమైన విద్య 'ఆత్మవిద్య' అనబడుచున్నది. ఆత్మవిద్యయే 'బ్రహ్మవిద్య' 'శ్రీవిద్య' యను నామాంతరములు గలిగియున్నది. ఈ విద్య పరంపరాగతమైనది.

"పరస్మాత్ పరస్మాత్ అపరేణ ప్రాప్తా పరావరా" గురుశిష్య పారంపర్యముగా ఒకరినుండి మరియొకరికి శాస్త్రోక్త శిష్టసంప్రదాయసరణిని పొందబడు బ్రహ్మవిద్యకే 'పరావర' విద్యయనియు నామము గలదు.

పరంపరాగతమైన బ్రహ్మవిద్యను అధ్యయనశ్రుతార్థ సంపన్నుడైన, ఆత్మనిష్ఠాగరిష్ఠుడైన గురుముఖమున గ్రహించి సాధనచేసి జయపతాక నంది జగద్గురుపీఠము నధిష్ఠించిన ఆచార్యులే బ్రహ్మవేత్తలు. విద్యార్థులకు ఆశ్రయణీయులు.



శ్లో॥ యత్రోపరమతే చిత్తం నిరుద్ధ యోగసేవయా,
యత్ర చైవాత్మ నాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥
— భగవద్గీత.

యోగాభ్యాస సామర్థ్యవిశేషమున నివాతప్రదీప సదృశ ఏకాగ్రచిత్తమును, సమాధిపరిశుద్ధాంతఃకరణమును, పరంజ్యోతి స్వరూపమైన పరమాత్మచైతన్యమునందు జ్ఞానప్రవాహరూపమున ఐక్యమొందించి తాదాత్మ్యమును జెంది శ్రియానందమున శ్రియానందుడై విలసిల్లు పరమవిజ్ఞానియే ఆచార్యుడు.

బ్రహ్మవిద్యకు మూలపురుషు డెవ్వడు ?

శ్రు॥ బ్రహ్మ దేవానాం ప్రథమస్సంబభూవ। విశ్వస్యకర్తా।
భువనస్య గోప్తా॥ — ముండకోపనిషత్తు.

అతడు అయోనిజుడు. స్వయంభువు. ధర్మజ్ఞాన వైరాగ్యాది షడ్గుణైశ్వర్య సముపేతుడు. దేవగణములలో జ్యేష్ఠుడు. అగ్రేసరుడు. విశ్వస్రష్ట. 'భువనస్య గోప్తా' చతుర్దశ భువనములకును సంరక్షకుడు. అతడే బ్రహ్మ. అతడే 'బ్రహ్మ'యను పేర విఖ్యాతుడు. చతుర్ముఖుడు.

"బ్రహ్మణావా అగ్రజేన ఉక్తా ఇతి బ్రహ్మవిద్యా॥"
— చతుర్వేదసారము.

ఆత్మవిద్య అగ్రజుడైన బ్రహ్మచే ప్రతిపాదింపబడినది, ఉపదేశింపబడినది. కనుక బ్రహ్మపేరనే 'ఆత్మవిద్య' 'బ్రహ్మవిద్య' యనబరగినది అనియు చెప్పనగును.

'బ్రహ్మవిద్య' యని మహాశ్లాఘించుచున్నారు. ఇదిగాక వేఱొండు 'విద్య'కూడ గలదా యేమి ?

లేకేమి ? అవధరింపుడు—

శ్రు॥ ద్వేవిద్యే వేదితవ్యే ఇతిహస్మ ।
యత్ బ్రహ్మవిదో వదంతి ‘పరా’చైవా పరాచ॥

—ముండకోపనిషత్తు.

ద్వేవిద్యే వేదితవ్యే = మనమందరమును తెలిసికొన దగిన విద్యలు రెండు తెఱగులుగా నున్నవి. “పరాచైవా పరాచ” అందు ఒకటి ‘పర’ అనియు, రెండవది ‘అపరా’ యనియు పిలువబడుచున్నవి. ఇతిహ = ఇటులని, బ్రహ్మవిదః = ఆత్మ వేత్తలు, వదంతిస్మ = చెప్పిరి.

ఋగాది చతుర్వేదములు; శిక్ష, వ్యాకరణము, కల్పము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము అను తదంగములును; అపర విద్యకు సంబంధించినవి.

కర్త్రాది సాధనక్రియా ఫలభేదరూపము అపర విద్య. ప్రకృతినైజమగు అవిద్యా కామకర్మదోషపంకిలము అపరవిద్య. పునరావృత్తికారణభూతము అపరవిద్య.

తదన్యమైనది ‘పర’విద్య. అదియే బ్రహ్మవిద్య. అదియే ఆత్మవిద్య. అదియే శ్రీవిద్య.

ప్రజ్ఞానఘనస్వరూపమగు పరమాత్మతత్త్వమును బోధించునది పరవిద్య. జన్మ జరా మరణ క్లేశ శోక మోహ బంధ విచ్ఛేదనసమర్థమైనది పరవిద్య. నిరంశమైన స్వస్వరూప పరంజ్యోతి శ్శిఖామధ్యమునం దైక్యత సాధించుటయే అవధిగాగలది పరవిద్య. స్వాత్మప్రతిష్ఠయే, సత్యప్రతిష్ఠయే, చిత్ప్రతిష్ఠయే,



ఆనందప్రతిష్ఠయే నిష్ఠగాగలది, లక్షణముగాగలది పరవిద్య. విద్యయను సార్థకనామము పరవిద్యకే చెల్లును. అపరవిద్య - ‘అవిద్య’ యనదగును. పరవిద్య నాశ్రయించి గమ్యస్థానమును నిశ్చయముగా చేరవచ్చును.

అపరవిద్య నాశ్రయించి స్వర్గాది సత్యలోకపర్యంతము పయనింపవచ్చును. దానిశక్తి అంతవరకే పరిమితము. అవిద్య నిషిద్ధకర్మల చేయ ప్రేరేచి సాధకులకు మిథ్యాభ్రాంతి కల్పించి ఒక్కొకయెడ నరకాది అధోలోకములకును యాత్రచేయించును. ఇందు అతిశయోక్తి యేమియును లేదు. ఇది సత్యవాక్కు.

చతుర్వింశతి తత్త్వవికారములలో ఏఒక్కటియు ఆసంతైనను మిశ్రితముగాక నిరంశమై స్వచ్ఛమై శుద్ధమై సత్యమై నిత్యమై అక్షతమై అక్షరమై అమృతమై నిరతిశయమై పరమాంశరూపమున స్వప్రకాశాత్మకమై భాసించుచున్నది ఆత్మ. కనుక తత్సంబంధమైన బ్రహ్మవిద్యయు అతిసూక్ష్మమైనది. అట్టి సూక్ష్మమైన పరవిద్యాప్రాప్తికి ఆచార్యుని పదకమలముల నాశ్రయింపక తప్పదు.

ఎట్టి ఉద్దండపండితుడైనను, యజ్ఞయాగాదు లొనర్చి సోమపానముచేసిన మహామహులైనను స్వతంత్రించి సాహసించి ఆత్మవిచారణ చేయతగదు. అది శిష్టసాంప్రదాయముగాదు. సాంప్రదాయము ననుసరించుట గౌరవించుట సభ్యలక్షణము. అదియే తరణోపాయము. ధిక్కరించుట, సాహసించుట మరణోపాయము. ఇది సత్యవాక్కు.

భగవతి శ్రుతి ఎలుగెత్తి ముక్తకంఠమున ఏమని చాటుచున్నదో ఒకింత సావధానులరై ఆలకింపుడు.

శ్రు॥ ఉత్తిష్ఠత! జాగ్రత!
ప్రాప్యవరా న్నిబోధత
క్షురస్యధారా నిశితా దురత్యయా
దుర్గం పథం తత్కవయోవదన్తి॥ — కఠోపనిషత్తు.

శ్రు॥ పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో
నిర్వేద మాయా న్నాస్త్యకృతః కృతేన
తద్విజ్ఞానార్థం స గురుమేవాభి గచ్ఛేత్
సమిత్పాణి శ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥

శ్రు॥ తస్మై స విద్వా నుపసన్నాయ సమ్యక్
ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ
యేనాక్షరం పురుషం వేదసత్యం
ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్॥
— ముండకోపనిషత్తు.

కవయః వదంతి = పండితులు చెప్పుచున్నారు. ఏమని?

తత్ పథం = ఆత్మతత్త్వస్వరూప నిరూపణ మార్గము — అనగా పరవిద్య. దుర్గం = చేర శక్యముగానిది.

"యథా క్షురస్యధారా నిశితా దురత్యయా"

వాడిగల కత్తియొక్క అంచువలె సూక్ష్మమై కరుకైనది కనుకనే, దురత్యయా=పాదములతో నడచి, గమ్యమును చేరుటకు శక్యముగానిది. పదునైన కత్తియంచుపై నడచుట ఎటుల అసంభవమో, అటులనే అపరవిద్య నాశ్రయించి తదుక్తపథము ననుసరించి గమ్యస్థానమును చేరుటయు అసంభవమే యగును. అశక్యమే యగును.



అగుచో పరవిద్యాలబ్ధియగు మార్గ మెయ్యది? గమ్యస్థానమును చేరుట ఎటుల?

భయపడ నవసరములేదు. ఉద్విగ్నత నొంద పనిలేదు. నిరాశ జెందవలదు. ఒక సులభమైన మార్గము గలదు.

"వరాన్ ప్రాప్య నిబోధత"

విజ్ఞానఘనులైన ఆచార్యుల నాశ్రయించి ఆ సులభ మార్గమును తెలిసికొనుడు.

వరాన్ = ఆ మార్గచోదకులు శ్రేష్ఠులైన ఆచార్య పురుషులే. అధ్యయన శ్రుతార్థసంపన్నులు వారు. కర్మఫల సాధనాపేక్ష యను సంసరణ బంధినుండి విముక్తులై ఆనంద విహాయసమున స్వేచ్ఛావిహార మొనర్చుచు స్వాతంత్ర్యవాయువుల కుక్షి నింపుకొనుచు యథేచ్ఛగా ఎచ్చటకేని, ఎప్పుడేగాని ఏ రూపముననేని సంచారముచేయుగల పరమహంసలు, పరివ్రాజకశ్రేష్ఠులు.

అట్టివారిని — ప్రాప్య=చేరి, ఆశ్రయించి, నిబోధత = తెలిసికొనుడు.

ఎటుల, ఎపుడు ఆశ్రయింపవలయును? సాధకుడు ఎట్టి యోగ్యత కలవాడై యుండవలయును?

తాను చతుర్వేద పారంగతుడను; శాస్త్రార్థములను మథించి, అందలి సారమును గ్రహించితిని; అను అహంకారమును విసర్జించవలయును. కామ్యకర్మప్రతిపాదితవాక్యములు — పరమార్థతత్త్వజ్ఞానమునకు ఇసుమంతేనియు తోడ్పడవు అను

దృఢనిశ్చయము ఏర్పడవలయును. సత్కర్మానుష్ఠానము స్వర్గాది సత్యాంతలోకములను మాత్రమే జేర్చును. గమ్యస్థానమును జేర్చు సామర్థ్యము – అందు శూన్యము; అని నిరాశ జెందవలయును.

"జాయతే గచ్ఛతేతి జగత్" పుట్టుచున్నది. బుద్బుద ప్రాయమై అంతలోనే నశించుచున్నది. కనుక ఈ చరాచర సృష్టి జగత్తు అనబడుచున్నది. ఇదియొక గంధర్వనగర సదృశము. ఒక స్వప్నదృశ్యము. సుస్థిరయానానందము లిట నాస్తి. ఇచటి భోగములు మీసాలపై తేనియలు. దారా పుత్ర గృహారామ క్షేత్రములు నన్ను బంధించుటకై ఒక మాయానిషాదునిచే పన్నబడిన జాలములు. వీనినుండి వెలువడవలెను. స్వేచ్ఛావిహంగమనై ఆనందవిహాయసమున విహరించవలెను అను ఉత్సాహము ఉరకలెత్తవలయును.

శ్రు॥ ఏకమేవా ద్వితీయంబ్రహ్మ
సర్వం ఖల్విదం బ్రహ్మ
తజ్జలానితి ఇదం సర్వం యదయమాత్మా
ఆత్మైవేదం సర్వం॥ —ఛాందోగ్యోపనిషత్తు.

తజ్జం = ఈ జగత్తు బ్రహ్మమునుండి పుట్టినది.

తల్లం = బ్రహ్మమునందే లయించును.

తదనితి = బ్రహ్మమువల్లనే ప్రవర్ధమగుచున్నది.

కనుక ఆత్మయే బ్రహ్మము. ఆత్మస్వరూపమే చరాచర జగత్తు. పిపీలికాది బ్రహ్మపర్యంతము సర్వమును ఆత్మచేతనే వ్యాప్తమైయున్నది.



శ్రు॥ స విశ్వతోవృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులమ్
పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యం
ఉతామృతత్వస్యేశానః యదన్నేనాతిరోహతి॥
— పురుషసూక్తము.

ఇట్టి సర్వాంతర్యామియొక్క అమృతపదము నాశించి యజ్ఞయాగాదులు జేసితిని. దానధర్మములు చేసితిని. వాపీ కూప తటాకాదులు నిర్మించితిని. అనాధశరణాలయముల నెలకొల్పితిని. గోసంరక్షణశాలల నిర్వహించితిని. కాని వానివలన ఆత్మోపలబ్ధి కాలేదు. అవి పునరావృత్తి హేతువులే యైనవి. చచ్చుటయు పుట్టుటయు లేని అమృతత్వమును ప్రసాదింపలేదు.

శ్లో॥ ఇంద్రియద్వార సంగ్రాహ్యైః గంధాద్యైః ఆత్మదేవతాం,
స్వయం భక్త్యా సమారాధ్య జ్ఞాతుం సోఽయం మహామఖః॥

ఇంద్రియ వికారముల నరికట్టవలెను. విషయసంఘాతమును జ్ఞానాగ్నియందు హవనమొనర్పవలయును. కర్మబీజములను మాడ్చి మసిచేయవలయును. 'అహం వృక్షస్యరేరివా' అహంకారమనే వృక్షమును మొదలంట పెరకివేయవలయును. అదియే మహాయాగమనబడును. అప్పుడుగదా గమ్యస్థానము సుగమమగును ?

అంతియేగాని నల్లని మేకను చంపి అగ్నికుండమున వేల్చి హవనమొనర్చి భుజించుట యాగమా ? కాజాలదు. ఇది యొక భ్రాంతి. అహో ! ఎంత పొరబడితిని. మాయామరీచికల వెంటాడి వృథాప్రయాసకు గురియైతిని. గర్భనరకమునకు త్రోవ సుగమము చేసికొంటిని. ఇది గాదు – నేను పయనించవలసిన మార్గము — అని సాధకుడు నిర్వేదము చెందవలయును.

శ్రు॥ ప్రాణేంద్రియా ద్యంతఃకరణ గుణాదేః పరతరం।
సచ్చిదానందమయ సర్వసాక్షికం నిత్యముక్త బ్రహ్మస్థానం
పరమం పదం॥

ప్రాణములు, ఇంద్రియములు, అంతఃకరణము – వీని యన్నింటికిని పరమై విలక్షణమై సాక్షియై భాసించు శ్రీయానంద పరబ్రహ్మమే నాకు శరణ్యము. అందు చేరగలుగుటయే పరమపదప్రాప్తి యనదగును. అదియే గమ్యస్థానములగు వైకుంఠ కైలాసముల జేరుట.

శ్రు॥ దేహోఽహమితి యత్ జ్ఞానం తదేవ నరకం స్మృతమ్॥
— తేజోబిందూపనిషత్తు.

దేహమే 'నేను' అనెడి అహంకారమే మహానరకము.

శ్రు॥ నివృత్తిః పరమా తృప్తిః ఆనందోనుపమస్మృతః॥
— అధ్యాత్మోపనిషత్తు.

విషయవృత్తులలో ఇంద్రియములను, ఇంద్రియసారథియైన మనస్సును, మనస్సుతో తాను వెనుదిరిగి ఆత్మాభిముఖముగా నడచుట నివృత్తిమార్గ మనబడును. అటుల నడువగా నడువగా కొంతకాలమునకు ఆత్మానుసంధాన మగును. ఆత్మయందు తాదాత్మ్యమును చెందుటయే "పరమతృప్తి" "పరమానందము" అనబడును అని గతమును విస్మరించి జాగృతి నొంది నూతిలోబడిన కుమారుని రక్షింప బరుగిడు గృహస్థుని వలె ఉత్కంఠుడై సాధనముల త్యజించి సమిత్కుశపాణియై గురూపసదనార్థమై "గురుం ఏవ అభిగచ్ఛేత్" ఆచార్యుల నన్వేషింప బయలుదేరవలయును.



దృఢసంకల్పము కలిగినపుడే గురూపసదన కాంక్ష ప్రబలును. జ్ఞానస్వరూప సద్వస్తుచ్ఛాయలు చిత్తముపై నించుకంత ప్రసరించినపుడు సంసార కారణములైన కామ్యకర్మల యందు విరక్తి కలుగును. అపుడుమాత్రమే సద్గురుని అన్వేషింపవలయునను ఇచ్ఛ జనించును. అధోగతుల బారినుండి విముక్తి నొందవలెనను దృఢసంకల్పము కలిగినప్పుడే గురూపసదన కాంక్ష ప్రబలును.

ఉత్తిష్ఠ! జాగృత! ప్రాప్యవరాన్నిబోధత! అను శ్రుతియొక్క శంఖనినాదము అప్పుడే సాధకునకు శ్రవణపేయముగా వినుపించును.

వ్యాకృతము, అవ్యాకృతము అని ప్రపంచము రెండు తెఱగులు. బీజాంకురములవలె నివి రెండును పరస్పరోత్పత్తి కారణములు. సహస్రానేకార్థ సంయుక్తములు. మాయామరీచికలవలె దోచి తాత్కాలికములై మరుక్షణముననే నశించుట నెరింగి విరక్తుడైన సాధకునకు మాత్రమే "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" యను భగవదనుశాసనరూపమైన ఉపాయమును గౌరవించును. చతుర్దశభువనములును కర్మచితములు. అనగా కర్మానుష్ఠాన గమ్యములు. కర్మకృతములు అగుటచేత అనిత్యములు. అకృతము అనగా చేయనిది. నిత్యమైనది ఒక్క మోక్షము. అదియే శరణ్యము అను తుదినిర్ణయము గలిగినపుడే "శిష్యస్తేహం శాధిమాం త్వాం ప్రపన్నం" అని సాధకుడు సద్గురు పదకమలముల నాశ్రయించును.

అటుల వరాన్ ప్రాప్య = ఆచార్యులను జేరి వినమ్రుడై పదములకెరగి ప్రపత్తిసారించి "స్వామీ! విషయసుఖ దోషోప

హతుడను, సంసారతాపత్రయాగ్ని సందగ్ధచేతసుడను, ధర్మాధర్మ వివేకజ్ఞానశూన్యుడను, ఈ దాసుని స్వీకరించి, ప్రబోధించి శ్రేయోమార్గము నుపదేశింపుడు" అని ప్రార్థించును.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥
— భగవద్గీత.

అటుల శాస్త్రోక్త శిష్టసాంప్రదాయానుసారము గురూపసదన మొనర్చినవాడును, దర్పాహంకారవివర్జితుడును, ప్రశాంత సమచిత్తుడును, బాహ్యోపరతిగల శమాన్వితుడును, ఆత్మతత్త్వ జిజ్ఞాసువునుయగు అంతేవాసికి (శిష్యునకు) అద్రేశ్యాదివిశేషణ విశిష్టమును, స్త్రీ-పుం శబ్దవాచ్యమును పరమార్థస్వభావగుణమగుటచేత సత్యమును, అక్షతమును, అక్షరమునుఅగు బ్రహ్మ బీజములను కృషీవలుడు సుక్షేత్రముననాటు బీజములవలె హృదయకేదారమున ఉపదేశవ్యాజమున నాటును.

బీజములు అంకురించి మొలకలై వృక్షమై దినదిన ప్రవర్ధమానమై మహావృక్షమై సుమధురఫలపుష్పసంభరితమై ముముక్షుపాంథులకు ఆశ్రయమిచ్చి సంసారయాత్రాపథశ్రాంతి నపనయించును.

సాధకసోదరా ! నీప్రశ్నకు ఇంకను వివరించి చెప్పదగిన సమాధానము ఎంతయోయున్నది. గ్రంథభారము పెరుగును. కనుక దిఙ్మాత్రముగా సూచించితిని. సత్సాంగత్యాది సాధనముల నూతగాగొని గమ్యస్థానముచేరనీ, చేయు ప్రయాణము ఎంతప్రమాదభూయిష్ఠమైనదో దుర్గమమైనదో శిశితమైనదో



అవగతమైనదిగదా ? నీవు తలచినటుల శ్రీగురువు బంధహేతువు గాడు. బంధవిముక్తి హేతువు. నీ స్వశక్తికి ఎన్నియో మడుంగులు ఎక్కుడు శ్రీగురుదేవుల శక్తిపాతము. అది లేనిచో పెట్రోలియములేని మోటారు శకటమువలె నిలచినచోటనే ఉండవలసినదే. అణుమాత్రముకూడ కాలు కదలుపనేరవు. ఇది సత్యము. దీనిని ఎన్నడును విస్మరింపకుము.

## ప్రణవ స్వరూపము.

ప్రణవ మనగా నేమి ?

శ్రు॥ ప్రణామయతి ఇత్యేతస్మాత్ ప్రణవః॥

జీవత్వాహంకారమును నశింపజేసి, సర్వకర్తృత్వాదికము పరమాత్మదే యను అనుభవమే ప్రణవము.

శ్రు॥ ప్రకర్షేణ నవత్వస్య హేతుత్వాత్ ప్రణవః స్మృతః॥
—సూ॥ సంహిత.

నిత్యపఠనచే నిత్యనూతనత్వమును పొందుచున్నది. కనుక ప్రణవ మనబడుచున్నది.

శ్రు॥ ప్రణూయతే యతః సర్వైః పదనిర్వాణ కాముకైః,
సర్వేభ్యోఽప్యధికః తస్మాత్ ప్రణవో యః ప్రకీర్తితః॥
—కాశీఖండము.

ఇది సర్వోత్కృష్టమగు మంత్రమగుటచేత మోక్షాభిలాషులగు సాధకు లందరును స్తుతించుచున్నారు; ధ్యానించుచున్నారు. కనుక ప్రణవ మనబడుచున్నది.

శ్రు॥ ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని
ప్రణామయతీత్యేతస్మాత్ ప్రణవః॥ —అథర్వశిఖోపనిషత్తు.

సర్వ ప్రాణములను పరమాత్మయందు లయింపజేయు చున్నది కనుక ప్రణవ మనబడుచున్నది.

శ్రు॥ సర్వాన్ ప్రాణాన్ సకృ దుచ్చరితమాత్రః
స ఏషః ఊర్ధ్వం ఉత్క్రామయతి ఇతి ఓంకారః॥
—అథర్వశిఖోపనిషత్తు.

శ్రు॥ సకృదుచ్చరితమాత్ర ఊర్ధ్వమున్నామయతీత్యోంకారః॥
— నిరాలంబోపనిషత్తు.

ఉచ్ఛ్వాస సమన్వితమైనది 'ఓం' అను శబ్దము. ఉత్ + చరించుట=అనగా ప్రాణము మూలాధారమునుండి సుషుమ్నా నాడి ద్వారమున సహస్రారమును పొందుట. ఒక్కపరి 'ఓం' అని దీర్ఘముగా ఉచ్చరించినంత మాత్రముననే ఊర్ధ్వగతిని పరమాత్మపదమును పొందింపును. అట్టితరి ప్రకృతిబద్ధుడైన జీవుడు ప్రకృతిరహితుడై బాహ్యస్మృతిని గోల్పోయి నిత్యనిరతిశయానందమును అనుభవించును. అట్టి తురీయాతీతస్థితిని పొందించు సాధనము ఒక్క ఓంకారోపాసనమే యగుచున్నది.

ప్రణవస్వరూపమే ఓంకారము. అది నిర్గుణబ్రహ్మ వాచ... అన్ని మంత్రములకును మూలాధిష్ఠానమగు ఆదిమంత్రము.

శ్రు॥ ఊర్ధ్వమూలో అవాక్ శాఖ ఏషోఽశ్వత్థస్సనాతనః
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే
తస్మిం౯ లోకాశ్శ్రితాస్సర్వే తమనాత్యేతికశ్చన
ఏతద్వైతత్ ॥
— కఠోపనిషత్.



అని భగవతి శ్రుతిచే నిర్దేశింపబడిన ఆత్మస్వరూపమే ప్రణవము. సమస్తప్రపంచము ప్రణవస్వరూపమగు ఓంకారమే. అది విశ్వజగదుత్పత్తికి మూలకందము. ఇంతియేగాదు. అది విశ్వజగద్వ్యాప్తము. విశ్వజగదతీతముకూడ ప్రణవమే.

శ్రు॥ ప్రణవః సర్వవేదేషు. — భగవద్గీత.

వేదములయందు ప్రణవస్వరూపుడను, నేను.

ప్రణవమైన ఓంకారమునందు వేదములన్నియు - బీజమునందు అంకురములవలె ఇమిడియున్నవి. అటులనే ప్రణవార్థమగు నాయందును సర్వవేదములును ఇమిడియున్నవి. అని భగవద్వాక్యము.

శ్రు॥ సర్వే వేదా యత్పద మామనంతి
తపాంసి సర్వాణిచ యద్వదంతి
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తేపదం సంగ్రహేణ బ్రవీమి 'ఓం' ఇత్యేతత్ ॥
— కఠోపనిషత్తు.

ఋగాది చతుర్వేదములును తత్సారములైన ఉపనిషత్తులును ఆ పరమపదమునే ఆ పరమలక్ష్యమునే ప్రతిపాదించుచున్నవి. అన్ని తెఱగుల తపస్సులకును గమ్యస్థానమదియే. గురుకులవాస నియమబద్ధ జీవితముచే విద్యార్థులు సాధింపబూను లక్ష్యమదియే. అదియే జీవబ్రహ్మైక్యదర్శన మనెడి భాగ్యమును కలిగించు ఆ పరమపదమే 'ఓం' కారము.

శ్రు॥ 'ఓం' ఇత్యేతదక్షర మిదగ్‌ం సర్వం తస్యోపవ్యాఖ్యానం
భూతం భవద్భవిష్యదితి సర్వం ఓంకార ఏవ॥

— మాండూక్యోపనిషత్తు.

చేతనాచేతనాత్మకమగు నీ పరిదృశ్యమానమగు విశ్వమంతయు ఓంకారాత్మకమే. భూతభవిష్యద్వర్తమానరూపమున కాలత్రయపరిచ్ఛిన్నమగు వ్యాకృతప్రపంచమంతయు ఓంకారస్వరూపమే. కాలముచే అపరిచ్ఛేద్యమగు అవ్యాకృతప్రపంచము సహితము ఓంకారస్వరూపమేగాని తద్భిన్నముగాదు. రజ్జ్వాదులు సర్పాదివికల్పముల కాస్పదమగుచున్నవి. అద్వయమగు పరమాత్మయు పరమార్థభూతమై ఇంద్రియప్రాణాది వికల్పముల కాస్పదమగుచున్నది.

శ్రు॥ వాచారంభణం వికారో నామధేయం
తస్యేదం వాచా తంత్యా నామభి ర్దామభి
స్సర్వం సితం సర్వగ్‌ం హీదం నామని॥

పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ రూపములుగా నేర్పడు అభిధానములు అభిధేయములు. అన్నియు తద్వికారవిశేషములు మాత్రమే యగుచున్నవి. అవియన్నియు ప్రణవాత్మకములే. కార్యకారణసంఘాతసాక్షిభూతమగు ఈ యపరోక్ష జీవచైతన్యము సహితము ప్రణవస్వరూపమే.

ఛాందోగ్యోపనిషత్తులోని ద్వితీయ ప్రపాఠకమునందలి త్రయోవింశతి ఖండమునందు ప్రణవమును గూర్చి ఈ దిగువ నుదహరించిన తెలుగున చెప్పబడినది.



"లోకములందు ఏది సారము ?" అని విరాట్పురుషుడ జిజ్ఞాస జేసెను. 'ఋగ్యజుస్సామ వేదములు సార'మని గోచరిం చెను. "వేదత్రయమునందును ఏది సారము ?" అని మరల ధ్యానించెను. 'ఓం భూః, ఓం భువః, ఓం సువః' అనెడి వ్యాహృతిత్రయమును సారమని తోచెను.

లోహమును అయస్కాంతమువలె ఆకర్షించి పట్టుకొని యుండునది వ్యాహృతి యనబడును. భూమి, అంతరిక్షము, స్వర్గము అను నీ మూడింటియందును విశ్వజగత్తు అంతర్గర్భితమై యున్నది. ఈ మూడింటికిని వ్యాహృతిత్రయమే ఆధారము.

వ్యాహృతిత్రయమునం దేది సారము ? అని మరల జిజ్ఞాస జేసెను. ఓంకారమే తత్సారమని నిర్ణయించెను. ప్రణవ నాదమే బ్రహ్మము (ఆత్మ) యొక్క శరీరము. జ్యోతిర్మయ రూపమున తన్నాదాంతర్గతమై 'ఆత్మ' గోచరించుచున్నది. అదియే ఊర్ధ్వమూల పదవాచ్యము.

ఒకే కాడయందు ఆకులు బంధింపబడియుండును. అటు లనే శబ్దబ్రహ్మము - అర్థబ్రహ్మము అనబడు లోహసదృశమైన నామరూపాత్మక జగత్తు - ప్రణవము అను అయస్కాంతముచే నాకర్షింపబడి అవినాభావసంబంధము గలిగియున్నది.

శ్రు॥ యశ్ఛందసాం ఋషభో విశ్వరూపః।
ఛందోభ్యోఽధ్యమృతా త్సం బభూవ॥

— తైత్తిరీయోపనిషత్తు.

యః = ఏయది, ఛందసాం = వేదములకు, ఋషభః = ప్రాధాన్యమైనదో, విశ్వరూపః = సర్వరూపమైనదో, సః =

ఆ ప్రణవము, అమృతాత్ = అమృతస్వరూపములగు, ఛందోభ్యః = వేదములయందు, సం బభూవ = సారభూతమై ప్రకాశించుచున్నది. అనగా వేదసారమే ప్రణవము.

విశేషార్థము:— పశుగణములందు శ్రేష్ఠమైనది వృషభము. ప్రణవ మిందు వృషభసాదృశ్యముచేత వేదములయందు శ్రేష్ఠమైనదిగా వర్ణింపబడినది.

'విశ్వరూపః' అనగా సర్వరూపమైనది. పరమాత్మయొక్క వ్యష్టి సమష్ట్యాత్మకములగు విశ్వ, తైజస, ప్రాజ్ఞ, విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతాది సర్వరూపములందును ప్రణవమే సూత్రాత్మగా గలదని భావము.

శ్రు॥ సముద్రా దూర్మి ర్మధుమాగ్ం
ఉదారదుపాగ్ంశునా సనామృతత్వమానట్ ।
ఘృతస్య నామ గుహ్యం యదస్తి
జిహ్వా దేవానా మమృతస్య నాభిః॥

శ్రు॥ వయం నామ ప్రబ్రవామా
ఘృతేనాస్మిన్ యజ్ఞేధారయామా నమోభిః ।
ఉపబ్రహ్మ శృణువచ్ఛస్య మానం
చతుశ్శృంగోఽవమీ ద్గౌర ఏతత్ ॥

— తైత్తిరీయోపనిషత్తు.

"ఘృతము" అనగా స్వప్రకాశాత్మకమగు "ఆత్మ" (బ్రహ్మము) అని ఇట గ్రహింపవలయును.

సముద్రమునుండి తరంగములు ఎటుల ఉత్పన్నమగుచున్నవో, అటులనే స్వప్రకాశాత్మక శ్రియానందస్వరూపుడైన



పరమాత్మనుండి ప్రాపంచికవిషయసుఖ మాధుర్యసమన్వితమగు విశ్వజగత్తు ఉత్పన్నమైనది.

"ఘృతస్య గుహ్యం నామ యదస్తి" స్వప్రకాశాత్మకమగు పరమాత్మయొక్క రహస్యమగు నామ మెయ్యది గలదో అదియే ప్రణవము - ఓంకారము అనబడుచున్నది. ధ్యానావసరమున ఉపాంశువుగా నుచ్చరింపబడుచున్న రహస్యనామమగు ప్రణవముచే సాధకుడు పునరావృత్తిరహితమగు స్వస్వరూపసాక్షాత్కృతిని బొందుచున్నాడు.

ఆ రహస్యమగునామమే 'దేవానాం జిహ్వా' = దేవతలకు నాలుకవంటిది. అక్షరమగు ప్రణవోపాసనచే దేవతలు అమృతాంధసు లనబడుచున్నారు.

ఆ రహస్యమగు నామమే 'అమృతస్య నాభిః' = అక్షరమగు మోక్షమునకు నాభిసదృశము.

రథచక్రమందలి మధ్యభాగముననుండు రంధ్రము నాభి యనబడును. ఆ నాభియే రథచక్రమున కాశ్రయము, ఆధారము. అటులనే ప్రణవముకూడ జన్మ జరామరణ వివర్జితమగు ఆత్మతత్త్వోపలబ్ధికి ఆశ్రయము. అనగా మోక్షాభిలాషియగు సాధకుడు ప్రణవమును ఆలంబనముగా గొనకతప్పదని భావము.

అట్టి ప్రణవస్వరూప మెట్టిది ?

శ్రు॥ చత్వారిశృంగా త్రయో అస్యపాదా
ద్వే శీర్షే సప్తహస్తాసో అస్య ।
త్రిధా బద్ధో వృషభో రోరవీతి
మహోదేవో మర్త్యాగ్ం ఆవివేశ॥ —తైత్తిరీయోపనిషత్తు.

సాధకులకు సుబోధకముగా నుండుటకై ప్రణవస్వరూప మిట వృషభసాదృశ్యమున నిరూపింపబడుచున్నది.

"చతుశ్శృంగోఽవమీ ద్గౌర ఏతత్ ॥"

అది నాలుగుకొమ్ములు గలిగిన, శుద్ధసత్త్వప్రధానమగు తెల్లనివర్ణము గల వృషభము. అది ఏమి చేయుచున్నది ?

"వృషభః మహాః రోరవీతి" ప్రణవ వృషభము.

ఆత్మతత్త్వమును అంబారవవ్యాజమున ప్రతిపాదించు చున్నది. ఆ ప్రతిపాదన వివర మెట్టిది ?

'అం' బమతి (వమతి) ఇతి అంబ.

అం = పరమాత్మను, వమతి = వెడలగ్రక్కుచున్నది. కనుక 'అంబ'. అదియే ఓంకారము.

"దేవః మర్త్యాన్ ఆవివేశ"

పరమాత్మ మనుష్యశరీరములను జీవరూపమున ప్రవేశించెను.

శ్రు॥ స వా ఏష ఇహ ప్రతిష్ఠ ఆనఖాగ్రేభ్యః॥

— బృహదారణ్యకోపనిషత్తు.

నఖశిఖ పర్యంతము పరమాత్మ మనుష్య శరీరముల యందు వ్యాపించియున్నాడు.

మనుష్యశరీరములు అనగా ఇచట పిపీలికాది బ్రహ్మాండమైన విశ్వజీవశరీరములు అని గ్రహింపవలయును.

అటుల ప్రవేశించిన జీవబ్రహ్మస్వరూప మెట్టిది ?



అస్య = ఈ పరమాత్మకు, చత్వారిశృంగాః = నాలుగు కొమ్ములు, పాదాత్రయః = పాదములు మూడు, ద్వేశీర్షే = శీర్షములు రెండు, హస్తాసః సప్త = చేతులు ఏడు, త్రిధా బద్ధః = మూడు విధములుగా కట్టివేయబడినాడు.

వివరణము:—చత్వారిశృంగాః = 'అ'కార 'ఉ'కార 'మ'కార అర్ధమాత్ర (నాదము) ఇవి నాలుగును శృంగములు.

1. అకారము:— జాగ్రదవస్థ. వ్యష్టి స్థూలశరీరము - తదభిమానియగు 'విశ్వుడు'. సమష్టి స్థూలశరీరము - తదభిమాని యగు 'విరాట్టు'.

2. ఉకారము:— స్వప్నావస్థ. వ్యష్టి సూక్ష్మశరీరము - తదభిమానియగు 'తైజసుడు'. సమష్టి సూక్ష్మశరీరము - తదభిమానియగు 'హిరణ్యగర్భుడు'.

3. మకారము:— నిద్రావస్థ. వ్యష్టి కారణశరీరము - తదభిమానియగు 'ప్రాజ్ఞుడు'. సమష్టికారణశరీరము - తదభిమాని యగు 'అవ్యాకృతుడు'.

4. అర్ధమాత్ర (నాదము):— తురీయావస్థ. వ్యష్టి దేహత్రయ సాక్షిగా నుండు 'ప్రత్యగాత్మ'. సమష్టి దేహత్రయ సాక్షిగా నుండు 'పరమాత్మ.'

పాదాత్రయః :— పాదములు అనగా "పద్యతే గమ్యతే బ్రహ్మతత్త్వం ఏభిః ఇతి పాదాః" ఆత్మతత్త్వసాధము నధిరోహించుటకు ద్వారసదృశులుగా నున్నారు. సాధనభూతులగుచున్నారు. కనుక విశ్వ, తైజస, ప్రాజ్ఞులును;

విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులును; వ్యష్టి సమష్టి ప్రపంచములయందు మూడు పాదములుగా మూడు సోపానములుగా గ్రహింపబడినారు.

ద్వేశీర్షే:— చిదచిద్రూప శక్తిద్వయమే రెండుశీర్షికలు. వ్యాకృత అవ్యాకృత జగత్తులే రెండుశీర్షికలు.

హస్తాసః సప్త:— భూర్భువస్సువరాది ఏడు లోకములే ఏడు హస్తములు.

త్రిధా బద్ధః :— పిండాండమందు – విశ్వ తైజస ప్రాజ్ఞులగాను, బ్రహ్మాండమందు – విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతుల గాను, మూడువిధములైన సూత్రములుగా ముప్పురిచే వేయబడిన పాశముచే కట్టివేయబడినాడు.

సారాంశము:— నాలుగుకొమ్ములు; మూడుపాదములు; రెండు తలలు, ఏడు హస్తములు గల ప్రణవవృషభము – స్వప్రకాశాత్మక స్వస్వరూప సాక్షాత్కృతిసాధనమును అంబారవవ్యాజమున ప్రతిపాదించుచున్నది. జీవబ్రహ్మై కత్వ దర్శనరూపమగు అద్వైతసిద్ధాంతమును చాటు చున్నది.

శ్రు॥ త్రిధాహితం ఫణిభి రుహ్యమానం
గవి దేవాసో ఘృతమన్వవిన్దన్
ఇంద్ర ఏకగ్ం సూర్యఏకం జజాన
తేనాదేకగ్గ్ం స్వధయా నిష్టతక్షుః॥

— తైత్తిరీయోపనిషత్తు.



త్రిధాహితం = 'అ'కార 'ఉ'కార 'మ'కార శబ్దవాచ్యులైన సమష్టి శరీరత్రయాభిమానులగు విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులు.

"ఫణిభిః గుహ్యమానం ఘృతం గవి దేవాసః అన్వవిందన్"

ఆత్మవేత్తలచేత బహుసూక్ష్మముగా స్తోత్ర మంత్ర రూపమున వర్ణింపబడిన మహావాక్యములను సద్గుర్వాశ్రయణముచే శ్రవణాదులు సలిపి ఉపాధుల మిథ్యాత్వము గ్రహించి ('జీవ'ఉపాధియగు అంతఃకరణము – దానియందుప్రతిబింబించిన చిదాభాసునీ, ఈశ్వర ఉపాధియగు మాయ – అందు ప్రతిబింబించిన ఆభాసునీ త్రోసిపుచ్చగా ఉభయోపాధులయందును ప్రతిబింబించిన ఆత్మస్వరూప చైతన్యమును ఒక్కనిగానే గ్రహించి) జీవబ్రహ్మైక్యత్వమును సాధించి బ్రహ్మానుభవమును పొందగలిగిరి.

అటుల బ్రహ్మానుభవమును సాధించిన ముప్వురియందును 'ఇంద్రః ఏకం జజాన' = పరమైశ్వర్యయుక్తుడగు విరాట్పురుషుడు జాగరణరూపమును సృజించెను. 'సూర్యః ఏకం జజాన'= సూర్యసదృశ మహాతేజస్వియగు హిరణ్యగర్భుడు మరియొక దానిని స్వప్నరూపమున కలుగజేసెను. 'తేనాత్ ఏకః' = సర్వ దుఃఖ రహితుడగుటచే కమనీయుడగు అవ్యాకృతునివలన ఇంకొకటి అనగా సుషుప్తిరూపము కలిగెను.

ఈ విధముగా ఇంద్ర, సూర్య, వేనులు అను నామాంతరములచే వర్ణింపబడిన విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులు – 'స్వధయా నిష్ఠ తక్షుః' = అన్యోన్యాశ్రయభూతమగు స్వప్రకా

శాత్మకమగు ఆత్మశక్తిప్రభా సమన్వితులై వ్యష్టిజగత్తునందు జాగ్రత్స్వప్న సుషుప్తులను అవస్థాత్రయమును, తదభిమానశరీరములను; సమష్టిజగత్తునందు భూర్భువస్సువరాది లోకములను, తదభిమాన శరీరములను; సృజించిరి. రూపొందించిరి.

"ఏతావానస్య మహిమా" స్వస్వరూప సాక్షాత్కృతి నొందిన మహాత్ములు పరమాత్మస్వరూపులేయగుట పరమాత్మ యొక్క శక్తిసామర్థ్యములను స్వతస్సిద్ధముగనే పొంది, ఉత్పత్తి స్థితి లయములకు కారణభూతు లగుచున్నారు.

ప్రణవోపాసన స్వస్వరూప సాక్షాత్కృతికి సులభ మార్గము. తరణోపాయము.

పరస్పర సమాగమన ఆలింగనేచ్ఛలచే మనము ఐహిక సుఖములను అభీష్టములను సిద్ధింపజేసికొనుచున్నాము. ఇదియే సూత్రమును జీవబ్రహ్మైక్యానుసంధానమునందును అన్వయింప జేసికొని ప్రణవము నుపాసించి స్వస్వరూపసాక్షాత్కృతిని ఈ జన్మయందే పొందగలమనుటలో ఆవంతైనను సందియము లేదు. పరాశక్తియు, పరాశివుడును పురాణదంపతులు. ఆది మిథునము. వారుకూడ ప్రణవస్వరూపులే. ఓంకారము శివ ప్రణవము. ఉమాశబ్దము శక్తిప్రణవము. ఇంచుకంత వ్యత్యస్తముగా ప్రణవాంగములు సమానములే. కనుక ఆ పురాణదంపతుల సగుణరూపమున నారాధించి, సాధకులు అభీష్టసిద్ధిని సులభముగా నొందవచ్చును.

శ్రు॥ 'ఓం' ఇత్యేత మక్షరమిదం సర్వం 'ఓం'కారజీవ॥

— మాండూక్యోపనిషత్తు.



చతుర్దశభువనములును ఓంకారమునుండియే ఉత్పన్నమైనవి. చరాచరవస్తుసంఘాతము ఓంకారమునుండియే గలిగినది. దృశ్యాదృశ్యపదార్థములన్నియు ఓంకారస్వరూపములే అని మాండూక్యోపనిషత్తు చెప్పుచున్నది.

(1) జీవుడు (2) శరీరము. ఈ రెండును ఓంకారస్వరూపము లెట్టులైనవి ? వివరించి చెప్పుడు.

శ్రు॥ అష్టాంగంచ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతం,
ఓంకారం యో నజానాతి నభవేత్ బ్రాహ్మణస్థు సః॥

— ధ్యాఃబిందూపనిషత్తు.

ఎనిమిది అంగములు, నాలుగు పాదములు, మూడు స్థానములు, ఐదు దేవతలు అను వీనియన్నింటితో గూడినదే ఓంకారము. ఇవియన్నియు మనశరీరమునందే యున్నవి. కనుక ఓంకారమే శరీరమనబడుచున్నది.

వివరములు :— సమష్టి వ్యష్టి శరీరములు ఈశ్వర జీవ తత్త్వములచే నేర్పడినవి అని ఇతఃపూర్వమే వివరింపబడినది.

ఈశ్వరతత్త్వమందు మాయాప్రతిబింబము మహాకారణ శరీరము అనబడుచున్నది. విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతములు ఈశ్వరునియొక్క స్థూల సూక్ష్మ కారణశరీరములు. మహాకారణశరీరముతో కలసి ఈశ్వరశరీరములు నాలుగు.

జీవతత్త్వమందు అంతఃకరణప్రతిబింబమే మహాకారణ శరీర మనబడుచున్నది. విశ్వ; తైజస; ప్రాజ్ఞులు జీవునియొక్క స్థూల సూక్ష్మ కారణశరీరములు. అంతఃకరణప్రతిబింబము అగు మహాకారణశరీరముతో కలసి జీవుని శరీరములు నాలుగు.

పైన వివరించిన తెఱగున జీవేశ్వరుల శరీరములు వెరశి ఎనిమిది. ఇవియే ఓంకారముయొక్క అష్టాంగములు అని చెప్పబడినవి.

త్రిస్థానములు :

1. 'హంస'శబ్దమునందు 'హ'కారము శివస్థానము. 'స'కారము శక్తిస్థానము. బిందువు శివశక్త్యైక్యస్థానము.
2. సూర్యుడు, చంద్రుడు, అగ్ని.
3. నాదము, కళ, బిందువు.
4. అకారము, ఉకారము, మకారము.

ఇవి యన్నియు త్రిస్థానములు అని చెప్పబడినవి.

చతుష్పాదములు :

1. భ్రూమధ్యము, కంఠము, హృదయము, నాభి.
2. జాగ్రత, స్వప్నము, సుషుప్తి, తురీయము.
3. అవిద్యాపాదము, సువిద్యాపాదము, ఆనందపాదము,తురీయ పాదము.
4. పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ.

ఇవి యన్నియు చతుష్పాదములని చెప్పబడినవి.

పంచదైవతములు :

1. బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివులు. ఇవి పంచ భూత అధిదైవతములు.



2. పృథివి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము. ఇవి పం
భూతములు.
3. న, మ, శి, వా, య – ఇవి పంచాక్షరములు.
4. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానమ
ఇవి పంచప్రాణములు.

ఇవి యన్నియు సమష్టిగా పంచదైవతములు అనబడున

అష్టాంగములు, త్రిస్థానములు, చతుష్పాదములు, పం
దైవతములు – ఇవి యన్నియు చేరి పాంచభౌతికమగు మన శ
రమునందేయున్నవి. కనుక మనశరీరమే ఓంకారప్రణవస్వరూ
మని చెప్పబడినది. శాక్తబంధువులు సహితము శ్రీచక్రము
పాంచభౌతిక శరీరముగా భావించి తన్మధ్య బిందుపీఠమునం
జగన్మాతయగు శ్రీ రాజరాజేశ్వరీ పరాభట్టారికను ప్రతిష్ఠిం
ఉపాసించి తరించుచున్నారు.

జీవుడే ఓంకారస్వరూపము. వ్యష్టిజీవునకు జాగ్రదా
తురీయాంతమగు చతుర్విధావస్థలు పరిణామములు గలవు.
యవస్థలు మరల నొక్కొక్కటి నాలుగు భాగములుగా వి
జింపబడి వెరశి జాగ్రదాదులు పదునాఱుభాగము లైనవి
వీనినే "షోడశకళలు" అనియు, అవయవములనియు చెప్పనగును

వివరములు — జాగ్రదవస్థ.

1. జాగ్రతలో జాగ్రత:— ఒక విషయమును వినునప్పుడుగా
సద్గ్రంథశ్రవణము చేయునప్పుడుగాని తెలిసికొనదగి
విషయములన్నియు నడిగి సమగ్రముగా గ్రహించ
మరల మరచిపోకుండుట.

2. జాగ్రతలో స్వప్నము:— ఒక గ్రంథమును పఠించునపుడు గాని, ఒకరు పఠింపగా వినునప్పుడుగాని అశ్రద్ధగా పరాకుగా నుండుటచేత ఆవిషయము సరిగా జ్ఞప్తియందుండకపోవుట.

3. జాగ్రతలో సుషుప్తి:— సద్గ్రంథశ్రవణముచేయుచు అటు పూజ్యులసన్నిధిని కూర్చుండియు మనస్సును తాను శ్రవణముచేయుచున్న విషయములందు లగ్నముచేయక అన్యమనస్కతతో అస్థిమితచిత్తముతో వ్యాకులత్వమున నుండుట.

4. జాగ్రతలో తురీయము:— సద్గురుసేవాభాగ్యమున అలవడిన తత్త్వజ్ఞానమునుమరచిపోవక ఏకాంతస్థలమునగూర్చుండి గురుని ఉపదేశములను మననము చేయుచుండుట, ఇతరులకు తెలియజెప్పుట.

## స్వప్నావస్థ.

5. స్వప్నములో జాగ్రత:— స్వప్నమున తాను గాంచిన విషయములను జాగ్రదవస్థయందు జ్ఞప్తియందుంచుకొనుట.

6. స్వప్నములో స్వప్నము:— స్వప్నదృశ్యములు జాగ్రదవస్థయందు సరిగా జ్ఞప్తియం దుండకపోవుట.

7. స్వప్నములో సుషుప్తి:— స్వప్నదృశ్యములు ప్రయత్నించినను స్మృతికి రాకపోవుట.

8. స్వప్నములో తురీయము:— స్వప్నదృశ్యములందలి సుఖదుఃఖములకు స్వాధీనుడుకాక, అవి యన్నియు మనో



వికారములు మాత్రమే యని గ్రహించి ఆత్మత[...]
జిజ్ఞాసాపరుడగుట.

## సుషుప్త్యవస్థ.

9. సుషుప్తిలో జాగ్రత:— గాఢనిద్రనుండి జాగృతి నొ[...]
తాను అనుభవించిన సుఖనిద్రను గూర్చి ఇతరు[...]
చెప్పుట.

10. సుషుప్తిలో స్వప్నము:— గాఢనిద్రనుండి మేల్కాం[...]
తదుపరి తాను పొందిన సుఖము ఇట్టిదని సరిగా జ్ఞ[...]
యం దుండకపోవుట.

11. స్వప్నములో సుషుప్తి:— గాఢనిద్రయందలి సుఖాను[...]
మును ప్రయత్నించియు చెప్ప లేకపోవుట.

12. సుషుప్తిలో తురీయము:— తాను పొందిన సుషుప్త్య[...]
అజ్ఞానసంజనితము; విషయసుఖములకు తాను [...]
సాక్షిమాత్రుడను మాత్రమేనని నిశ్చయించుట.

## తురీయావస్థ.

13. తురీయములో జాగ్రత:— ఆత్మనిష్ఠయందున్నపుడు క్షు[...]
పిపాసా బాధితుడై ప్రపంచవృత్తి కలుగుట.

14. తురీయములో స్వప్నము:— ధ్యానసమయమున క్షు[...]
పిపాసా బాధలు తోచియు తోచకుండుట.

15. తురీయములో సుషుప్తి:— ఆత్మనిష్ఠయందు ఎవ్విధ[...]
సంకల్ప వికల్పములును లేక నిశ్చలముగా నివాతదీప[...]
వలె అఖండైక రసస్వరూపమున నుండుట.

16. తురీయములో తురీయము:— పైన వివరింపబడిన పంచ దశా పరిణామములను వరుసగా ఒండొంటియందు లయమగుచు రాగా రాగా కట్టకడపట శ్రియానంద స్వప్రకాశాత్మక ఆత్మతేజస్వరూపమగు షోడశిని స్వస్వరూపముగానే భావించి నిశ్చలజ్ఞానసమాధియందు నిమగ్నుడై యుండుట.

ఈ షోడశాంశమే సర్వోత్కృష్ట పరమపదము. 'ఏతద్వై తత్' ఊర్ధ్వమూలపదవాచ్యమగు 'ఆత్మ' 'బ్రహ్మము' అనబడు అక్షరమగు వస్తువు అదియే. సాధకుని జీవితలక్ష్య మదియే.

అదియే షోడశావయవ పరిపూర్ణమైన ఓంకార స్వరూపము. మాండూక్యోపనిషత్తు – ఓంకార 'జీవ' యని, జీవుడే (ప్రణవమని) ఓంకారమని చెప్పుట పై కారణములచేతనే.

ఈ షోడశాంశమగు తురీయ తురీయావస్థ శబ్దరహిత స్థానము. దీనికి నామము లేదు. వ్యవహారము లేదు. ఇది శుద్ధ చైతన్యము.

జాగ్రదాది అవస్థాత్రయాతీతస్థాన మిది. విశ్వ, తైజస, ప్రాజ్ఞులను అతిక్రమించి ద్వైతబుద్ధిని రూపుమాపి అద్వైతసిద్ధిని పొందించు అమృతధామ మిది. "త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః" అని భగవతిశ్రుతిచే నిర్దేశింపబడిన, సర్వోత్కృష్టమైన, సర్వ చైతన్యాధిష్ఠానమైన దివ్యధామ మిది.

దిక్సూచీ యంత్రమునందలి ముల్లువలె అద్వితీయ పరమాత్మను సూచించు మేటిలేని సాధన మిది.



ఇదియే ప్రణవము. దేహాత్మభ్రాంతిని పోగొట్టు దివ్యాంజనము ప్రణవస్మరణము. స్వస్వరూపసాక్షాత్కృతి నొందించి సాధకుని ప్రణవస్వరూపునిగా, పరమాత్మస్వరూపునిగా రూపొందించగల దివ్యశక్తి ప్రణవోపాసనయందు గలదు. కనుక ముముక్షువులకు ప్రణవోపాసనయే శరణ్యము.

"ప్రణవా దపరం జప్త్వా కదా ముక్తో భవిష్యతి" ప్రణవముకంటె భిన్నములైన మంత్రములను జపించిన ఎన్నటికి ముక్తి లభించును ? అని శాస్త్రములే శంకించుచున్నవి.

"ఓంకారః సర్వమంత్రాణా ముత్తమః పరికీర్తితః" అన్ని మంత్రములయందును సర్వోత్కృష్టమంత్రము ఓంకారము అని ఆత్మవిదుల మతము.

"ఓంకారేణ ప్లవేనైవ సంసారాబ్ధిం తరిష్యతి" భవసాగరమును తరించుటకు నావవంటిది 'ఓం'కారము. తత్సాధనము చేతనే సాధకుడు గమ్యస్థానమును చేరవలసియున్నది.

'ఓం' ఇత్యేతదక్షరం పరంబ్రహ్మ తదేవోపాసితవ్యమ్॥ ఓం.

ఓం తత్ సత్.

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా మమృతం గమయ ॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

—♦—

